# Andhra Legislative Assembly.

**Thursday, the 9th August 1956**

The House met in the Assembly Hall, Kurnool, at eleven of the clock, Mr Speaker (The Hon Sri R Lakshminarasimham Dora) in the chair.

## QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS

*Location of the Board of Revenue after formation of the New State*

1—

* 35 Q —Sri P. GOPALAKRISHNA REDDI Will the Hon the Chief Minister be pleased to State—

Whether it is a fact that the Board of Revenue will be located at Kurnool after the formation of the New State?

THE HON. SRI Dr. B. GOPALA REDDI Until the position regarding accommodation at Kurnool and Hyderabad and the future set up after the integration of Telangana with Andhra become clearer, it is not possible to say whether the Board of Revenue will be located at Kurnool after the formation of the New State.

Sri S VEMAYYA· అధ్యక్షా: ప్రస్తుతము హైదరాబాదుకు పోతున్నాము కాబట్టి, ఈ Revenue Board ను కర్నూలులోగాని, మరొకచోటగాని పెట్టి ప్రజలకు కష్టం కలిగించ కుండా, హైదరాబాదులోనే దీనిని locate చేయడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా?

Mr. SPEAKER. You are repeating the question?

THE HON. Dr. B. GOPALA REDDI: సాధ్యమైనంతవరకు ఆ విధంగానే చేయవలెననే ఉద్దేశము. కాని అక్కడ ఉన్నటువంటి అవకాశాన్ని బట్టి ఈ విషయము ఆలోచించవలసి యుంటుంది.

Sri L. LAKSHMANA DAS: ఈ Board of Revenue ను abolish చేసే ఉద్దేశమేమైనా ఉందా ప్రభుత్వానికి?

The Hon. Dr. B. GOPALA REDDI: అటువంటి వుద్దేశాలేమి లేవు.

Sri V. VISWESWARA RAO అధ్యక్షా, హైదరాబాదులో ఇదివరకే ఒక Revenue Board ఉన్నది. మనకు ఒకటి ఉన్నది. ఇవి రెండు కలిసి ఒకే చోట (ఎక్కడైనాసరే) ఉంచడానికి ప్రభుత్వము ప్రయత్నం చేస్తుందా ?

The Hon Dr B. GOPALA REDDI తప్పకుండా ఆలోచిస్తాను.

*Dodaghatta Tank in Rayadrug Taluk*

2—

* 23 Q.—Sri N C. SESHADRI Will the Hon the Deputy Chief Minister be pleased to State—

(*a*) whether it is a fact that the estimates for raising the F T. L of Dodaghatta tank in Rayadrug taluk has been pending with the Government since six months, and

(*b*) if so, the reasons therefor ?

THE HON Sri N SANJEEVA REDDI. (a) and (b) As the proposed, Tungabhadra High Level Canal will give steady supply to the Dodaghatta tank without raising its F T L the Government do not propose to raise the F T L. of the tank at present

*Breaches to Adapaka Channel*

3—

* 27 Q.—Sri M. SATYANARAYANA RAJU Will the Hon. the Minister for Revenue be pleased to state—

(*a*) when the Adapaka channel in Cheepurupalli taluk, was breached;

(*b*) whether the Government propose to take up its repair work,

(*c*) whether the Government received any application from the villagers of Meraka Mudidam in connection with the repair work of Billa Gedda channel at Vootapalli in Cheepurupalli taluk, and

(*d*) if so, the action taken thereon ?

THE HON Sri K. CHANDRAMOULI — (a) Adapaka channel in Cheepurupalli taluk was breached during the heavy rains in May and September 1955.

(b) Repairs to this channel have already been undertaken and the work is under progress.

(c) and (d) — No representation has been received by the Government from the villagers of Maraka Mudidam village urging repairs to the Billa Gedda channel at Vootapalli in Cheepurupalli taluk

Sri M SATYANARAYANA RAJU ఈ అడపాకా Channel 1951 లో breach అయిందని ప్రభుత్వానికి తెలుసునా ?

Mr SPEAKER అప్పుడూ పోయి ఉండవచ్చును, మరల ఇంకొకమారి పోయి ఉండవచ్చును.

Sri M SATYANARAYANA RAJU అప్పుడు పోయినదానికి ఇప్పటివరకు ఎందుకు మరమ్మతు చేయలేదో తెలియచేస్తారా ?

The Hon Sri K CHANDRAMOULI ప్రత్యేకంగా ఈ మరమ్మతులన్నీ కూడా జరుగుతున్నాయి. ఎడమ ప్రక్కన కాలవకు అయిదువేలు, కుడి ప్రక్కన కాలవకు 42 వేలు sanction చేయడం జరిగింది. ఆ work తీసుకోవడం కూడ జరిగింది.

Sri PILLALAMARRI VENKATESWARLU ఈ డబ్బు ఏ సంవత్సరం sanction అయింది. అందులో ఇప్పటికి ఎంతవరకు ఖర్చు అయింది ?

The Hon Sri K. CHANDRAMOULI May and September 1955 లోనని ఇదివరకే నా answer లో చెప్పాను.

Sri PILLALAMARRI VENKATESWARLU · ఇప్పటికి ఆ డబ్బు ఎంత వరకు ఖర్చు అయింది ?

( No answer )

*Municipal Hospital at Guntakal.*

4—

* 76 Q —Sri M' RAJARAM, Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of working Staff in Municipal Hospital at Guntakal;

(b) the number of daily attendance of Patients; and

(c) the amount spent on medicines for 1955-56?

The Hon. Sri K. VENKATA RAO.

(a) the following is the staff employed in the Municipal Allopathic dispensary, Guntakal.

One Assistant Surgeon
One Compounder
One Midwife
One Male Nursing Orderly
One Female Nursing Orderly
One Cook cum waterman
One Thoty
One watchman

(b) the daily average attendance of patients treated in the dispensary is 171

(c) Rs 3,410—15—7

(a) ఈ క్రింది సిబ్బంది గుంతకల్లు Municipal Allopathic Dispensary లో ఉన్నారు :—

1 Assistant Surgeon
1 Compounder
1 Midwife
1 మగ Nursing orderly
1 ఆడ Nursing orderly
1 Cook
1 తోటి.
1 Watchman

(b) ప్రతిరోజు వచ్చేటటువంటి patients సగటు హాజరు 171

(c) Rs. 3410—15—7.

Sri N C SESHADRI గుంతకల్లు చాలా పెద్ద. important town కాబట్టి అక్కడ ఒక Lady Assistant Surgeon కూడా లేకపోవడంవల్ల ప్రజలు చాలా ఇబ్బంది పడుతున్నారు. కనుక అక్కడ ఒక Lady Assistant Surgeon ను post చేసేందుకు ప్రభుత్వము పూనుకొంటుందా ?

The Hon. Sri K VENKATA RAO Municipal Dispensaries లో Lady Assistant Surgeon ను గాని, Male Assistant Surgeon ను గాని ప్రభుత్వము వేయదు. అది మునిసిపాలిటీ వేసుకోవలసిందే.

Sri M NAGI REDDI రోగుల రోజువారి సంఖ్య 171 అని చెప్పారు. ఈ లెక్కల ప్రకారం, సంవత్సరానికి మొత్తము 50 వేల వరకు patients ఉంటారు. కాని మందులకేమో సంవత్సరానికి 3,400 రూపాయలు మాత్రమే ఇస్తున్నారని చెప్పుతున్నారు. ఇది చాలా స్వల్ప మొత్తము గనుక ఈ మొత్తాన్ని పెంచడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon Sri K. VENKATA RAO ఇదివరకే చెప్పాను. పెంచవలసిన డబ్బు ఏదైనా మునిసిపాలిటీ పెట్టుకోవలసిందే.

*Representation from the public of Amidyala, Etc., Villages for the establishment of a Rural Bank.*

6—

*8 Q — SRI M. RAJARAM Will the Hon the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(a) whether any representation was received from the public of Amidyala, and near by villages of Gooty taluk, Anantapur district, for the establishment of a Rural Bank, and

(b) if so, whether any action was taken on such representation?

The Hon. Sri D. SANJIVAYYA —

The matter has been referrded to the Registrar of Co-operative Societies. His report is awaited.

Sri S VEMAYYA. ఈ నివేదిక ప్రభుత్వానికి ఎప్పుడు అందింది? ఎప్పుడు దానిని Registrar కు పంపించారు ?

The Hon. Sri D. SANJIVAYYA: ఇది రెండు, మూడు మాసాల క్రిందట అందింది. Registrar కు వెంటనే పంపించాము. త్వరలో రిపోర్టు వస్తుంది.

*Bridges on Chinnahulthi, Hundri and Nallavagu.*

7—

*99 Q—Sri P. HANUMANTHA REDDY Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) whether the construction work of the bridges on Chinnahulthi, Hundri, Nallavagu on the Pattikonda-Adoni road has been stopped, and

(b) if so, the reasons therefor?

The Hon. Sri A. B NAGESWARA RAO —

(a) Chinnahulthi is a village at mile 25/6 of Gooty Pathikonda Adoni Road and no bridge is under construction at the place referred to by the Hon. Member The work relating to the construction of the bridges across Hundri and Nallavagu has been stopped

(b) In view of the financial stringency the Government have not allotted funds for the disbursement to the District Boards during 1956-57 for completing the incomplete Post War Road Development works. As such the works in question could not be taken up for execution in 1956-57

Sri VAVILALA GOPALAKRISHNAIYYA ఇదివరకు పూర్తిచేయని bridges కూడ పూర్తిచేయడానికి మేము పూనుకోవడంలేదని అంటున్నారు. ఇక వాటి గతి ఏమైనట్లో తెలియజేస్తారా ?

The Hon Sri A.B NAGESWARA RAO· డబ్బు ఎప్పుడు వస్తే అప్పుడు చేయిస్తారు.

Sri PILLALAMARRI VENKATESWARLU· ఆ bridge కోసం ఎంత డబ్బు ఖర్చుపెట్టిన తరువాత పని ఆపుచేశారు ?

The Hon. Sri A B NAGESWARA RAO హంద్రీ bridge మీద 60,659 రూపాయలు ఖర్చుపెట్టిన తరువాత ఆపారు. నల్లవాగుమీద 52,375 రూపాయలు ఖర్చుపెట్టిన తరువాత ఆపారు.

Sri PILLALAMARRI VENKATESWARLU. ఇంకా ఎంత డబ్బు ఖర్చుపెడితే ఆ bridge పూర్తి అవుతుందో చెప్పగలరా ?

The Hon Sri A B. NAGESWARA RAO. హంద్రీ bridge కి ఇంకా 60,000 కావాలి. నల్లవాగుమీద bridge కి 40,000 కావాలి.

Sri VAVILALA GOPALAKRISHNAYYA అయ్యా, ఆ మొత్తము కోసం ఆగితే, ఈ మొత్తమంతా వృధా అయిపోతుంది. ఆ రాళ్లు అన్నీ మునిగి పోతాయి. అందువల్ల ప్రభుత్వానికి ఈ డబ్బుకూడా నష్టమవుతుంది. కనుక ప్రభుత్వము దానికోసం ప్రత్యేకంగా వెంటనే funds allot చేసి పని పూర్తి చేయిస్తారా ?

The Hon Sri A B NAGESWARA RAO ఇది జిల్లా బోర్డు వ్యవహారం గనుక జిల్లా బోర్డు Special Officer గనుక ప్రభుత్వమునకు వ్రాసుకొన్నట్లయితే ప్రభుత్వము ఆలోచిస్తారు.

Sri PILLALAMARRI VENKATESWARLU ఇది జిల్లా బోర్డు అంటె ప్రభుత్వానికి ఏమి సంబంధం లేదనా ?

The Hon Sri A B NAGESWARA RAO ప్రభుత్వానికి కూడ సంబంధం వస్తుంది కాని, డబ్బు ఖర్చుపెట్టె విషయంలో జిల్లా బోర్డుదే.

Sri P SREERAMULU ఈ జిల్లా బోర్డులకు సంబంధించిన రోడ్ల విషయం గాని, bridges విషయంగాని ప్రభుత్వాన్ని అడిగితే, మాకు అవి సంబంధం లేదంటారు. జిల్లా బోర్డులను అడిగితే, ప్రభుత్వమునుంచి grants రాలేదంటారు. జిల్లా బోర్డులకు గల సంబంధాన్ని తేల్చి, బోర్డుపనులకు, గ్రాంట్లు సమృద్ధిగా యిప్పిస్తారా?

Mr. SPEAKER The Hon Member is going to a general question from a particular question.

The Hon Sri A B NAGESWARA RAO ప్రభుత్వము యొక్క ఆర్థిక పరిస్థితి బాగుపడినప్పుడు.

Sri VIJAYA BHASKARA REDDI జిల్లా బోర్డులు ఈ విధంగా అవకతవకలు చేస్తూ ఉంటేనూడా, ప్రభుత్వము తెలిసి ఊరకుంయిందా? దానిపైన ప్రభుత్వము ఏమైనా చర్య తీసుకొంటుందా?

The Hon. Sri A B NAGESWARA RAO అవకతవకల మూలానూ, డబ్బు లేకపోవడం మూలాను ఆ విధంగా జరుగుతుంది.

Sri V. VISWESWARA RAO అధ్యక్షా, కొన్ని కొన్ని పనులలో 60 వేలు, 40 వేలు ఖర్చుపెట్టి మధ్యలో విడిచిపెడుతున్నారు. కనుక కొత్త పనులు ప్రారంభించ డానికి ముందు, వాటికి కేటాయించిన డబ్బుతో ఇదివరకు నిలచిపోయిన పనులను పూర్తిచేయడానికి ప్రభుత్వము చర్య తీసుకొంటుందా?

The Hon Sri A B NAGESWARA RAO తప్పకుండా ఆలోచిస్తాము.

*Folk Dance Parties for the Republic Day Celebrations of 1956 at Delhi*

9—

*183 Q.—Sri VAVILALA GOPALAKRISHNAYYA will the Hon the Chief Minister be pleased to state—

(a) the amount of money spent in sending the folk dance parties for the Republic Day Celebration of 1956 at Delhi from Andhra, and

(b) who are the persons so sent?

The Hon Dr. B GOPALAREDDI

(a) No folk dance parties were sent to Delhi from this State in connection with the Republic Day Celebrations of 1956 and no amount was therefore spent on this account

(b) Does not arise

Sri VAVILALA GOPALAKRISHNAYYA ఆంధ్రులు డిల్లీకిపోయి జాతీయ నృత్యాన్ని చేశారే, వారు ప్రభుత్వంద్వారా వెళ్లారా? లేక కేంద్రప్రభుత్వం వారే Direct గా పిలిపించారా?

The Hon Dr B GOPALAREDDI ఇది యీ ప్రభుత్వం ద్వారా జరిగిన విషయముకాదు. అది ఢిల్లీలోవున్న ఆంధ్ర అసోషియేషన్ వారు ఏర్పాటుచేశారు. నాగార్జునసాగర్ ఎగ్జిబిషన్ వారి పెద్దకూడ వారే ఏర్పాటుచేశారు. దాని కోసము గవర్నమెంటు 4,500/- రూపాయలు గ్రాంటును మాత్రము చేసింది. కాని అది యీ గవర్నమెంటు తరపున పంపించిన పార్టీ కాదు. ఢిల్లీలో ఉన్న ఆంధ్రుల ఎసోషియేషన్‌వారు చేశారు. కాని ప్రభుత్వం మాత్రము గ్రాంటు పూర్వకముగా కొంతడబ్బుయిచ్చింది.

*Raptadu Tank Diversion Channel of Anantapur Taluk.*

10—

*286 Q.—Sri P. ANTONY REDDY Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the estimates have been prepared for the Raptadu tank diversion channel of Anantapur taluk

(b) if so, what is the estimated cost of the work, and

(c) when will the work be commenced?

The Hon. Sri N. SANJEEVAREDDI

(a) Yes.

(b) Rs. 36,000

(c) The proposals are under scrutiny of the local officers and will be considered by the Government when they are received by them

Sri PILLALAMARRI VENKATESWARLU ఈ proposal ఎంతకాలమునుంచి consideration లో ఉన్నది? అది finalise కావటానికి యింకా ఎంతకాలము పట్టుతుంది.

The Hon Sri N SANJEEVA REDDI ఈ proposal ప్రభుత్వం వద్దకు యింకా రాలేదని చెప్పాను. It is under the consideration of either the Chief Engineer or some body lower down. వారివద్దనుంచి ప్రభుత్వం వద్దకు వచ్చినతరువాత ప్రభుత్వంయొక్క consideration లోనికి వస్తుంది. అంతేకాని, అది Assistant Engineer వద్ద ఎంతకాలము ఉన్నదో, Executive Engineer వద్ద ఎంతకాలము ఉన్నదో తెలుసుకోవాలంటే, వేరే ప్రశ్న వేస్తే చెప్పగలను.

Mr SPEAKER A separate question may be put

*Opening of new hospitals for treatment of T B and Leprosy*

11—

* 179 Q —Sri P. GUNNAYYA Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government propose to open any new hospitals in this State for treatment of Tuberculosis and Leprosy, and

(b) if so, in which districts ?

The Hon. Sri K VENKATA RAO (a) Provision has been made in the Second Five Year Plan for opening new Tuberculosis and Leprosy Sanatoria in the State

(b) The exact places where they will be located will be decided at the time of implementation of the schemes

(ఏ) ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో క్షయవ్యాధి నివారణకు, కుష్ఠువ్యాధి నివారణకు సంబంధించిన సంస్థలు కొన్ని కొత్తగా ఏర్పాటు చేయడానికి ప్రభుత్వ నిర్ణయము జరిగింది

(బి) అవి ఎక్కడెక్కడ పెట్టవలెనో, వాటికి సంబంధించిన స్కీములన్నింటిని ప్రభుత్వం పరిశీలించి, నిర్ణయించిన తరువాత, ప్రభుత్వం తెలియజేస్తుంది.

Sri P. GUNNAYYA అధ్యక్షా, విశాఖపట్టణము, శ్రీకాకుళము జిల్లాలలో పూజ్యులైన ముఖ్యమంత్రిగారికి, కళావెంకట్రావుగారికి తెలిసినట్లు ఆరోగ్యాన్ని కాపాడే విశాఖపట్టణములో కుష్ఠు హాస్పిటల్ నెలకొల్పటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

The Hon Sri K VENKATARAO రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పెట్టబోయే కుష్టు హాస్పిటల్ ఒకటి శ్రీకాకుళం జిల్లాలో పెట్టటానికి అనే ఆలోచన ప్రభుత్వానికి లేకపోలేదు.

Sri S. VEMAYYA అధ్యక్షా, క్రొత్తగా హాస్పిటల్ పెట్టేదానికంటే, ప్రస్తుతము ఉన్న T. B. Hospital వగైరాలు యింకా ఎక్కువగా అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం ఏదైనా ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. VENKATA RAO ప్రభుత్వంక్రింద యింతవరకు ఉండే హాస్పిటలు ఒక్కటే ఉన్నది. ఆ ఒక్కటిన్ని రాష్ట్రానికంతటికినీ సరిపోదు. దానికి చేసే ఉపకారము ఏమిటంటే, యిప్పుడు ఖర్చుచేసే ప్రతిఒక్క రూపాయి గూడ ఆ ఒక్కదానిమీదనే ఖర్చు చేయబడుతున్నది. ఇంకా మిగిలినవి చేయటానికి T. B. Clinics క్రింద 20 లక్షలు, T. B. Sanitoria క్రింద 15 లక్షల 36 వేలు T. B. Teaching and Demonstration Centres క్రింద రూ. 6,55,000/-లు రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఖర్చుచేయబడుతుంది.

Sri M. HARICHANDRA PRASAD పశ్చిమ గోదావరి జిల్లాలో ఉన్న తణుకులో కుష్ఠురోగ నివారణకు హాస్పిటలు ఒకటి నెలకొల్పటానికి ప్రభుత్వానికి ఏదైనా సంకల్పము ఉన్నదా ?

The Hon Sri K. VENKATA RAO లేదండి.

Sri P. SURYANARAYANA అధ్యక్షా, శ్రీకాకుళం టౌనులో కుష్ఠురోగ నివారణకు హాస్పిటలు ఒకటి ఏర్పాటుచేశారు. దానికి ప్రభుత్వం తోడ్పడి వృద్ధిచేయటానికి ఏదైనా ఆలోచన ఉన్నదా ?

The Hon. Sri K. VENKATA RAO శ్రీకాకుళం జిల్లాలోనూ, కర్నూలు జిల్లాలోనూ కుష్టువ్యాధి హెచ్చుగా ఉన్నది. ఈ వ్యాధి నివారణకుగాను హాస్పిటలు నెలకొల్పటానికి ఒక్క ప్రైవేటు donation వల్లనే సాధ్యపడదు. అందుకుగాను ప్రభుత్వం తమ స్వంతఖర్చుమీద యిలాంటి పెద్దపెద్దసంస్థలు అక్కడగాని, యింకా తూర్పు గోదావరి జిల్లాలోను, యింకా యితరచోట్లలోగాని ఎక్కడైతే యీ వ్యాధి హెచ్చుగా వుంటున్నదో, అక్కడ పెట్టటానికి యత్నం జరుగుచున్నది.

Sri M. NAGI REDDI ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలములో కుష్టు వ్యాధి నివారణ హాస్పిటల్సు కొన్ని నెలకొల్పటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదని చెప్పారు. అయితే నూతనముగా ఎన్ని నెలకొల్పటానికి ప్రభుత్వం ఉద్దేశిస్తున్నదో చెబుతారా ?

The Hon. Sri K. VENKATA RAO. ప్రస్తుతమునకు 15 T B. Clinics. 8 T B Sanitoriums పెట్టాలని ప్రభుత్వము అనుకుంటున్నది. ఇందులో ఒకటి విశాఖపట్టణములోనూ, ఒకటి కర్నూలులోనూ, మరొకటి గుంటూరు జిల్లాలోనూ, పెట్టవలెనని అనుకుంటున్నది. అయితే విశాఖపట్టణములో పెట్టేదాని విషయములో అక్కడ యిస్తామన్న డబ్బు యింకా వసూలు కాలేదు. కర్నూలు దానికి కొద్దిగా వసూలు అయింది. గుంటూరుజిల్లాదానికి అంతా వసూలుఅయింది. కట్టడములు మొదలుపెట్టే పరిస్థితులు ఏర్పడుతున్నవి.

Sri P. VENKATASUBBAYYA B C G Vaccination వల్ల క్షయ వ్యాధి నివారణ అవుతుందని ప్రపంచమంతా అనుకుంటున్నారు. అలాంటప్పుడు ఆవ్యాధికి గాను ఒక హాస్పిటలు నెలకొల్పడమువల్ల అందుకు అయ్యే ఖర్చుబాధ తప్పిపోతుంది గనుక, అలాంటి ప్రచారము చేయించటానికి ప్రభుత్వం సంకల్పిస్తున్నదా ?

The Hon Sri K. VENKATA RAO· ఇప్పుడిప్పుడే మూడు నాలుగు B. C. G. Campaign నడిపించేటటువంటి సంస్థలు ఆంధ్రదేశములో పనిచేస్తున్నవి. అవి ఒక్కొక్క ఏరియా అయినతరువాత యింకొక ఏరియాకు వస్తున్నవి. కాని ఎంతచేసినప్పటికినీ, కుర్రవాళ్లకోసం పెట్టేఖర్చు ముందైనా తప్పుతుందో లేదో తెలియదు. కాని యిప్పటికే యీ జబ్బు ఉన్నవాళ్లు చాలామంది ఉన్నారు. ప్రస్తుతము వీరందరికీ సహాయముచేయడము కష్టమవుతున్నది.

Sri A. SATYANARAYANAMURTHI కుష్టు, క్షయవ్యాధుల నివారణ నిమిత్తం కొన్ని సంవత్సరాలక్రింద మా పశ్చిమ గోదావరిజిల్లాలో కలెక్టరుగారు నాలుగు లక్షలు వసూలు చేశారు. ఆవిషయము ప్రభుత్వానికి తెలుసునా? తెలిసియుంటే, దాని విషయము ప్రభుత్వం ఏమిచేసింది? ఆ నాలుగు లక్షలతోబాటు ప్రభుత్వమువారు ధనసహాయము చేసి మా జిల్లాలో హాస్పిటలు పెట్టుతారా?

The Hon Sri K. VENKATARAO మా జిల్లా అంటే, నాకు అర్థము కాదని నేను క్రిందటిసారి చెప్పాను. ఈ సందర్భములో నాకు అంతర్వేది తీర్థం వద ఒకటి జ్ఞాపకము వస్తున్నది. (Lauhgter) పశ్చిమ గోదావరిజిల్లా అనే నాకు తెలుసును కాని వారు ప్రశ్నవేయడములో అది సరీగావేయలేదని అంటున్నాను. పశ్చిమ గోదావరి జిల్లాలో వసూలు అయిన సొమ్ములో ఒకలక్ష రూపాయలు మంగళగిరి శానిటోరియముకు (Donation గా) యిచ్చారు ఇంకొకలక్ష రూపాయలు, పశ్చిమ గోదావరిజిల్లాలో యేలూరులో ఉండే కోల్ హెచ్ క్వార్టర్సు హాస్పిటలులో T B Centres పెట్టటానికి ఏర్పాట్లు జరుగుచున్నవి.

Sri SHEIK MOULA SAHEB అధ్యక్షా, ప్రజలకో ఆరోగ్యము చెడితేగదా, T B. వగైరా జబ్బులు వచ్చేది, అందుకుగాను మందులు అవసరము అయ్యేది. కాబట్టి ప్రజలకు ఆరోగ్యము చెడకుండా, యిలాంటిజబ్బులు రాకుండా, అవి నివారించుకోటానికి ప్రజలు హాస్పిటలుకు పోనవసరములేకుండా హెల్తు డిపార్టు మెంటువారైనా తగిన సలహాలు యివ్వటానికి, యీ వ్యాధులు రాకుండా ముందుగా కాపాడటానికి ప్రభుత్వము ఏదైనా విధానము ఆలోచించి తోడ్పడుతుందా?

Mr. SPEAKER Please put a separate question.

Sri N. SRINIVASA RAO కుష్టు, T B కి సంబంధించిన వ్యాధుల నివారణకొరకు హాస్పిటల్సు నిర్మించటానికి చాలాకాలము పట్టేటట్లు కనబడుతున్నది. అందాక కుష్టువ్యాధి దళాలు గ్రామాలలో యాత్రలు చేస్తున్నారు, ఆయాత్రలు ఆపు జేయిస్తారా?

The Hon Sri K VENKATA RAO పోలీసువారు సహాయముచేస్తే, నాకేమి అభ్యంతరము లేదు

Sri S BRAHMAYYA క్షయవ్యాధి నివారణ హాస్పిటలు నిర్మించటానికి పశ్చిమ గోదావరి జిల్లాలో సుమారు నాలుగు లక్షలు వసూలు అయినట్లు తెలిసింది. అయితే యీడబ్బులోనుంచి మంగళగిరి T B. Sanitorium కు యివ్వవలసిన అవసరము ఏమివచ్చింది ? అలాగు యిచ్చిన సందర్భములోనైనా పశ్చిమ గోదావరి జిల్లాలో ఉన్న క్షయ వ్యాధిగ్రస్తులకు preference యిస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO దాతలు అయినవారు ఎవరు ఎక్కడ యిచ్చారో నేను జాబితావ్రాయలేదు. ఇది ప్రభుత్వముయొక్క సొమ్ముకాదు. దానికిగాను ఏర్పడిన సంఘము ఏవిధముగా ఉన్నదో నాకుతెలియదు. ఆ సంఘము వారు ఎవరెవరికి యివ్వాలని తోస్తే, వారికి యిస్తారు. కాని యీ లక్షరూపాయలు యివ్వడము అనేది పశ్చిమ గోదావరి జిల్లాలోని ఏలూరు హెడ్డుక్వార్టర్సు హాస్పిటలులో నూరుబెడ్సు ఏర్పాటు చేయాలి అనే షరతుమీద యిచ్చినట్లుగా నాకు జ్ఞాపకము.

Sri G. NARASIMHA MURTHI అధ్యక్షా, తూర్పు గోదావరి జిల్లాలో తుపాను వచ్చిన సంవత్సరము, తుఫాను రిలీఫ్ కమిటీవారు T B వ్యాధి నివారణకోసము హాస్పిటలు ఏర్పాటు చేయటానికి ఒక లక్ష రూపాయలు వసూలు చేశారు. పైగా District Flood Relief Committee వారు ఒక లక్ష రూపాయలు Flood Relief కొరకు Resolution pass చేసి allot చేశారు. దానికి సంబంధించిన భోగట్టా ప్రభుత్వమువద్ద ఉన్నదా ? అందుకుగాను యింకా ఏమైనా ప్రయత్నాలు ప్రభుత్వం చేస్తుందా ?

The Hon. Sri K VENKATA RAO నావద్ద ఏవిధమైన భోగట్టా లేదు. ఒకలక్ష రూపాయలు యిచ్చినంత మాత్రాన, T B Sanitorium రాదు. పదిలక్షలు ప్రజలవద్దనుంచి సేకరిస్తే, దానికితోడుగా మరొక పదిలక్షలు ప్రభుత్వము ఖర్చు చేయవలసి ఉంటుంది.

*Construction of a cause-way across Swarnamukhi river near Vakadu village.*

13—

* 121 Q—Sri P GOPALAKRISHNA REDDI Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) whether the Government are contemplating to construct a cause-way across the Swarnamukhi river near Vakadu village in Gudur taluk and

(b) if so, when the work will be taken up?

The Hon. Sri A. B. NAGESWARA RAO (a) The answer is in the affirmative.

(b) The work has been included in the new programme to be financed from State allocations of Central Road Fund under "District Board Roads" and the approval of the Government of India is awaited. The work will be taken up for execution as soon as the approval of the Central Government is received

Sri P. RAJAGOPAL NAIDU. జిల్లాబోర్డు రోడ్లు అన్నీ maintain చేయటానికి కొంత సొమ్ము గ్రాంటు క్రింద యివ్వటానికి యితర funds లో నుంచి ప్రభుత్వం divert చేసినట్లు తెలిసింది. అది ఎందులోనుంచండీ? అయితే అది ఎప్పటినుంచి అమలులోనికి వస్తుంది?

The Hon Sri A. B NAGESWARA RAO 1956-57 సంవత్సరంలోనే అది అమలులోనికి వస్తుంది.

Sri S VEMAYYA ఇది ఎంతకాలములో పూర్తిచేయటానికి వీలు అవుతుందో చెబుతారా?

The Hon Sri A B NAGESWARA RAO కేంద్ర ప్రభుత్వం నుంచి అనుమతిరాగానే పని ప్రారంభమవుతుంది.

Sri P. SREERAMULU District Board Roads కొరకు funds divert చేశామని అన్నారే, ఆ విధముగా చేసినట్లుగా ప్రభుత్వం యొక్క ఉత్తరువులు జిల్లా బోర్డులకు అందినవా?

The Hon Sri A.B NAGESWARA RAO: అందినవో లేదో చెప్పటానికి వేరే ప్రశ్న వేయండి. ప్రభుత్వం నిర్ణయం మాత్రము చేసింది.

Sri V. VISWESWARA RAO అధ్యక్షా,

జిల్లా బోర్డు రోడ్ల మరమ్మతుకుగాను funds ను divert చేశామని మంత్రిగారు చెబుతున్నారు. అయితే Highways Roads అన్నీ సక్రమంగా ఉన్నవనా, funds ను divert చేశారు?

( No answer )

*Starting of Leprosy Sanatorium in Bobbili taluk*

15—

* 182 Q —Sri P GUNNAYYA Will the Hon the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government propose to start a Leprosy Sanatorium near Akulakattadavi in Bobbili taluk, and

(b) if not, why not?

The Hon. Sri K VENKATA RAO (a) and (b) It is programmed to open a Leprosy Sanatorium in Srikakulam District during the Second Five Year Plan period The exact place where it will be located, will be decided at the time of implementation of the scheme

(a) and (b) ఇదివరకే నేను చెప్పాను. రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద శ్రీకాకుళం జిల్లాకు లెప్రొసీ శానిటోరియము పెట్టడానికి ప్రభుత్వం నిశ్చయించింది. అది ఏ ఊళ్లో పెట్టడమో ఇంకా నిర్ణయించలేదు

Sri P GUNNAYYA అధ్యక్షా, ఈ బొబ్బిలివద్ద అడవిలో [illegible] 500 ఎకరాల భూమి ఉన్నది అక్కడ కుష్ఠరోగుల కాలనీకి గవర్నరుగారు ప్రారంభోత్సవం చేశారు గవర్నమెంటు గ్రాంటుకూడా ఇస్తున్నారు. అక్కడ కాలనీ కట్టిస్తే బాగా ఉంటుందని D M O గారు కూడా రికమెండు చేసినారని నా ఉద్దేశము కాలనీ ఏర్పాటు చెయ్యవలెనని మనవి చేస్తున్నాను.

The Hon. Sri K VENKATA RAO శ్రీ గున్నయ్యగారి సర్వజ్ఞ జ్ఞానానికి సంతోషిస్తున్నాను. మా ఆఫీసరు వ్రాసిన ఉత్తరాలు కూడా వారికి తెలుస్తున్నవి గాని ప్రభుత్వం ఇంకా ఏ నిర్ణయానికి రాలేదని చెబుతున్నాను

*Educational Facilities to all Poor Children*

121—

* 102 Q.- Sri P. HANUMANTHA REDDI Will the Hon. the Chief Minister be pleased to state .

(*a*) Whether the Government propose to give educational facilities to the children of poor people of all castes without distinction and thus establish the Socialistic Pattern of Society, and,

(*b*) if so, the steps that may be taken therefor?

The Hon. Dr B GOPALA REDDI · (*a*) The answer is in the affirmative.

(*b*) As a first step, the Government have granted the concessions of free education upto III Form to be phased and spread over for three years from the current year.

Sri PILLALAMARRI VENKATESWARLU మూడవ ఫారం నుంచి ఈ సంవత్సరం నుండే ఉచితముగా విద్య నేర్పిస్తామని మంత్రిగారు గత సెషనులో వాగ్దానము చేసినారు. ఆవాగ్దానాన్ని ఎందుకు నిలుపుకొనలేకపోయినారు?

The Hon. Dr B GOPALA REDDI Committee of Assurance ఉన్నట్లయితే ఇట్టి విషయాలనన్నింటిని పరిశీలన చేస్తుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU Committee of Assurance లేకపోయినా House కు ఇచ్చిన వాగ్దానాలు ఎందుకు నెరవేర్చలేదో ప్రశ్న వేసినపుడు చెప్పవలెనని స్పీకరుగారికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ రెండు హక్కులను స్పీకరుగారు కాపాడుతారు.

Mr SPEAKER వేరే ప్రశ్న వెయ్యండి.

Sri PRAGADA KOTAIAH అధ్యక్షా, ఈ మ్యునిసిపాలిటీలకు ఇస్తున్న కాంపెన్సేషనును withdraw చేస్తున్నప్పుడు, ఎంటరుటైనుమెంటు టాక్సు 10% తీసుకొనడానికి బిల్లు పెట్టినపుడు స్పష్టంగా చెప్పారు. ఇప్పుడు ఎందుకు తిరిగి వెళ్లవలసిన పరిస్థితులు వచ్చినవి ?

The Hon Dr B. GOPALA REDDI గవర్నరు అడ్రెసుమీద మాట్లాడితే మంచిదనుకుంటాను. విపులముగా చెప్పడానికి అవకాశముంటుంది.

Mr SPEAKER I think it will be more appropriate to have a detailed reply at the time of discussion on the motion of thanks

Sri PILLALAMARRI VENKATESWARLU మ్యునిసిపాలిటీలకు toll gates compensation, entertainment tax ప్రభుత్వం ఇస్తున్నదా ?

Mr SPEAKER That is a different question.

Sri VAVILALA GOPALAKRISHNAYYA · అధ్యక్షా, III ఫారం వరకు free education ఇస్తామన్నారు. అందరికీ ఇచ్చారా?

The Hon. Dr B. GOPALA REDDI · నా సమాధానము సరిగా వినలేదనుకుంటాను.

Sri G YELLAMANDA REDDI III form వరకు ఉచితవిద్య ఇవ్వడానికి, మూడు సంవత్సరాలలో 6000 మంది ఉపాధ్యాయులను రిక్రూట్ చేయ్యడానికి ప్రభుత్వం నిశ్చయించిన మాట వాస్తవమా ?

The Hon Dr B GOPALA REDDI దానికి దీనికి సంబంధము లేదు.

Sri G. YELLAMANDA REDDI G O. issue చేశారు, నావద్దగ ఉన్నది. కావలెనంటే నెంబరు చదవగలను.

The Hon Dr. B GOPALA REDDI · ఈ విషయము కూడా గవర్నరు అడ్రెసులో మాట్లాడితే బాగాఉంటుంది. రిక్రూటుమెంటు విషయం అదివరకే వచ్చింది. పై ఏడు స్కూల్సు ఇప్పటికంటె ఎక్కువచేస్తే వాటికి సరైన గ్రాంట్లు ఇవ్వవలెను.

ఇది ఇండిపెండెంటు ప్రశ్న. దీనికి దానికి సన్నిహితమైనసంబంధం లేదు. గవర్నరు అడ్రెసులో మాట్లాడితే జవాబు చెబుతాను.

Sri PILLALAMARRI VENKATESWARLU. ఇప్పుడు గవర్నరు అడ్రెసులో తెలుసుకోని ప్రశ్న ఏది ఉండదు; ప్రతిప్రశ్న గవర్నరు అడ్రెసులో ఉండవచ్చును, మంత్రిగారు జవాబు చెప్పవచ్చును. అంతమాత్రంచేత ప్రశ్నా సమయములో వచ్చినవిషయం గవర్నరు అడ్రెసులో చెప్పడం సబబుకాదు

Mr. SPEAKER As the Hon Leader of the House has suggested, it can be thrashed out at length in the motion of thanks to the Governor's address.

Sri PILLALAMARRI VENKATESWARLU గవర్నమెంటు ఏమిచేసిందో ప్రశ్నవేస్తున్నాము. పాలిసీమీదకాదు మేము అడుగుతున్నది.

Mr SPEAKER I may even tell you that it is too wide a question. You are asking about the policy of the Government.

Sri PILLALAMARRI VENKATESWARLU · We are not asking about the policy of the Government

Mr SPEAKER I will just tell you that the Government can make an elaborate statment on the matter in the course of the debate on the Motion of Thanks to the Governor's address, whereas by asking questions you do not get the full information That is why it is called a question of policy which will be dealt with in the reply to the Governor's address.

Sri M NAGI REDDI అధ్యక్షా,

ముఖ్య మంత్రిగారు సమాధానం ఇస్తూ మూడు సంవత్సరాలలో సంవత్సరానికి ఒక తరగతి చొప్పున concession ఇస్తామన్నారు. విద్యార్థినులకు మాత్రము III form వరకు కన్సెషను ఇస్తామన్నారు. నిజమేనా?

The Hon Dr B GOPALA REDDI అది యదార్థమే.

Sri V. VISWESWARA RAO ఇప్పుడు ఇచ్చిన కన్సెషను, పరీక్షలలో తప్పిన వారికి వర్తించని మాట నిజమా?

The Hon. Dr. B. GOPALA REDDI పోయిన సంవత్సరం I from చదివి ఈ సంవత్సరం మళ్లీ ఫస్టుఫారంలో చేరితే వర్తిస్తుంది. వచ్చే సంవత్సరం fail అయ్యే వారికి వర్తించదు.

Sri S. VEMAYYA ఇప్పుడు స్పెషలు ఫీజు అందరివద్ద వసూలు చేస్తున్నారు. అది పేదవారి వద్ద వసూలు చెయ్యకుండా చేస్తారా?

The Hon Dr. B GOPALA REDDI Audio-Visual education, library, games, మొదలైన వాటికి ఈ డబ్బు వాలా అవసరం ఇది గవర్నమెంటుకు, జిల్లా బోర్డులకు వచ్చే ఆదాయం కాదు. అవి తీసివేస్తే స్కూలుకు అపారమైన నష్టం కలుగుతుందని అనుకుంటాను.

Sri D. KONDAIAH CHOWDARY ఉచిత విద్యతోపాటు భోజన సౌకర్యములు కొన్ని జాతుల వారికి కలుగ చేస్తున్నారు. అందరికి ఇవ్వగలరా?

Mr SPEAKER That is a different question from fee concessions we are going to free food.

The Hon. Dr. B GOPALA REDDI: అటువంటి ప్రపోజలు గవర్నమెంటువద్ద లేదు

Sri VAVILALA GOPALAKRISHNAYYA ఏ కన్సెషను ఇస్తామన్నారు, ఫలానా తేదీలోగా చేరిన వారికి ఈ కన్సెషను లని ఏమైనా ఉన్నదా?

The Hon. Dr. B GOPALA REDDI ఆ మాదిరిగా కాదు. జిల్లా బోర్డులకు మ్యునిసిపాలిటీలకు కాంపెన్సేషను ఇచ్చినప్పుడు లెక్కలు చూడాలి కాబట్టి, ఫలానా తేది అని అన్నారు. తరువాత చేరిన విద్యార్థుల వద్దనుంచి ట్యూషను ఫీజు వసూలు చెయ్యరు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA కొంతమంది తిరిస్కరించారు చేరుటకు దరఖాస్తు చేశారు. అప్లికేషన్లు వేసినారు. ఆగష్టులో చేరబోతున్నారు. వారి సంగతి యేమి?

The Hon Dr B GOPALA REDDI జులై ఆఖరువరకు ఆ తేదీ పొడిగించబోతున్నాము జులై ఆఖరుకు చేరకపోతే మరెప్పుడు చేరుతారు?

Sri PRAGADA KOTAIAH స్పెషలు ఫండ్సుగా వసూలుచేస్తున్నారు వేల కొద్ది రూపాయలు భవనములు, ఆట స్థలములు లేక కష్టపడుతున్నారు. కాబట్టి వాటి కోసం ఖర్చుపెట్టడానికి ప్రభుత్వం పర్మిషను ఇస్తుందా?

The Hon. Dr. B, GOPALA REDDI ఆ వసూలు భవనముల కోసముకాదు వసూలు చేసిన ఉద్దేశము కోసమే ఖర్చు చెయ్యాలని డైరెక్టరుగారు స్ట్రిక్టు ఇన్స్ట్రక్షన్సు ఇచ్చారు. స్పెసిఫికు పనులకు వసూలయినది భవనముల కోసము వినియోగించడానికి వీలులేదు.

Mr. SPEAKER · I may tell the Hon. Members that it is entirely in the discretion of the concerned schools Special fee is ear-marked for a special purpose.

*Improvement of Guntur—Kurnool Road.*

122—

* 311 Q.—Sri M NAGI REDDI Will the Hon. the Deputy Chief Minister be pleased to state ·

Whether it is a fact that the Government of India have sanctioned a sum of Rs. 1½ lakhs for the improvement of the Guntur—Kurnool Road ?

The Hon. Sri N SANJEEVA REDDI Under their special grant in-aid programme, the Government of India have approved the scheme of "Improvements to the Kurnool-Guntur road" at an estimated cost of Rs 26 lakhs They have so far sanctioned estimates in respect of individual works amounting to Rs 16,48 lakhs under this scheme

*Trust properties of the temples*

123—

* 460 Q — Sri P VENKATA SUBBAYYA Will the Hon. the Minister for Revenue be pleased to state

(a) Whether the Special Officer appointed on contract basis to enquire into various kinds of trust properties of the temples in wrongful enjoyment of persons is still functioning,

(b) if so, the number of cases of mismanagement detected by him during the period from 1st July, 1955 to date,

(c) the number disposed off, and

(d) the number of cases pending ?

The Hon. Sri K CHANDRAMOULI

(a) Yes Sir

(b) The Special Officer has detected 577 cases of mismanagement of trust properties from the inception of his office on 29-9-1954 till 30-6-1956 During the period from 1-7-1955 to 30-6-1956, 108 cases were detected

(c) 226 cases were completed and 127 were part-heard

(d) 224 cases are pending as on 30-6-1956

Sri P. VENKATA SUBBAYYA Pending లో వున్న cases కడప జిల్లాకు సంబంధించి ఎన్నివుంటాయో సెలవిస్తారా ?

The Hon Sri K. CHANDRAMOULI · ప్రత్యేక ప్రశ్నవేస్తే చెప్పుతాను.

Sri B. SANKARAIAH ఈ information జిల్లావారీగా ఇస్తారా ?

The Hon Sri K CHANDRAMOULI జిల్లావారీగా అడుగలేదు.

*Sales Tax on the sale of onions and potatoes*

124—

* 309 Q.— Sri M NAGI REDDI Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

Whether it is a fact that the Sales Tax Enquiry Committee appointed by the Government has recommended the abolition of the sales tax on the sale of onions and potatoes?

The Hon Sri D. SANJIVAYYA — Yes, Sir.

Sri M NAGIREDDI — కమిటీవారు రెకమెండ్ చేశారని మంత్రి గారు చెప్పారు. దానిని మంత్రివర్గము అంగీకరించి రద్దుచేయడానికేమైనా ఆలోచిస్తుందా ?

The Hon. Sri D SANJIVAYYA — అంగీకరించ లేదండీ.

Sri J LAXMAYYA — కమిటీవారు యీ సిఫార్సు చేసినప్పటికీ ప్రభుత్వము వాటిమీద పన్ను తగ్గించడానికి వీలులేని ప్రతిబంధకాలేమున్నాయో తెలియజేయమని కోరుతున్నాను.

The Hon. Sri D SANJIVAYYA — ఆర్థిక పరిస్థితే.

Sri N C SESHADRI — ఉల్లిపాయలమీద, బంగాళా దుంపలమీద sales tax మనదేశంలో ఏరాష్ట్రంలోను వున్నట్లు కన్పించదు. ఇకముందు మనలో చేరే హైదరాబాదులో కూడా వున్నట్లు కన్పించదు. కాబట్టి ఆంధ్ర ప్రదేశ్ ఏర్పాటు అయ్యేవరకూ ఈ onions, potatoes మీద sales tax విధించే విధానాన్ని ఆపు చేస్తారా ?

The Hon Sri D. SANJIVAYYA — ఇది ఎన్ని సంవత్సరాల నుంచో వుంది. హైదరాబాద్ కు పోయిన తర్వాత ఆలోచిస్తాము — తీసివేయాలో ఇంకా ఎక్కువ చేయాలో.

Sri PRAGADA KOTAIAH — అధ్యక్షా, ఇపుడు యీ కమిటీ వారు అమ్మకము పన్నులో ఇంకా హెచ్చుపన్ను రావడానికి కొన్ని మార్గాలు చూపినారు. ఆ మార్గాలను అనుసరించడానికి ప్రభుత్వము సిద్ధంగా వున్నది కాబట్టి యీవిషయంలో వారి సూచనలను అనుసరించడానికి ప్రభుత్వం పూను కుంటుందా ?

The Hon Sri D SANJIVAYYA — ఆదాయం ఎక్కువ వచ్చే టటువంటి సూచనలు చేసినారు. వాటిని అంగీకరిస్తున్నాము. తగ్గించే టటువంటి సూచనలను ఆర్థిక పరిస్థితి దృష్ట్యా అభివృద్ధి కార్యక్రమం దృష్ట్యా అంగీకరించడం లేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU Potatoes, onions మొదలైనవి perishables క్రింద వస్తాయి కనుక వాటిపై తప్పకుండా పన్ను తీసివేయవలసిన అవసరంవుంది. ఆంధ్ర దేశంలో అన్ని పట్టణాలలో వీటిని గురించి hartals చేస్తున్నారు. వీటినన్నిటిని దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వము తమనిర్ణయాన్ని పునరాలోచిస్తుందా ?

The Hon Sri D SANJIVAYYA — ఆలోచించడానికి వీలుపడదు

Sri G. NARASIMHA MURTY — ఇది త్వరగా కుళ్ళిపోయే సరుకు గనుక దీని మీద హెచ్చు పన్నుభారము పడడముచేత consumers కు నరకపోతే వర్తకులకు చాలా నష్టము వస్తుంది. ఈ రాష్ట్ర మంతటా బ్రహ్మాండమైన ఆందోళన జరుగుతున్నపుడు ప్రభుత్వము తమ విధానాన్ని ఎందుకు మార్చుకోవని ప్రశ్నిస్తున్నాను.

The Hon Sri D SANJIVAYYA — ఈ బ్రహ్మాండమైన ఆందోళన ఎక్కడనుండి ప్రారంభమైంది నాకుతెలుసు. ఈ potatoes, onions అంతగా కుళ్ళిపోయేటటువంటి సరకుకాదు. Greens వంటి గోంగూర, బీరకాయలు-ఇలు వంటివి త్వరగా కుళ్ళిపోతాయి.

Sri C. SUBBARAYUDU — అధ్యక్షా, onions ను మన ఆంధ్రదేశము నుంచి export చేసి లక్షలాది టన్నుల సరకును మద్రాసుకు పంపినపుడు, కుళ్ళిపోవడము జరుగుతుంది. Steamers లో పోయేటపుడు కుళ్ళిపోయి పెద్దపెద్ద వ్యాపారస్థులే కాకుండా రైతులుకూడా పూర్తిగ నష్టపడుతున్నారు. వర్తకులు సరకు సరిగా అమ్ముడు పోతేనేగాని రైతులకు డబ్బుయివ్వరు. కనుక ఇటువంటి పరిస్థితులు ఏర్పడుతూవుంటాయి. Onions విపరీతంగా చెడిపోతూవుంటాయి. కనుక sales tax ను వీటిపైన మినహాయించడము సబబుగా వుంటుంది.

The Hon Sri D. SANJIVAYYA — కడప అనంతపురం జిల్లాలలో ఎర్రగడ్డల వ్యాపారముచేసి వర్తకులు లక్షలాది రూపాయలు సంపాదించిన సంగతి వారికి తెలుసునని మనవిచేస్తున్నాను.

Mr SPEAKER — The subject appears to be too big, for a single question, Hon Members are simply expressing their opinions about the subject but, not putting any question for eliciting information I will go to the next question.

(Several Hon Members were seen standing in their seats to catch the eye of the Hon Speaker )

Mr. SPEAKER — Order ! Order !

Sri G. YELLAMANDA REDDI — అధ్యక్షా, మంత్రిగారు సమాధానము చెప్తూ కమిటీవారు రెకమెండ్ చేసిన అధికపన్నులు అన్నిటిని ఆమోదించాము, తగ్గించమనే వాటిని మాత్రం మేము అంగీకరించ లేదని చెప్పారు. కమిటీలు అనుసరించే విధానాలు ప్రజలకు అనుకూలంగా వుంటే, వాటిని త్రోసివేయడం తమ

మనస్సులో వున్నవాటిని అంగీకరించడము—ఇది సక్రమమైన పద్ధతని ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

Mr SPEAKER — I think it is better to take another opportunity to express your opinion.

The Hon. Sri D. SANJIVAYYA — ప్రజల అభివృద్ధి కార్యక్రమం దృష్టిలో పెట్టుకొని, ప్రజల జీవనప్రమాణాన్ని హెచ్చించాలనే ఉద్దేశముతోనే వేయబడింది

Sri PILLALAMARRI VENKATESWARLU మా అభిప్రాయాలేమో చెప్పవలసి ఉంది.

Mr SPEAKER — Not by putting questions Let us express our opinions in another manner

Sri PILLALAMARRI VENKATESWARLU —ఇది చాలా ముఖ్యమైనప్రశ్న. మా అభిప్రాయములేమో ప్రభుత్వానికి ప్రజలకు, తెలియజేయవలసిఉంది.

Mr SPEAKER — I have no objection if questions are put for eliciting information, but I do not allow Members to express their opinions

Sri L LAKSHMANA DAS ఈ onions మీదను, potatoes మీదను ప్రభుత్వానికి sales tax వల్ల ఎంత income వస్తుంది. ?

The Hon Sri D SANJIVAYYA సంవత్సరమునకు 112 వేల రూపాయలు income వస్తుంది.

Sri P SURYANARAYANA అధ్యక్షా, ఉల్లిపాయలు, బంగాళా దుంపలు అమ్మే వర్తకులు, భుజాలమీద మూటలు వేసుకొని, సంతలకు, ఊళ్లవెంట వెళ్లి అమ్ముకొని వస్తున్నారన్న సంగతి మంత్రిగారికి తెలుసునా ?

Mr SPEAKER మీరు information ఇస్తున్నారు. You are not asking for information.

Sri PILLALAMARRI VENKATESWARLU వీటిమీద పన్ను వేసినందుకుగాను అసంతృప్తి తెలియచేస్తూ పట్టణాలలో hartals జరిగినవనే విషయం ప్రభుత్వ దృష్టికి వచ్చిందా ?

The Hon. Sri D. SANJIVAYYA రోజూ తెలుస్తూనే ఉన్నది. పెలిగాత్రములద్వారా అయితేనేమి, మహాజర్ల ద్వారా నైతేనేమి, సూర్యనారాయణగారు

చిన్నచిన్న వృత్తులమీద పన్ను ఎత్తివేయాలనే అభిప్రాయంలో ఉన్నాము. సంవత్సరానికి 10 వేల రూపాయలకు తక్కువగా వ్యాపారం ఉన్నవారిమీద పన్నులేదు. పది వేల రూపాయలు మొదలు 15 వేలవరకు వ్యాపారం చేసేవారికి concession రేట్లు ఇచ్చాము. సంవత్సరానికి 96 రూపాయలు మాత్రమే కట్టవలసింది. మామూలు రేటు ప్రకారం అయితే 225 రూపాయలు కట్టవలెను. తర్వాత 15 వేలనుంచి 25 వేలవరకు వ్యాపారం చేసేవారికి concession 144 రూపాయలే యిస్తున్నాము. మామూలుగా అయితే వారు మూడువందల రూపాయలు కట్టవలసి ఉంటుంది ఇటువంటి concessions ఇచ్చాము 1937 సం॥ నుంచి ఈ tax ఉంటూనే వచ్చింది ఇన్ని సంవత్సరాలుగా కుళ్ళిపోనట్టి ఉల్లిగడ్డలు ఉల్లిపాయలు ఇప్పుడు ఎట్లా కుళ్ళిపోతున్నాయో నాకు అర్థం కావడంలేదు

Srimati C AMMANNA RAJA ఈ పన్నువల్ల గవర్నమెంటుకు 112 వేలు income సంవత్సరానికి వస్తుందని చెప్పారు. ఈ 112 వేలు ఎంతమంది బీదవర్తకుల ద్వారా వస్తుందో? వారిని ఇంతకష్టపెట్టి తీసుకొనడం న్యాయమా? అనే విషయాన్ని గవర్నమెంటు ఆలోచిస్తుందా?

The Hon Sri D. SANJIVAYYA ఇంత స్వల్ప ఆదాయం అనేటువంటి అభిప్రాయం కొంతమంది సభ్యులలో ఉన్నట్లుంది ఈ స్వల్ప ఆదాయం లక్షలా లక్షలు చేరిస్తే కోట్లు అవుతాయి. కోట్లు కోట్లు చేరిస్తే పదికోట్లు, నూరుకోట్లు అవుతాయి. వాటివల్లనే అభివృద్ధి కార్యక్రమం సాధించవలసి ఉంటుంది.

Sri G NARASIMHA MURTY మంత్రిగారు ఉల్లిపాయలు, బంగాళా దుంపలు కుళ్ళిపోవని చెప్పుతున్నారు కాని కొంచెం వర్షం కురిసేటప్పటికి, బంగాళా దుంప ఉల్లిపాయ మొక్కమొలిచి పోతుందన్నసంగతి మంత్రిగారికి తెలుసునా? దాని వల్ల కుళ్ళిపోయినప్పటికీ, మొలిచిపోయినప్పటికీ కూడ ఫలితం ఒకటే. ఎవరూ కొనరనేసంగతి మంత్రిగారికి తెలుసునా? తెలియదా? అందుచేత ఏవిధంగా నైనా ఇది నష్టదాయకమైన విషయం గనుక, దీనిమీద పన్ను వేసినట్లయితే, అటు రైతుకు, ఇటు వర్తకునికి కూడ చాల నష్టము కలుగుతుంది గనుక, ఈ పన్ను విధింపును ఉపసంహరించుకొనడం మంచిదనుకొంటాను. ఈ మాత్రపు స్వల్ప ఆదాయం రాబట్టవలెనంటే మన ముఖ్య మంత్రిగారితో సలహా చేసినట్లయితే వారు నిముషంలో వేరుమార్గాన్ని సూచించగలరు.

The Hon Sri D SANJIVAYYA వర్షంకురిస్తే మొక్కమొలిచే విషయంవారికి తెలుసునండి.

Sri MAHABOOB ALI KHAN کمیٹی سفارسات منظور کریگی
کیا حکومت ؟

The Hon. Sri D SANJIVAYYA కమిటీ రిపోర్టు సభ్యులందరికీ కూడా అందచేశాము. ఎన్నో కమిటీలు నియమింప బడుతూ ఉంటాయి. ఆ కమిటీలు నివేదికలు సమర్పిస్తూ ఉంటాయి అందులోఉండే శిఫారసులన్నింటిని ప్రభుత్వం అంగీకరిస్తుందని చెప్పటానికి అవకాశంలేదు.

Sri P SREERAMULU అధ్యక్షా, ఉల్లిపాయకు, బంగాళా దుంపకు రుచిలో చాలా దగ్గర సంబంధంఉంది. ఈ రెండుకూడ అసలు ప్రభుత్వ దృష్టిలోను, ప్రభుత్వ జాబితాలోను, కూరగాయల జాబితాలో ఉన్నాయండీ?

The Hon Sri D. SANJIVAYYA కూరగాయల జాబితాలో ఉన్నాయి. అందరి దృష్టిలో, ప్రభుత్వ దృష్టిలో ఎందుకు ?

Sri N SRINIVASA RAO అధ్యక్షా, ఈ కమిటీ వేసినతర్వాత ఏదో చాల పెద్దవిషయాలు, ప్రభుత్వానికి నష్టం వచ్చే విషయాలు అంగీకరించక పోయినా, ఈ చిన్న ఉల్లిపాయ సందర్భంలోనైనా వాండ్లకు consideration ఇవ్వనప్పుడు, అలాంటి కమిటీలు వేయడం ప్రభుత్వానికి నష్టమేనని కొంచెం ఆలోచిస్తారా ?

The Hon Sri D SANJIVAYYA కమిటీని దీనికోసమే వేయలేదు. అనేక ఘనమైన, మహా ఉత్కృష్టమైన విషయాలు, దేశానికి అభ్యుదయాన్ని చేకూర్చడానికి ఏర్పాట్లు చేస్తేబాగుంటుంది. అనేటటువంటి విషయాలను విచారింపమని పెద్దవాండ్లను కమిటీలో వేశాము. వారు కమిటీ నివేదికను సమర్పించారు. ఒక్క ఉల్లిపాయకోసం కమిటీ వేయలేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU ఉల్లిపాయ, ఎఱగడ్డల మీద కమిటీ ఇచ్చినటువంటి report ఏకగ్రీవమయిన అభిప్రాయమేనా ? లేకపోతే division ఉందా ?

The Hon. Sri D. SANJIVAYYA · ఇందులో చాల మట్టుకు అన్ని శిఫారసులు ఏకగ్రీవంగానే ఉన్నాయి. ఇదికూడా ఏకగ్రీవంగానే ఉంది అని నేను అనుకొంటున్నాను.

Sri R B RAMAKRISHNA RAJU మంత్రిగారు సెలవిస్తూ ఈ పన్ను చాల రోజులుగా ఉన్నదన్నారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్నదా? ఇప్పుడు ఉన్నదా? కమిటీవారు వ్రాసిన దాంట్లో- నివేదికలో- చిన్న విడిపోయిన మద్రాసు రాష్ట్రంలోగాని, రేపు కలవబోయే హైదరాబాదు రాష్ట్రంలోగాని, ఈ పన్ను లేదని వ్రాసి ఉంది, అదినిజమా ?

The Hon. Sri D SANJIVAYYA ఉమ్మడిరాష్ట్రంగా ఉన్నంతకాలం అక్కడ ఉండింది. 1937-38 మొట్టమొదట ఎప్పుడు పెట్టినారో అప్పటినుంచి ఉన్నది.

Sri PRAGADA KOTAIAH పదివేల రూపాయలలోపు వ్యాపారం చేసేవారికి పన్ను పడకూడదంటున్నారు. కాని అసలు ఉల్లిగడ్డలు, బంగాళాదుంపలు. మిగతా కూరగాయలు పెట్టుకొన్నటువంటి వారికి పదివేల turnover ఉన్నట్లు assess చేస్తూ అందరికీ కూడా tax వేస్తున్నారు అది harassment క్రిందికి వస్తున్నది కాబట్టి retailers అందరిని exempt చేసి ఒక్క wholesale trade మీదనే. అవసరమైతే అదనంగా పన్నువేయడానికి ప్రభుత్వం పూనుకొంటుందా ?

The Hon Sri D. SANJIVAYYA Harass చేయడం అనేదానికి నేను ఒప్పుకోనండి. ఆ విధంగా ఎక్కడైనా harass చేసినట్లు ఉండినట్లయితే మాకు ఏదైనా తెలియపరిస్తే దానిమీద action తీసుకొంటాము.

Sri A VENKATRAMA RAJU Retail వర్తకులమీద tax పడదంటున్నారు. కాని గత రెండు వారాలలోను ఆంధ్రదేశంలో చాలచోట్ల ఈ weekly market లు అన్నింటిలో కూడ retail dealers రాకుండా బజార్లుకూడ కదుపుకొని పోయి పహరాకాపోటపెట్టిన సంఘటనలుకూడా ఉన్నాయి. Department వాండ్లు యిచ్చిన definition లో పన్ను ఎవరిమీద పడాలి ? ఎవరిమీద పడకూడదు? అనేటటువంటిది సరిగాలేదు. అందుచేత retail dealers అందరిమీద వేస్తామని చాల స్పష్టంగా చెప్పారు. దానినిగురించి ఏమైనా aciton తీసుకొంటారా ?

The Hon. Sri D SANJIVAYYA Retail dealers కు exemption లేదు. పదివేల రూపాయలకు లోపుగానే ఉంటారు. retailers అందరు కూడా అందువల్ల exemption అనేది automatic గా వస్తుంది.

*Contributions to the Dramatic and Cultural Associations.*

125—

303 Q.— Sri VAVILALA GOPALAKRISHNAYYA Will the Hon. the Chief Minister be pleased to state

Whether the Government propose to pay any contributions to the Dramatic and Cultural Associations in the State ?

The Hon. Dr. B. GOPALAREDDI The Answer is in the negative

Sri VAVILALA GOPALAKRISHNAYYA అధ్యక్షా, బొంబాయి స్టేటులో నాటకాలకు, సమాజాలకు ఇతర cultural activities కు ప్రత్యేకంగా విరాళాలు ఇస్తున్నారు. కేంద్రప్రభుత్వం కూడా కొన్నింటికి ఇస్తున్నది. ఆవిధంగా ప్రభుత్వం కూడ నాటక కళను అభివృద్ధి చేయడానికి, incentive ఇవ్వడానికి, విరాళాలు ఇచ్చే ప్రయత్నం చేస్తారండీ ?

The Hon. Dr B. GOPALA REDDI చాల పెద్దవిషయంమీద ప్రశ్న వేసినారు. కేంద్రప్రభుత్వం ఇస్తున్న విషయం తెలుసును. బొంబాయి ప్రభుత్వ విషయం తెలియదు. వారు ఇస్తున్నారు కాబట్టి, మనం ఇవ్వ నక్కరలేదు అను కొంటాను.

Sri N SRINIVASA RAO అధ్యక్షా, ఈ నాటకాల వ్యవహారమంతా చూస్తే, ఈ నాడు పంచవర్ష ప్రణాళికలకిన్ని, ప్రభుత్వ విధానాలకు కూడ బ్రహ్మాండంగా తోడ్పడుచుంటున్న విషయం తెలిసినటువంటికళారాధకులును, కళాపోషకులై నటువంటి ప్రధాన మంత్రిగారు మరల ఒకసారి దీనిని పునరుద్ధరణచేసి కొంతమటుకయినా విరాళాలు యివ్వడానికి ప్రయత్నం చేస్తారా ? పోనీ యోచనన్నా చేస్తారా ?

The Hon. Dr B. GOPALA REDDI దీనికి ప్రోత్సాహంఇవ్వడానికి మేము అన్నివిధాలా ఉత్సాహ పడుతున్నాం. మద్రాసులో ఉన్నప్పుడు Entertainment Tax నాటకాలమీద తీసివేశాము. దానివల్ల వాటికి, చాలా లాభంకూడ కలిగింది ఇంతకన్న ఎక్కువగ చేయడానికి, మన ఆర్థిక పరిస్థితులను మనము చూచుకొనవలసియున్నది అందువల్ల ప్రస్తుతం చేయలేనందుకు చాల విచారంగా ఉంది.

Sri N VENKAIAH ఏలాంటి ఆర్థిక పరిస్థితులలో మీరు సహాయం చేయదలచుకొన్నారో సూచిస్తారా ?

The Hon. Dr. B GOPALA REDDI Revenue Budget లో ఏలాటి deficit లేనినాడు- అటువంటి స్వర్ణయుగం వచ్చినపుడు.

Sri VELLANKI VISWESWARA RAO అధ్యక్షా, Machkund project అభివృద్ధి చేయడానికి grant ఇవ్వకపోయినా, అభివృద్ధి చేయడానికి ఇతర మార్గాలుగాని, సూచనలుగాని ప్రభుత్వం చేస్తుందా ? మన రాష్ట్రములో ఒక నాటకశాలను ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

The Hon Dr B. GOPALA REDDI ఇంతకుముందు మన అప్పారావుగారి అధ్యక్షత క్రింద, మద్రాసు గవర్నమెంటువారు ఒక కమిటీని వేశారు. ఆంధ్రదేశంలో dramatic art ను ఏమిచేయాలి అనే విషయమై వారొక రిపోర్టు ఇచ్చారు. ఆరిపోర్టును ఇంకా పరిశీలన చేసి ఏమిచేయడానికి వీలుఅవుతుందో ఆలోచిస్తాము. ప్రస్తుత పరిస్థితులలో, అది చేయడానికి ప్రభుత్వం ఎప్పుడుకూడా సంసిద్ధంగానే ఉంది.

Sri R B. RAMAKRISHNA RAJU : మంత్రిగారు ఆ రిపోర్టును మాకందరికి అందచేస్తామని చెప్పారు. ఆవిషయం ఏమిచేశారు ?

The Hon Dr. B. GOPALA REDDI అది ఇంకా మద్రాసునుంచి రాలేదు.

Sri S. BRAHMAYYA గత budget కాలంలో మాట్లాడుతూ ముఖ్యమంత్రిగారు సెలవుఇచ్చారు. ఈ సంగీత నాటక academy ల గురించి ఎవరు మాట్లాడలేదు. అలా మాట్లాడిఉంటే సంతోషించి ఉండేవాణ్ణి అన్నారు. కాని ఇప్పటికైనా అటువంటి నాటక academy లు ఎక్కడైనా స్థాపించి ఉండినట్లయితే, ప్రభుత్వం ఆర్థికసహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నదా అని అడుగుతున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI: ఆర్థికసహాయం కాకపోయినా మానసిక సహాయం తప్పకుండా చేస్తాము.

Sri S. VEMAYYA : ఈ రాష్ట్రం ఆర్థికంగా సహాయం చేయలేకపోయినప్పటికీ, కేంద్రప్రభుత్వాన్ని అర్థించి సహాయం చేయడానికి ఈ ప్రభుత్వం పూనుకొంటుందా ?

The Hon Dr. B. GOPALA REDDI వచ్చినటువంటి application లను వాండ్లదగ్గరకు మేము ఎప్పటికప్పుడు పంపిస్తూనే ఉంటాము.

Sri A. VENKATRAMA RAJU Revenue deficit లేనప్పుడు చేస్తాము అని చెప్పారు. అయితే ఇప్పుడు నాట్యకళారంగం ద్వారా, అసలు మన రాష్ట్రంలో వచ్చే అభ్యుదయాన్ని అవకాశంగా తీసుకొని, మన ఆర్థిక budget కు ఆదాయం వచ్చేటటువంటి అవకాశాలు లేవా ? ఆలాంటి పరిస్థితులలో ఏదిముందు

The Hon Dr. B GOPALA REDDI అటువంటి అవకాశాల విషయమే Planning and Development Committee వారు ఆలోచిస్తున్నారు. రేపు 16,17,18 తేదీలలో కూడ చాల వినోదములను ఏర్పాటు చేయడానికి కూడ కళా వెంకట్రావు గారు ఆలోచిస్తున్నారు

The Hon Sri K. VENKATA RAO· సందర్భం వచ్చింది కాబట్టి మనవిచేస్తున్నాను. 16, 17, 18 తేదీలలో సాయంత్రం 5 గంటలు మొదలుకొని ఒకగంటసేపు ప్రతి Minister తన Department policy ని గురించి చెప్పుతారు. తరువాత Departmental Heads వివరాలు చెప్పుతారు. తరువాత 2½ గంటల కాలం 57 community blocks నుంచి వచ్చిన వారందరుకూడ అనేక రకాలైనటువంటి సంస్కృతి ప్రదర్శనాలు చేస్తారు. అందరు మెంబర్లు దయచేయాలనే కోరికచేత ఇక్కడ అదిపెట్టాం. Exhibition పెట్టుతున్నాం. అందుచేత అందరు దయచేయాలని కోరిక.

Sri N. SRINIVASA RAO అధ్యక్షా, ఈ స్వర్ణయుగం వచ్చేవరకు కూడా, ఆ మద్రాసునుండి రిపోర్టు ఆపుచేయకుండా, స్వర్ణయుగం వచ్చేముందే కనీసం రిపోర్టువస్తే దానిమీద ఇతరసభ్యులు సలహా ఇవ్వటానికి వీలుంటుందేమో. సాధ్యమైనంత త్వరలో రిపోర్టును తెప్పించడానికి ప్రభుత్వం ఏమైనా ప్రయత్నిస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI ఆ నివేదిక కేవలం ఆంధ్ర దేశానికి సంబంధించిన విషయం. అది యింకా Madras Education Department లోనే ఉన్నది తప్పకుండా తెప్పించి సాధ్యమైనంత త్వరలో అచ్చువేయించి దేశానికి అర్పిస్తామని అనుకుంటున్నాము.

Sri PRAGADA KOTAIAH కనీసం ప్రతి మునిసిపల్ ఏరియాలోను ప్రతిమేజర్ పంచాయతీ ఏరియాలోను ఓపెన్ ఎయిర్ థియేటర్సును కట్టించేందుకు ప్రభుత్వం ప్రత్యేకమైన ప్రోత్సాహం కల్పిస్తుందా ?

The Hon Dr. B GOPALA REDDI Open air theatres ఈనాడు కళాశాలల్లో ఉంటున్నవి. ఆర్ట్సు కాలేజి రాజమండ్రి, కడప, ఈ యూనివర్సిటీ కాలేజెస్ అంతట్లోకూడా, ఇంకా అనేకచోట్లలో కూడా ఓపెన్ ఎయిర్ థియేటర్సులో వీధిభాగవతాలు జరుగుతాయి. ఇంకా మునిసిపాలటీవారు ఏమిచేస్తారో చూస్తాం. ప్రభుత్వంవారుకూడా ఏమన్నా చేయడానికి వీలుఉంటే తప్పకుండా చేస్తారు.

Sri P. SREERAMULU ప్రజాశిక్షణ మంత్రి ఏర్పాటుచేసిన ఈ ప్రదర్శనానికి సభ్యులనందరినీ ఆహ్వానించారు. దానికి tickets ఉన్నాయా? ఆర్థికమంత్రిగారు, పరిశ్రమల మంత్రిగారు ఊరకనే మాకు చూపిస్తారా?

Mr. SPEAKER అది ఈ ప్రశ్నక్రిందకు రాదు.

The Hon. Sri K. VENKATA RAO వచ్చినవాళ్లు ఏమైనా డబ్బుఇస్తే సత్కార్యానికి ఖర్చుపెడతాము. శ్రీరాములుగారు డబ్బువున్నవారుగనుక ఒకనూరు రూపాయలు అయినా ఇప్పించమని కోరుతాను.

Sri V. VISWESWARA RAO అధ్యక్షా, ఈ Dramatic and cultural associations కు సహాయం చేయటానికి దనా భావమని మంత్రిగారు చెప్పారు. కాని విదేశాలకు (అనేకదేశాలకు) మనదేశంనుంచి ఈ cultural and Dramatic Associations తరపున ప్రతినిధులను పంపించి, ఆదేశాలలోని Art ను వారు పరిశీలించిరావటం జరుగుతోంది. కాని మన ఆంధ్రదేశంనుంచి పంపించే భాగ్యం మనకు ఇంతవరకూ కలుగలేదు. అందుకు ఆంధ్రదేశంనుంచి ఈ cultura associations తరఫున ప్రతినిధులను పంపించేటటువంటి అవకాశం ఎందుకు మన ఆంధ్రదేశమునకు ఇంతవరకు ఇవ్వబడలేదు? ఇకనుంచి అయినా మంత్రిగారు చర్యతీసుకొని దానిపైన శ్రద్ధవహించి ప్రతినిధులను Dramatic and Cultural Associations తరఫున ఇతరదేశాలకు పంపించటానికి తగుశ్రద్ధ తీసుకొంటారా?

The Hon. Dr. B GOPALA REDDI ఇది అంతా కేంద్ర ప్రభుత్వం చేస్తున్నారు. ఈ విషయంలో రాష్ట్రప్రభుత్వంవారిని వారు ఏమీ సంప్రదించడంలేదు. ఇక్కడిచ్చినటువంటి పేర్లను, ఆ సంగీతనాటక అకాడెమీవారో ఎవరో సిఫార్సు చేస్తున్నారు. External affairs department వారు cultural deligations ను రష్యా, చైనా వగైరా ప్రదేశాలకు పంపిస్తున్నారు. అందువల్ల మమ్ములను సంప్రదించినప్పుడు తప్పకుండ వారితోటివాళ్లనుకూడా పంపించమని సిఫార్సు చేస్తాం.

Mr. SPEAKER As regards * Q 124, Sri V Visweswara Rao Sri S. Vemayya, and others have made a request for a half hour debate. I think we have spent sufficient time over the matter. I am not in favour of allotting any further time.

Sri P. NARASIMHAPPA RAO నిన్నను మన గవర్నరుగారు ఇచ్చిన అడ్రసులో మన ఆంధ్ర మంత్రివర్గమున్ను, హైదరాబాదు మంత్రివర్గమున్ను, సంప్రదించి, వారిద్దరి ఉద్దేశ్యములను ఇస్తామని చెప్పారు. ఇంతవరకు అందలేదు. దానిని వేగంగా త్వరగా ఇస్తారా అని అడుగుతున్నాను.

The Hon Dr. B GOPALA REDDI · అది బహూశా ఢిల్లీ నుంచి ఈ దినం పోస్టులోనే వచ్చిఉంటుందని అనుకుంటాను. అది పార్లమెంటులోకూడా టేబుల్‌మీద వారు పెట్టబోతున్నారు. అక్కడ పెట్టకముందు మనం పెట్టడం న్యాయంకాదని, అది Joint Select Committee లో విచారింపబడిన అంశం కాబట్టి, వాళ్ళు పార్లమెంటు టేబుల్‌మీద పెట్టిన తర్వాత మనం కూడా ఇక్కడ పెట్టడాన్కి న్యాయంగా ఉంటుంది. అది ఈనాడువస్తే తోడనే అచ్చువేయించి పార్లమెంటులో పెట్టిన లక్షణం నేను మీకుకూడా ఇవ్వటానికి ఏర్పాటు చేస్తాను.

Mr. SPEAKER Sri P. Sreeamulu wants to call the attention of the Chief Minister to some matter.

Sri P. SREERAMULU విద్యా మంత్రిగారి దృష్టికి ప్రత్యేకంగా ఒక విషయాన్ని అత్యవసరంగా తీసుకొని రావలసివచ్చింది. గుంటూరుజిల్లాలో మాకుచేరిన విషయాన్నిబట్టి రాష్ట్రంలో సెకండరీ విద్యాలయాలు సెలవుల అనంతరం open చేసి మరల, రెండు మాసములు అయినప్పటికీ వాటికి ఇంకాకూడా S. S L C. text books non-detailed books కూడా విద్యార్థులకు అందలేదని, తర్వాత ఎక్కడ అయినా కొద్దిమొత్తం వచ్చినట్లయితే Black Market లో విద్యార్థులు కొనవలసిన పరిస్థితి ఏర్పడిందని చెప్పి చాలా ఆందోళనగా ఉన్నది. ఇది University వారు supply చేయవలసిన విషయంకాబట్టి, ఈ విషయం ప్రభుత్వం దృష్టికి తీసుకొని రాబడిందా ? తీసుకురాబడితే ప్రభుత్వం ఏమిచర్య తీసుకొన్నదిన్నీ విద్యామంత్రిగారు దయచేసి సెలవివ్వాలని కోరుతున్నాను.

The Hon Dr. B GOPALA REDDI: నాకు మొన్ననే ఏలూరులోను, బెజవాడలోను ఈ విషయాన్ని చెప్పినారు. వెంటనే నేను University కి టెలిగ్రాం పంపించినాను. తర్వాత నిన్ననే రిజిస్ట్రారుగారినుంచి నాకు జవాబుకూడా వచ్చింది. ఇప్పటికి 25 వేల కాపీలు వారు పంపించినారని, తర్వాత 15 అగస్టునాటికి ఇంకా వాళ్లకు ఉన్నదిమూండుసంరాకూడా వారు రైలులో పంపించబోతున్నారని తెలియజేశారు. ఇప్పటికి 25 వేల కాపీలు పంపించినట్లు ఇంకా ఉన్నటువంటి ఆర్డర్లు అంతా కూడా రేపు 15 వ తేదీలోపల పంపించగలమనే భావముతో నిన్న రిజిస్ట్రారుగారి పెద్ద నుంచి ఉత్తరం వచ్చింది ఆవిషయంలో ప్రభుత్వంవారు, University వారు తగు శ్రద్ధ తీసుకొంటున్నారు.

*Condolence resolution re Death of Sri K Appala Naidu.*

[9th August 1956

The Hon Dr B GOPALA REDDI Mr Speaker, Sir, I beg to move "That this House places on record its deep sense of sorrow at the demise of Sri Killi Appala Naidu, former Member of the composite Madras Legislative Assembly and the first Andhra Legislative Assembly and conveys its deep sense of sympathy to the members of his bereaved family"

శ్రీ కిల్లి అప్పలనాయుడుగారు 1952 వ సంవత్సరంలో ఎన్నుకోబడిన మద్రాసు శాసన సభలోను, తర్వాత ఆంధ్ర రాష్ట్రం విడిపడిన పిమ్మట ఆంధ్ర శాసన సభలోను మెంబరుగా ఉండినారు. వారి జిల్లాలోని సెంట్రల్ బ్యాంకు ప్రెసిడెంటుగా ఉండినారు. సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నట్టి వారు, రైతు సమస్యల్లో ఎంతో ఉత్సాహం చూపించి పనిచేసినట్టి వారు. ఇంకా అనేక కమిటీలలో ఉండి ఎంతో ఆరోగ్యంగా ఉండికూడా హఠాత్తుగా వారు హృద్ రోగంతో చనిపోయినారని తెలుస్తున్నది. మొన్న-మొన్ననే నేను విశాఖపట్టణం ఆస్పత్రిలో ఉన్నప్పుడు వారు నన్ను చూడడానికి వచ్చినారు. వారు ఇంత అకస్మాత్తుగా చనిపోతారని ఎవరూ అనుకొనలేదు. దృఢకాయులుగా ఉన్నటువంటి కిల్లి అప్పలనాయుడుగారు చిన్న వయస్సులోనే బహుశా 41,42 ఏండ్ల వయస్సులోనే చనిపోయినారు అందుకు ఈ సభవారు సంతాపమును ప్రకటింపవలసినదిగా నేను కోరుతున్నాను.

Sri PILLALAMARRI VENKATESWRLU అధ్యక్షా, ముఖ్య మంత్రిగారి తీర్మానంతోను, భావంతోను పూర్తిగా ఏకీభవిస్తూ, దేశభక్తులైనటువంటి అప్పలనాయుడుగారు చనిపోయినందులకు opposition తరఫున సంతాపమును వెల్లడిస్తున్నాను.

Sri P. NARASIMHAPPA RAO ముఖ్య మంత్రిగారుచేసిన తీర్మానమునకు మా పార్టీ తరఫున వారి తాలూకు కుటుంబానికి సానుభూతిని తెలుపుతూ మేముకూడా వారితో ఏకీభవిస్తున్నాం

Sri P. SURYANARAYANA· ముఖ్య మంత్రిగారు ఇప్పుడు తెచ్చిన కిల్లి అప్పలనాయుడుగారి అకాలమరణ తీర్మానమును పూర్తిగా బలపరస్తూ వారు మా జిల్లావారు కాబట్టి, నాకు తెలిసినవారు కాబట్టి రెండు ముక్కలు చెప్పదలచుకొన్నాను. ఆయన చాలా శాంత స్వభావుడు దేశ సేవకుడును అయినప్పటికి, అంత చిన్న వయస్సులో ఆయన పోవడం చాలా విచారకరం ఆయన యొక్క కుటుంబానికి ఆత్మశాంతికి హృదయ పూర్వకంగా దేవుని ప్రార్థిస్తున్నాను.

( Note —An * asterisk at the commencement of a speech indicates revision by the Member )

Mr. SPEAKER I also associate myself with the sentiments expressed by the Leader of the House and the leaders of other parties. I shall certainly convey the condolence of this House to the bereaved family of Sri Appala Naidu

I request the members to stand in silence for a minute

The resolution was carried on by all the members standing.

*ANNOUNCEMENT RE PANEL OF CHAIRMEN*

Mr SPEAKER I am to announce that the following Hon. Members will constitute the Panel of Chairmen for this session of the Assembly -

1 Sri S. Ranganatha Mudaliar
2. Sri E Ayyapu Reddi
3 Sri T. Veeraraghavulu
4. Sri D.V. Subba Rao

MOTION UNDER RULE 74 OF THE ASSEMBLY RULES

(1) Re - Distribution of books in Connemara Public Library, etc., between Andhra and Madras States

Mr. SPEAKER Sri Vavilala Gopalakrishnayya has given notice of a motion under rule 74 of Assembly Rules. It runs thus

"This House stands adjourned to discuss the distribution of the books from the Connemara Library, Oriental Manuscript Library and the Tanjore Saraswathi Mahal Library between the Andhra and the Madras States."

Sri VAVILALA GOPALAKRISHNAYYA: అధ్యక్షా: మద్రాసులో వున్నటువంటి కన్నమరా లైబ్రరీ, ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ తంజావూరులోని సరస్వతీ గ్రంధాలయంనుండి మనకు రావలసిన పుస్తకములను గూర్చి చర్చ జరిగినది. ఆ విషయమై మన రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి తెలియజేసినది. ఈ విషయమై బిల్లు తీసుకువచ్చినపుడు రాష్ట్రీ ప్రభుత్వమే ఆ వ్యవహారమును సర్దుబాటు చేసుకోవాలని కేంద్ర ప్రభుత్వంవారు చెప్పియున్నారు. దీనిని గురించి ఇప్పుడు చర్చ జరుగుచున్నది కాబట్టి, మనం అడగవలసిన బాధ్యత యున్నది. ముఖ్యంగా తెలుగు భాషకు, చరిత్రకు, లిపికి సంబంధించిన చాలా పుస్తకములు పై మూడు లైబ్రరీలలోనూ ఉన్నాయి. అటువంటి పుస్తకములన్నీ మనకు రావలసిన అవసరం వుంది. ఈ విషయమై ప్రభుత్వం తీసుకొన్న చర్యలను తెలుపకోర్తాను.

## MOTION UNDER RULE 74 OF THE ASSEMBLY RULES

*Re· Distribution of books in connemara public Library etc between Andhra and Madras States*

[9th August 1956

The Hon Dr. B. GOPALA REDDI తంజావూరిలోని సరస్వతీ మహల్ గ్రంథాలయం ప్రభుత్వానిది కాదు. దానికి ప్రత్యేకంగా ఒక కమిటీ వున్నది. District Judge గారో- ఎవరో ప్రెశిడెంటుగాను, కొంత మంది non officials సభ్యులుగాను వున్నారు. మనము పుస్తకములను గురించి వారిని అడగనవసరం లేదు. ఒకవేళ అడిగినను వారు ఇవ్వరు. ఆంధ్ర యూనివర్సిటీ వారు 10, 12 సంవత్సరములు ఒక clerk ను నియమించి ఆ లైబ్రరీలోని చాలా పుస్తకములకు కాపీలు తీయించినారు. కొన్ని పుస్తకములను publish చేయించారు కూడా. సరస్వతీ గ్రంథాలయంలోని పుస్తకములు గాక ఓరియంటల్ లైబ్రరీలోని పుస్తకములు మనము తెచ్చుకొనవచ్చును. వారు తప్పకుండా ఇస్తారు. ఆ పుస్తకములలో కొన్నింటిని తిరుపతి యూనివర్సిటీకి పంపించాలనే విషయం ప్రభుత్వాలోచనలో వున్నది. మనకు రావలసిన పుస్తకములను గురించి మద్రాసు ప్రభుత్వంతో నేను సంప్రదిస్తాను.

Mr SPEAKER So you are not pressing the motion?

Sri VAVILALA GOPALAKRISHNAYYA I am not pressing.

(ii) Re — Forcible eviction of tenants in certain villages of Palakonda taluk

Mr. SPEAKER: Next comes the motion of Sri P N. Appa Rao It runs thus

"This House stands adjourned to discuss a definite matter of public importance, namely, the forcible eviction of the poor tenants with the help of Revenue Magisterial authorities by the landlords of Allura, Gangabhagirathipuram etc. villages of Palakonda taluk of Srikakulam district from the lands and crops sown and grown in violation of the recently promulgated Andhra Cultivating Tenants Protection Ordinance."

I may inform the hon. Member that if there is any such wrongful eviction, relief may be had in the ordinary courts of law. So I rule the motion out of order.

(iii) Slow progress of work in Nagarjunsagar project.

MOTION UNDER RULE 74 OF THE ASSEMBLY RULES

*Re Slow progress of work in Nagarjunasagar Project*

9th August 1956

Mr SPEAKER Sri Vavilala Gopalakrishnayya has given notice of another motion which runs thus "నాగార్జునసాగర్ ప్రాజెక్టు పని, మందకొడిగా సాగుచున్నందున, వెంటనే చురుకుగా సాగించవలసినది".

I think this is a matter which the hon. Member can discuss in his speech in the debate on the Governor's address. So there need not be a separate time allotted for this subject.

Sri VAVILALA GOPALAKRISHNAYYA · ఇది ఒక ప్రత్యేకమైన విషయం కనుక దీనికి చాలా వివరములను సేకరించవలసి యున్నది. ఇతర విషయాలతో దీనిని చేర్చినట్లయితే యిది పరిష్కారంకాదు. అందుచేత నేను separate గా reasons యిచ్చినాను. మంత్రిగారు దీనికి సంబంధించిన వివరములను సేకరించి జవాబు చెప్పవలసి వుంటుంది. ఈ సమావేశములో రేపో, లేక ఎల్లుండి అయినా సరే ఈ ప్రతిపాదనను allow చేయవలసినదిగా అధ్యక్షుల వారిని కోరుతున్నాను.

Mr SPEAKER I feel there will be ample opportunity to discuss this subjcet in the debate on the Governor's address and so I disallow the motion.

*STATEMENT RE· FLOOD SITUATION IN THE ANDHRA STATE.*

Mr. SPEAKER The Hon. Revenue Minister will now make his statement regarding the flood situation in the State.

The Hon. Sri K. CHANDRAMOULI. అధ్యక్షా,

మన రాష్ట్రంలో యిటీవల కురిసిన కుంభ వర్షాలవల్ల, వరదలవల్ల ముఖ్యంగా శ్రీకాకుళం, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, కడప జిల్లాల్లో పంటలు, రాకపోకల సౌకర్యాలకు విపరీతంగా నష్టం సంభవించిన విషయం గౌరవనీయ సభ్యులకు తెలుసు.

ఈ నెల 7వ తేదీ వరకు అందిన సమాచారాన్ని బట్టి, శ్రీకాకుళం జిల్లాలో సుమారు య. 6,125ల విస్తీర్ణంలో, ప్రధానంగా వరిపంట జలమయమై పోయిందని తెలుస్తున్నది. 67 నివాస గృహాలు నాశనమై పోయాయి. ఒక పశువు వరదలో కొట్టుకుపోయింది. సంకిలి వద్ద నాగావళి నది వరద కట్ట దెబ్బతినడమేకాకుండా, 17 కాలువలకూ, పెద్దవీ, చిన్నవీ కలిసి 387 పంట చెరువులకూ నష్టంకలిగింది.

ప్రతిచోటా సాధ్యమైనంత వరకు గండ్లు పూడ్చబడుతున్నవి. ముఖ్యమైన నీటి పారుదల వసతుల విషయంలో అవసరమైన మరమ్మతులకు స్థానిక ఎక్జిక్యూటివ్ ఇంజనీరు పూనుకుని అప్పుడే పనిచేయిస్తున్నారు. మరికొన్ని కొద్దికొద్ది పంట చెరువులకు, నీరు వృధాగా పోకుండా తాత్కాలికంగా చుట్టూ కట్టలుఏర్పాటు చేయబడినవి. ఈ విధంగా వరద దెబ్బతిన్న నీటిపారుదల వసతులను మరమ్మత్తు చేయించడానికై రు. 1,20,000లు మంజూరు చేయవలసిందని కోరి, ప్రభుత్వామోదం లభిస్తుందనే విశ్వాసంతో, జిల్లా కలెక్టరు ఆయా మరమ్మతు పనులను ప్రారంభించారు కూడా. విత్తనాలు, ఎరువుల సప్లయి నిమిత్తం, జిల్లా కలెక్టరు రైతులకు రు. 8,600లు అప్పులు మంజూరుచేశారు. వ్యవసాయ శాఖవారు మళ్లీ పెట్టించడానికై 952 బస్తాల విత్తనాలు రైతులకు సప్లయి చేశారు. అంతే కాక, నివాసగృహాలకు నష్టం సంభవించిన సందర్భాలలో, మళ్లీ యిండ్లు కట్టుకోడానికై, స్థానికాధికారులు ధనరూపంలో గ్రాంట్లు మంజూరు చేస్తున్నారు.

తూర్పు గోదావరి:— తూర్పు గోదావరి జిల్లాలో పోలవరం, భద్రాచలము మునిగిపోయినట్లు వార్తలు తెలుపుచున్నవి. వాటిని గురించిన పూర్తి వివరములు ప్రభుత్వమునకింకను చేరలేదు. దెబ్బతిన్న ఆయా ప్రాంతాలలో తగు చర్యలు ఉద్యోగులు తీసుకొనుచున్నారనియే భావించుచున్నాను.

పశ్చిమ గోదావరి జిల్లా:— పశ్చిమ గోదావరి జిల్లాలో వరద నష్టం బహుముఖంగా సంభవించింది. రామిలేరు వరద వల్ల ఏలూరు తాలూకా సత్యవోలు గ్రామానికి చెందిన వెయ్యి ఎకరాల విస్తీర్ణం మునిగిపోయింది. మెట్ట ప్రాంతాల్లోని నల్లివాగు, పొలిమేరకోడు అనే రెండు వాగుల్లో వరద ఉధృతంగా వచ్చింది. కొల్లేరులో కలువ వలసిన యీ రెండువాగులు, అప్పటికే కొల్లేరు చాలావరకు నిండి నందున గ్రామాలమీద పడగా, ఏలూరు తాలూకా ముప్పర్రు గ్రామానికి చెందిన రెండు వేల యకరాల విస్తీర్ణం నీటిలో పూర్తిగా మునిగిపోయింది. మెట్టప్రాంతాల్లో కురిసిన అధిక వర్షాలవల్ల కొల్లేరులో కలుస్తున్న, కొండవాగుల్లో ప్రధానమయిన తమ్మిలేరు పూర్తిగా పొంగింది. తమ్మిలేరు యిరువైపులా కట్టలు తెగి, ప్రవహించి, ఏలూరు తాలూకా, మాదేపల్లి, కట్లంపాడు, పోనంగి గ్రామాల్లో చాలా విస్తీర్ణంలో, పొలాలను ముంచివేసింది. కొల్లేరులోకి ప్రవహిస్తున్న కైకరం మురుగు కాల్వకు కూడా వరద వచ్చి గట్లు తెగిపోయి, పూళ్లగ్రామంలో సుమారు 800 యకరాలమేర మునిగిపోయింది. బుడమేరు వరదలో కొణికి, గోగుంట గ్రామాల్లో కొన్ని భాగాలు పూర్తిగా మునిగిపోయినవి. అధిక వర్షాలమూలాన ఎర్రకాలవకూడా పొంగి, అప్పు

రావుపేట, జగన్నాధపురం గ్రామాల్లో కొన్ని ప్రాంతాలను ముంచేసింది. అనేక వాగులూ, వంకలూ వచ్చికలిసి, కొల్లేరు మహోధృతంగా పొంగింది. దీనిలో ధర్మాపురం, సిద్ధాపురం, దుంపగడప, గ్రామాలకు చెందిన అనేక ప్రాంతాలు జలమయమయినవి ఈ ప్రాంతాల్లో వరద భీభత్సం ఎప్పుడూ వుండేదే, అయినా యీ సంవత్సరం వరదలు మామూలుకంటే ముందుగా వచ్చినవి. అందువల్ల బాగా పంటకురాని వరిపొలాలు యీ నీటిముంపును అంతగా తట్టుకోలేక పోవచ్చు. ఇంకా ఒక నెలో, రెండు నెలలో గడచిన తర్వాతనైతే, వరిపంట కొంతవరకు తట్టుకోగలిగేది ఎర్రకాలువ వరదలో తాళ్లపాలెం, నెద్దివేట, సింగవరం, తాటిమెట్ల గ్రామాలలో చాలా విస్తీర్ణం మునిగింది. నరసాపురంతాలూకాలో కూడ వేమవరం, గుమ్మలూరు, గుణుపర్రు, యల్లవకుర్రు, వడ్డిపర్రు, పెనుమర్రు, మాధవాయపాలెం, నవరసపురం వగైరా వివిధ గ్రామాల్లోని పల్లపు భూములకు వరద వ్యాపించింది.

జిల్లాలో మొత్తంమీద వరదలో మునిగిన విస్తీర్ణం సుమారు 10,570 యకరాలని అంచనా. అందులో చాలావరకు ఏలూరు, తాడేపల్లిగూడెం, భీమవరం, తాలూకాలకు చెందిన ప్రాంతాలు పంట నష్టానికి తోడుగా, యితరత్రా జననష్టంగానీ. పశునష్టంగానీ, ఆస్థి నష్టంగానీ లేదు.

కృష్ణాజిల్లా:— వరద భీభత్సం కృష్ణాజిల్లాలో చాలా ఎక్కువగా వుంది. ఈ జిల్లాలో విపరీతమైన నష్టం సంభవించింది. ది. 6-7-56 నుండి 14-7-56 వరకు, ది.18-7-56 నుండి 23-7-56 వరకు, మళ్లీ ది. 26-7-56 నుండి ది. 2-8-56 వరకు కృష్ణా నదిలో వరదలు వచ్చినవి. నిరంతర అధికవర్షాల కారణంగా ది. 18-7-56 నుండి బుడమేరు కూడా పొంగింది. స్థానిక అతివృష్టి, కృష్ణానదిలోనూ, బుడమేరులోనూ వరదల ప్రభృతిం మూలాన ఈ జిల్లాలో నష్టం విపరీతంగా కలిగింది. విపరీత వర్షాలవల్ల గుడివాడ, కైకలూరు తాలూకాలలో చాలా విస్తీర్ణము, గన్నవరం, బందరు తాలూకాలలో అంతకంటె కొంచెము తక్కువగాను, వరదనీటిలో మునిగిపోయినవి. సుమారుగా 55,000 ఎకరములలో వరిపంటకు వరద తాకిడి తగిలింది. 146 ఇండ్లకు నష్టం కలిగింది. అదృష్టవశాత్తు జన నష్టం లేదు. ఒక్క దూడమాత్రం వరదలో కొట్టుకుపోయిందని తెలుస్తున్నది. కృష్ణానది వరదకట్టకు అవతలివైపున విజయవాడ పట్టణంలో ఒక భాగమైన భ్రమరాంబాపురంలో అనేక మంది ఇండ్లు, పూరింట్లు నేలకూలినవి అక్కడ నివసిస్తున్న 500 కుటుంబాలవారు ఆప్రాంతాన్ని ఖాళీచేసి వెళ్లిపోయారు. అందులో కొందరు స్నేహితులు, బంధువుల ఇండ్లలో తలదాచుకున్నారు. మ్యునిసిపల్ హైస్కూల్ భవనంలో 200 కుటుంబాలకు ఆశ్రయం ఇవ్వబడింది, విజయవాడ తాలూకా, ఖాస్కాపరావుపేట, కొటికెలపూడి,

FLOOD SITUATION IN THE ANDHRA STATE

(The Hon. Sri K Chandramouli) [9th August 1956

ఇబ్రహీంపట్నం, కేతనకొండ, దివి తాలూకాలోని చిరువోలులంక దక్షిణప్రాంతం, బొబ్బర్లంక, పిట్టలలంక, శివారు ఖావిసెట్టివారిపాలెం, తురకపాలెం, జుప్పలపాలెం వగైరా, కృష్ణానది లంకప్రాంత గ్రామాల ప్రజానీకం కూడా ఆయాప్రాంతాలు ఖాళీచేసి, సురక్షిత ప్రాంతాలకు చేర్చబడినారు.

హైదరాబాద్ రోడ్డు, ఇబ్రహీంపట్నం నుండి పరిటాలవరకు పూర్తిగా నీటిలో మునిగిపోయింది. బుడమేరు వరద రెండు రోడ్లమీద పారుచున్నందున విజయవాడ - నూజివీడు, గుడివాడ - నూజివీదు పట్టణాల మధ్య రాకపోకలు స్థంభించినవి.

ది. 18-7-56 నుండి కురిసిన విపరీత వర్షాలవల్ల జగ్గయ్యపేట, నందిగామ, తిరువూరు తాలూకాలలోని కొన్నివాగులు పొంగి నూజివీదు, జగ్గయ్యపేట, నంది గామ, తిరువూరు తాలూకాలలో సుమారు 20 పంట చెరువులకు గండ్లుపడినవి. పంటచెరువులకు గండ్లు పడుటయే కాకుండా, ఐదారు పంటకాల్వలుకూడా గట్లు తెగి నవి. ఈ చెరువులు, కాల్వలకు పడిన గండ్లు పూడ్చించటానికై జిల్లాలోని పబ్లిక్ వర్క్సు శాఖ, మైనర్ ఇర్రిగేషన్ సిబ్బంది పాటుపడుతున్నారు.

వ్యవసాయదారులకు విత్తనాలు వగైరా సప్లయి చేసేందుకై, కలెక్టర్ అదనంగా మంజూరు చేసిన రూ. 40,000 లతో సహా, ఇప్పుడు జిల్లా వ్యవసాయ శాఖాధికారివద్ద ఒకలక్ష రూపాయల మొత్తం సిద్ధంగా వుంది. అంతేకాక, భూమి అభివృద్ధి ఋణాలచట్టం, వ్యవసాయ ఋణాల చట్టాలక్రింద, వరద ప్రాంతాలలోని రైతులకు అప్పులు యివ్వటానికై ప్రభుత్వం మరొక లక్షరూపాయలు కూడా మంజూరు చేసింది.

వరద పరిస్థితులను స్వయంగా చూచి తెలుసుకునే నిమిత్తం అప్పుడే మన ముఖ్యమంత్రి, మరి యిద్దరు మంత్రులూ ఈ జిల్లాల్లోని వరద ప్రాంతాలలో పర్యటించిన విషయం మీ అందరకూ తెలిసిందే.

**గుంటూరు జిల్లా.—** కృష్ణ వరద గుంటూరు జిల్లాకు కూడా తగిలింది. గుంటూరు తాలూకాలో 9 గ్రామాలు, రేపల్లె తాలూకాలో ఒక గ్రామం వరదవల్ల దెబ్బతిన్నవి. రేపల్లె తాలూకాలో రాజుకాల్వలని వ్యవహరింపబడుతున్న పంటకాల్వకు రెండుచోట్ల గట్టుతెగింది. నదిలో వరద నీటిమట్టం 10 అడుగులకు లోపుగా తగ్గితేనేగాని, గట్టును మరమ్మతు చేయటానికి వీలులేదు. గుంటూరు తాలూకాలో వరద పొంగిన విస్తీర్ణం అంచనా సుమారు 50 చ. మై. పంట నష్టమైన విస్తీర్ణం

అంచనా సుమారు 15,000 యకరాలు. ఈ ప్రాంతంలో ముఖ్యంగా వరి, మొక్క జొన్న, వేరుసెనగ పంటలకు నష్టం కలిగింది. ఈ తాలూకాలలో పూర్తిగాకానీ, కొంతగాని నష్టపడిన యిండ్లు సుమారు 500 వరకు వుంటాయని తెలుస్తున్నది. జననష్టం, పశునష్టం లేదు. వరద ప్రాంతాలనుండి ఖాళీ చేయించబడిన సుమారు రెండువందల కుటుంబాలకు స్థానికంగా విరాళాలు వసూలుచేసి భోజన సౌకర్యం చేయ బడుతున్నట్లు సమాచారం అందినది.

కడప జిల్లా:— ఇటీవల అధిక వర్షాలవల్ల కడపజిల్లాలోకూడ నష్టం సంభ వించింది. ప్రొద్దుటూరు పట్టణం మధ్యగా పారుతున్న మేడూరు కాల్వ పొంగి, కాలువకు ఇరువైపులా సుమారు 250 మట్టియిండ్లు, గుడిసెలు నేలమట్టమైనవి. నిర్వాసికులకు జిల్లా కలెక్టరు భోజన వసతి యేర్పాట్లు చేస్తున్నారు. పడిపోయిన యిండ్లు మళ్లీ కట్టుకొనుటకు సహాయంగా గ్రాంట్లుకూడా యేర్పాటు చేయబడుతున్నవి. కమలాపురం సబ్—తాలూకాలో చిన్నదండ్లూరులోని పశువులకుంట, కాలమళ్ల గ్రామంలో ఎర్రచెరువు — ఈ రెండు చెరువులకు — కట్టలు తెగిపోయినవి. వీటిలో ఒక చెరువుకట్ట గండ్లు పూడ్చబడినవి. రెండవచెరువు మరమ్మత్తుకు కూడ అవస రమైన చర్యలు తీసుకొనబడుచున్నవి. ఇతర తాలూకాలలో ఏ విధమైన ఆస్తి నష్టం, పంటనష్టం, పశునష్టం, నీటి పారుదల వసతుల నష్టం కలుగలేదు.

మొత్తంమీద చూస్తే పంటలకు మాత్రం వివిధ ప్రాంతాలలో విపరీత నష్టం కలిగినప్పటికీ, ఏమాత్రం జననష్టం కలుగలేదని స్పష్టంగా కనిపిస్తున్నది. వరద ప్రాంతాలలోని ప్రజానీకాన్ని ఖాళీచేయించి సురక్షిత ప్రాంతాలకు చేర్చుటలో స్థాని కంగా ఆ యా కలెక్టర్లు, ఇతర ప్రభుత్వాధికారులు తీసుకున్న నిర్దుష్టమయిన చర్యలే ప్రధానంగా ఈ పరిస్థితికి కారణమని నేను భావిస్తున్నాను. అధికారులనే కాకుండా వరద బాధితులకు ఆశ్రయమిచ్చి, భోజన వసతులు వగైరా కల్పించుటద్వారా, ఆపదలో ఆదుకొని వరదబాధితుల సహాయ కార్యక్రమం నిర్వహించిన వివిధ అనధికార సంస్థ లను సహితం అభినందించ వలసివుంది.

కొన్నికొన్ని ప్రాంతాలలో పంటలకు విస్తారంగానే నష్టం కలిగింది. కాని దురదృష్టవశాత్తు పరిస్థితులను చక్కదిద్దే అవకాశం లేదు. ఎందుకంటే—మళ్లీ నాట్లు వేసుకోటానికి ఇప్పుడు అదును మించిపోవుటయే కాకుండా ప్రక్క జిల్లాలనుండి

కావలసిన నారు సేకరించటం కూడా సాధ్యంకాదు అందువల్ల రైతుల కష్టనష్టాలను గుర్తించి, వరదలవల్ల, అధిక వర్షాలవల్ల దెబ్బతిన్న ప్రాంతాలలోని రైతులవద్ద నుండి తక్కావి ఋణాలు, ఇతర ఋణాలబాపతు వాయిదా మొత్తాలను ది. 1-12-56 వరకు వసూలుచేయకూడదని ప్రభుత్వం ఆదేశించింది. అంతేకాక రాష్ట్రంలోని వరద బాధిత ప్రాంతాలలో అవసరమైనన్ని ధాన్యం చౌకడిపోలు ప్రారంభించటానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేస్తున్నది. భూమి అభివృద్ధి ఋణాలచట్టం, వ్యవసాయ ఋణాల చట్టాలక్రింద, వరద ప్రాంతాలలోని రైతులకు అప్పులివ్వడానికై ప్రభుత్వం ఇంకా ఎక్కువ మొత్తాలను కేటాయిస్తున్నది కూడా. ఆ యా చోట్ల జరిగిన నష్టం, ఇంకా నిర్వహించవలసిన అవసర సహాయక కార్యక్రమాలను గురించి, సవివరమైన నివేదికలు జిల్లా కలెక్టర్ల వద్దనుండి అందగానే అవసరమైన గ్రాంట్లను ప్రభుత్వం మంజూరు చేస్తుంది వరద బాధితుల కష్టనిష్ఠూరాలనూ, వారి రక్షణావసరాలను ప్రభుత్వం పూర్తిగా స్పష్టంగా గుర్తించిందనీ, వారికి సాధ్యమైనంత సహాయం చేసి ఆదుకోవటానికి సిద్ధంగా వుందనీ, గౌరవనీయ సభ్యులు నిస్సందేహంగా విశ్వసించవచ్చును.

Sri PILLALAMARRI VENKATESWARLU రెవెన్యూ మంత్రిగారి statement ను చర్చించడానికి కొంత time allot చేయాలని కోరుచున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI ఈ సమావేశంలో చర్చించవలసిన bills చాలాఉన్నాయి. మనం 23వ తేదీవరకు ఉండి ఆ తరువాత adjourn అవటము మంచిది. మరల Septemberలో meet కావచ్చును. దీనిని గురించి గవర్నరు ఉపన్యాసంలో కూడాఉన్నదికాబట్టి, floods విషయంగా Members ఏమైన చెప్పదలచుకుంటే తప్పకుండా గవర్నరు ఉపన్యాసంలోనే చెప్పవచ్చుననుకొంటాను. Governor గారి speechలో వివాదగ్రస్తమైన విషయాలు లేవు. అయినప్పటికి 3దినములు చర్చిస్తున్నాము. దీనికొరకు 3దినములు ప్రత్యేకంగా కేటాయించారు గనుక floods గురించి ఏమి చేయాలో ప్రభుత్వమునకు చెప్పదలచుకొన్న Members, గవర్నరు ఉపన్యాసాన్ని చర్చించే సందర్భంలోనే చెప్పవచ్చును. ఎందుచేతనంటే time లేదు. Time ఉంటే చేసుకోవచ్చును. గనుక, అవిధంగా చేస్తే బాగుంటుందని చెప్పుచున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU Ministers వద్దనుంచి ఏదైనా statement ఇచ్చినప్పుడు దానిని చర్చించవలసిన అవసరము, సాంప్రదాయము కూడా ఉన్నది.

Mr. SPEAKER I shall consider about this question. Now we go to the next item in the agenda

*(VI) DISCUSSION ON THE GOVERFOR'S ADDRESS.*

Mr SPEAKER I have to acquaint the House that on the 8th August the Governor was pleased to make a speech to the Members of this House, of which I had for greater accuracy obtained a copy and placed on the Table of the House on the 8th August itself.

Mr Vema Reddi will now move his motion.

Sri K V VEMA REDDI Mr. Speaker, Sir, I beg to move —

" That an humble address be presented to the Governor as follows —

That the Members of the Andhra Legislative Assembly assembled in this session are deeply grateful to the Governor for the Address which he has been pleased to deliver to this House on the 8th August 1956. "

Sri P. RANGA REDDI I second it

Mr. SPEAKER Motion moved

" That an humble address be presented to the Governor as follows.—

That the Members of the Andhra Legislative Assembly assembled in this session are deeply grateful to the Governor for the Address which he has been pleased to deliver to this House on the 8th August 1956."

There are as many as 107 amendments. Some of them may be overlapping

Sri PILLALAMARRI VENKATESWARLU · May I suggest that all the amendments may be taken to have been moved. There is no need to move them individually.

Mr. SPEAKER Some of the amendments may be overlapping

Sri PILLALAMARRI VENKATESWARLU There is no overlapping

Sri S VEMAYYA I suggest that all the amendments may be taken as being moved, and at the time of voting one of them may be put to vote.

Mr SPEAKER All right, we shall take the following amendments to have been moved

1. Sri R. B. RAMAKRISHNA RAJU

Add the following at the end—

" but regrets to find that adequate provision is not made for the maintenance of District Board roads which are in a deplorable condition"

2. Sri R B. RAMAKRISHNA RAJU

Add the following at the end—

" but regrets to find that due provision for giving food, drinking water for all villages is not contemplated and that the proposal is only for four new districts"

3. Sri R. B. RAMAKRISHNA RAJU

Add the following at the end—

" but regrets to note that the policy of providing house-sites to Harijans is very halting, that the amount allotted to districts are very inadequate and suggests that larger amount should be sanctioned for each district"

4 Sri S RANGANATHA MUDALIAR

Add the following at the end—

" but regrets to find that the settlement of the Andhra-Madras Border issue is indefinitely postponed till the time that the Government of India may choose to formulate what is called "uniform principles" that may be applicable to all States"

5 Sri S RANGANATHA MUDALIAR

Add the following at the end—

" but regrets to find that no reference is made to the peculiar problem of the Andhras in Bellary area"

6 Sri S RANGANATHA MUDALIAR

Add the following at the end—

" but regrets to find that no provision is contemplated to control the soaring prices of food grains in the State"

7. Sri S RANGANATHA MUDALIAR

Add the following at the end—

" but regrets to find that no provision is indicated to put a permanent ban on the burning of charcoal in Government forests in view of the indiscriminate felling of all kinds of trees and the destruction of the forests"

8. Sri S RANGANATHA MUDALIAR.

Add the following at the end—

" but regrets to find that no definite time limit is indicated for the ending of the administration of the District Boards by Special Officers and for the reconstitution of those Boards"

9 Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regrets to note that nothing is mentioned about Mr Slokem Report and quickning of the work of Nandikonda Sagar Project'

10. Sri VAVILALA GOPALAKRISHNAYYA·

Add the following at the end—

" but regret to note that nothing is mentioned about the implementation of Budameru Reservoir and Kolleru flood schemes"

11. Sri VAVILALA GOPALAKRISHNAYYA·

Add the following at the end—

" but regret to note nothing is mentioned about the increase of the salaries of Village Officers"

12 Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regret to note that nothing is mentioned about the increase of the salaries of the Elementary Schools and provincialisation of Elementary Schools"

13. Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regret to mention about the specific standardisation of the amount of Land Revenue, that too on the eve of the integration of Visalandhra"

14 Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regret to note that nothing is mentioned about the distribution of the Books in the Connemara Library, Saraswathi Mahal Tanjore, and the Madras Oriental Manuscript Library"

15. Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regret to note that supersession of Guntur and Vijayawada Municipalities"

16. Sri VAVILALA GOPALAKRISHNAYYA.

Add the following at the end—

" but regret to note that no mention was made about the implementation of Telugu language in the Government Administration"

17. Sri VAVILALA GOPALAKRISHNAYYA:

Add the following at the end—

" but regret to note that nothing is mentioned about the future position of the service personnel of the existing Andhra State in the future Andhra Pradesh"

18. Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regret to note that no mention was made about claiming these firkas viz., Moka, Rupanagudi and Bellary including Bellary Town in the Andhra State"

19. Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regret to note that no mention was made about the fixing of size of ceilings and family holding of the peasents and the rate of rent to be paid by the Agricultural tenants in Andhra so as to stand on the same basis with Telangana"

20 Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regret to note that no mention was made regarding the Finance Commission to allot 75% of the share on the income on tobacco produced and exported from Andhra"

21. Sri VAVILALA GOPALAKRISHNAYYA

Add the following at the end—

" but regret to note that fee concession was not accorded to the students who are studying upto III Form in Secondary Schools as promised by the Chief Minister when legislation of taxation was introduced"

22 Sri S. VEMAYYA

Add the following at the end—

" but regret to note that Andhra-Madras border issue has been delayed to come to an agreement between the two States"

23 Sri S VEMAYYA

Add the following at the end—

" but regret to note that no action has been taken to open fair price shops in the State as the common people are put to much inconvenience to meet the abnormal high prices of food grains now in the State in general and flood effected area in particular"

24. Sri S. VEMAYYA

Add the following at the end—

" but no mention was made regarding the supply of Electricity to the ryots for the purpose of agriculture"

25. Sri S. VEMAYYA

Add the following at the end—

" but regret to see that nothing has been said regarding protection of poor landless labourers who are in occupation of the Government waste lands cultivating since a decade, from mass scale eviction of them from their occupied lands"

26. Sri S VEMAYYA

Add the following at the end—

" but regret to note that nothing has been said regarding difficulties of the agricultural labourers who form the back bone of the State, in getting their adequate wages, Government waste lands, housing accommodation and drinking water facilities"

27. Sri S VEMAYYA

Add the following at the end—

" but regret to note that no comprehensive legislation is contemplated upon so far, in-spite of repeated representations of the public"

28. Sri S. VEMAYYA :

Add the following at the end—

" but regret to note that Government failed to give Government scales of pay to aided school teachers, though promised at the first instance"

29. Sri S. VEMAYYA ·

Add the following at the end—

" but regret to note that nothing has been said regarding un-employment and under employment problems prevailing among the educated people in general, and labourers in particular in the State".

30. Sri S VEMAYYA

Add the following at the end—

" but regret to note that nothing has been said regarding enhancement of pay scales of the N G Os. and merger of D A. on a par with scales of the Central Government servants"

31 Sri S. VEMAYYA

Add the following at the end—

" but regret to note that no adequate action has been taken to provide house-sites, drinking-water wells, pathways, burial grounds, protection of land tenure, protection from Exploitation by the land lords, inadequate laws to protect the Harijans from untouchability in the State"

32. Sri S. VEMAYYA

Add the following at the end—

" but regret to note that the system of Panchayat election is not conducted by Secret Ballot"

33 Sri S. VEMAYYA :

Add the following at the end—

" but regret to note that nothing has been said regarding relationship between the employer and the employee in industrial labour"

34. Sri V. VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps to construct Budameru Reservoir scheme"

35. Sri V. VISWESWARA RAO :

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps to open cheap grain depots in flood affected places and other places"

36 Sri V. VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps in developing, the various drainage schemes in Krishna District.

37. Sri V. VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps in developing and widening appertenant"

38. Sri V VISWESWARA RAO ·

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps to bring Land Reforms as was mentioned in Second Five Year Plan"

39. Sri V. VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps in allotting the money earmarked for Harijan house sites to various districts"

40. Sri V VISWESWARA RAO:

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps for finalising the budget of the N. E S. and C. D. blocks"

41, Sri V. VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps for implementing their promise of free education upto III Form this year"

42 Sri V VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps to keep their word of promise that levy of graded surcharge on land revenue assessment for one year only"

43. Sri V VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps in controlling the erosion at Damulur in Krishna river in Krishna District"

44. Sri V. VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps for supplying text books for S. S L. C class"

45. Sri V. VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps in constructing minor irrigation schemes in Krishna District such as Konayagandi tank and Uruvu Rakattu"

46 Sri V VISWESWARA RAO.

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps to bring a comprehensive Co-operative Bill"

47. Sri V VISWESWARA RAO

Add the following at the end—

" but regret to note the failure of the Government to take immediate steps to conduct all the Panchayat elections"

48. Sri V VISWESWARA RAO·

Add the following at the end—

" but regret to note the failure of the Government to continue the Adult Education Scheme"

49 Sri M. SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note that the Government of Andhra have not taken any concrete action when the prices of food grains are going higher and higher since nearly 6 months"

50 Sri M SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note that the Government have stopped all new works under Local Development Works and with this rate of progress, it is highly doubtful to accomplish the Second Five Year Plan successfully"

51. Sri M. SATYANARAYANA RAJU .

Add the following at the end—

" but regret to note that no mention has been made of Roads and bridges in Srikakulam and Vishakhpatnam Districts which are more important than those mentioned in the Governor's Address"

52. Sri M. SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note that no concrete work has been done in the establishment of heavy industries"

53. Sri M. SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note that no mention has been made with regards Dyeing and Printing, Cottage Industries though they are equally important as Handloom Industry"

54 Sri M SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note that the method adopted by this Government in the matter of allocating House-sites to Harijans is very very slow and no appreciable number of Harijans are benefited by this policy"

55 Sri M SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note the failure of the Government to give free education to boys as well upto III Form even from this year, though it is announced by Hon'ble Chief Minister on the floor of the Assembly during Budget Session"

56 Sri M SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note that the location of Veterinary College is not yet settled though our Andhra Government is formed 3 years ago"

57 Sri M. SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note that no adequate steps are taken in the matter of supplying medicines and surgical instruments to Hospitals"

58 Sri M. SATYANARAYANA RAJU.

Add the following at the end—

" but regret to note the supersession of two Major Municipalities in our Andhra State'

59. Sri M. SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note that there is general dissatisfaction for the appointment of Advisory Councils to District Boards"

60 Sri M SATYANARAYANA RAJU

Add the following at the end—

" but regret to note the appreciation of our Governor of the report submitted by Land Reforms Committee which is highly condemned by public upon referring its fundamental principles in News papers"

61. శ్రీ యన్. కాశిరెడ్డి — శ్రీ యమ్. నాగిరెడ్డి:

తీర్మానము చివర ఈ క్రింది విషయము చేర్చాలి·—

కాని, ఇటీవల వచ్చిన వరదల నివారణకు, వరద బాధితుల సహాయానికి ప్రభుత్వం తగినంత చర్యలు తీసుకోనందులకు, తీసుకున్న చర్యలు ప్రస్తావించనందుకు, యీ సభ విచారమును తెలియచేస్తూ ఉన్నది.

62. శ్రీ యన్. కాశిరెడ్డి:— శ్రీ యమ్. నాగిరెడ్డి:

తీర్మానము చివర యీ క్రింది విషయము చేర్చాలి·—

కాని, బియ్యం వగైరా ఆహార ధాన్యాల ధరలు రోజు రోజుకు విపరీతంగా పెరుగుతున్నప్పటికి, పెరుగుదలను అరికట్టుటకు తగు చర్యలు తీసుకొనుటను గురించి ప్రస్తావించనందులకు యీ సభ విచారము తెలియ చేస్తూ యున్నది.

63. శ్రీ యన్. కాశిరెడ్డి·- శ్రీ యమ్. నాగిరెడ్డి:

తీర్మానము చివర యీ క్రింది విషయము చేర్చాలి·—

కాని, ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాలలో స్థానిక అభివృద్ధి కార్యక్రమాలకు, జాతీయ విస్తరణ, కమ్యూనిటీ అభివృద్ధి కార్యక్రమాల క్రింద చేసేపనులకు 50 శాతము విరాళములకు బదులు 25 శాతముగా మార్చుటను గురించి ప్రస్తావించ నందుకు యీ సభ విచారము తెలియ చేస్తూ యున్నది.

64. శ్రీ యన్. కాశిరెడ్డి·- శ్రీ యమ్. నాగిరెడ్డి:

తీర్మానము చివర యీ క్రింది విషయము చేర్చాలి:—

కాని, ఇనుము, ఉక్కు, సిమెంటు ధరలు బ్లాకు మార్కెట్టులో విపరీతంగా పెరిగినప్పటికి అరికట్టుటకు ప్రభుత్వము తీసుకున్న చర్యలను గురించి ప్రస్తావించ నందులకు యీ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

65. శ్రీ యన్· కాశిరెడ్డి·— శ్రీ యం. నాగిరెడ్డి:

తీర్మానము చివర యీ క్రింది విషయము చేర్చాలి·—

కాని, నాగార్జున సాగరం ప్రాజెక్టు కుడికాలవను ఒకేదశలో నిర్మించు విషయము గురించి ప్రస్తావించనందులకు యీ సభ విచారము తెలియ చేస్తూయున్నది.

66. శ్రీ యన్. కాశిరెడ్డి — శ్రీ యం. నాగిరెడ్డి:

తీర్మానము చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.—

కాని, గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా పొందుగుల వద్ద కృష్ణానదిపై వంతెన నిర్మాణము చేయు విషయం ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

67 శ్రీ యన్. కాశిరెడ్డి - శ్రీ యం. నాగిరెడ్డి

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.—

కాని, అధ్వాన్న పరిస్థితులలోనున్న జిల్లాబోర్డు రోడ్లన్నింటిని ప్రభుత్వము స్వాధీనము చేసుకునే విషయముగురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

68. శ్రీ యన్. కాశిరెడ్డి:- శ్రీ యం. నాగిరెడ్డి:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.—

కాని, వ్యవసాయోత్పత్తి అభివృద్ధిని గురించి మునోర్సరి కాన్ఫరెన్సులో తీర్మానించిన వాటిలో వేటిని ప్రభుత్వం అమలు పరుస్తున్నదో ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

69. శ్రీ యన్. కాశిరెడ్డి - శ్రీ యం. నాగిరెడ్డి:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.—

కాని, వ్యవసాయ కూలీలకు కనీస వేతనము నిర్ణయించు విషయంగురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

70. శ్రీ యన్. కాశిరెడ్డి:- శ్రీ యం. నాగిరెడ్డి.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.—

కాని, సమగ్రమైన వ్యవసాయ సంస్కరణలను ప్రవేశపెట్టుటకు ప్రభుత్వం తీసుకున్న చర్యలు ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

71. శ్రీ యన్. కాశిరెడ్డి:- శ్రీ యం. నాగిరెడ్డి:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:—

( శ్రీ యస్. కాశిరెడ్డి:- శ్రీ యమ్. నాగిరెడ్డి )
కాని, గుంటూరు జిల్లాలో సిగరెట్టు ఫ్యాక్టరీని నిర్మించు విషయం ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

72. శ్రీ యస్. కాశిరెడ్డి:- శ్రీ యం. నాగిరెడ్డి:
తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి,—
కాని, విజయవాడ, గుంటూరుల మధ్య ఎరువుల ఫ్యాక్టరీని నిర్మించు విషయం ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

73. శ్రీ యస్. కాశిరెడ్డి:- శ్రీ యం. నాగిరెడ్డి:
తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:
కాని, హరిజనులకు ఇండ్లవసతిని కల్గించుటకు ఎగిసెంటి డబ్బును చేటాయించుటను గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది

74. శ్రీ యస్. కాశిరెడ్డి:- శ్రీ యం. నాగిరెడ్డి:
తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:—
కాని, బంజరు భూములన్నింటిని పేదలకు ఉచితంగా పంచు విషయం ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

75. శ్రీ ఎ. వెంకటరామరాజు:
తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:—
కాని, 1955 కంటె చాలా ఎక్కువగా ఆహారధాన్యాలధరలు పెరిగినప్పటికి ధరలను కంట్రోలు చేసి, చౌకిడిపోలు పెట్టించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

76. శ్రీ ఎ. వెంకటరామరాజు:
తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి;—
కాని, అనేక ఏండ్లుగా చర్చలోనున్న గోదావరి జిల్లాల అధిక వినియోగానికీ, వరదల ప్రమాద నివారణకు ప్రాజెక్టు నిర్మించే విషయం ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

77. శ్రీ ఎ. వెంకటరామరాజు:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.—

కాని, సిమెంటు, తారు రోడ్లకు సామాన్య మెటల్ రోడ్లకు మరమ్మతు చేయుటలో ఇంతవరకు ప్రభుత్వము చూపించే వ్యత్యాసమును సవరించ నందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

78 శ్రీ ఎ. వెంకటరామరాజు

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి —

కాని, పంచాయితీ ఎన్నికలలో మొదటనుండి అవలంభింపుతున్న రహస్య ఓటింగు పద్ధతులను మార్చి ఎన్నికలు ప్రజాస్వామిక వ్యతిరేక పద్ధతిని డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు వరంనుండి మార్చి పాత పద్ధతులలో ఎన్ని కలను జరిపించుటను గూర్చి ప్రస్తావించ నందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

79. శ్రీ ఎ. వెంకటరామరాజు:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.—

కాని, జిల్లాబోర్డు ఎన్నికలు జరుపుటలో కాలయాపన చేయుచూ, సలహా సంఘాలు నిర్మించుటవలన వాటి నిర్వహణ సరిగా లేకపోవుటవలన వక్షణం ప్రత్యక్ష ఎన్నికలు జరిపించడం గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

80. శ్రీ ఎ. వెంకటరామరాజు.

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.—

కాని, నిత్య జీవితా వసరవస్తువులైన నీరుల్లిపాయలు వగైరా వస్తువులపైన విధించే అమ్మకం పన్నును రద్దు చేయనందుకు ఈ సభ విచారము తెలియ చేస్తూ యున్నది,

81. శ్రీ ఎ. వెంకటరామరాజు:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:—

కాని, రాష్ట్ర ఆర్థిక విధానానికి స్థిరరూపం యిచ్చే కీలక సమస్య అయిన భూసంస్కరణలను, కేంద్ర ప్రభుత్వం, ప్లానింగ్ కమిషన్ సూచించిన మేరకు అమలు జరుపక కాలయాపన చేయుచూ తక్షణచర్యలు తీసుకో నందుకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

82. శ్రీ ఎ. వెంకటరామరాజు:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:—

కాని, నానాటికి వక్రరూపం దాలుస్తున్న వడ్డీ వ్యాపారాన్ని, బహిరంగ దోపిడిగా తయారయిన చిట్ ఫండు వగైరా కంపెనీలను అదుపులో పెట్టుటను గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

83. శ్రీ ఎ. వెంకటరామరాజు:

తీర్మానమునకు చివర యీ క్రింది విషయమును చేర్చాలి:—

కాని, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో అధికాహారోత్పత్తికి సరియైన పద్ధతులు సకాలములో అవలంభించక పోవడంవల్ల చాలాధనం దుబారా చేయబడింది. దీని విషయమై ప్రభుత్వం తీసుకున్న చర్యలను గురించి ప్రస్తావించ నందులకు యీ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

84. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:-

కాని, ఆంధ్ర భూసంస్కరణల సంఘంవారు సమర్పించిన నివేదిక ప్లానింగ్ కమిటీ లక్ష్యాలకు వ్యతిరేకంగానూ, అభివృద్ధి నిరోధకంగాను ఉన్నదని రాష్ట్రములోని అత్యధిక సంఖ్యాక ప్రజలు, ప్రజాశ్రేయోభిలాషులు భావిస్తూండగా గౌరవనీయులయిన గవర్నరుగారు తమ ఉపన్యాసములో పై నివేదిక అమూల్యమైనదని పేర్కొని, అందులోని లోపములను చెప్పనందుకు ఈ సభ విచారమును తెలియచేస్తూ యున్నది.

85. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమునుచేర్చాలి:-

కాని, పేద, మధ్యతరగతి ప్రజల ఋణభారాన్ని తగ్గించి, పరపతి సౌకర్యాలను ఎక్కువచేసేందుకు నిర్దుష్టమయిన సూచనలు గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూయున్నది.

86. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:—

కాని, హరిజనులకు నివేశ స్థలాలను యిచ్చుటలో ప్రభుత్వం శ్రద్ధ వహించక పోవుటవలన వారిలో నిరాశ, నిస్పృహ యేర్పడినాయి. ఈ కార్యక్రమాన్ని మరుకుగా కొనసాగించుటను గురించి ప్రస్తావించ నందులకు ఈ సభ విచారము తెలియచేస్తూయున్నది,

87. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి —

కాని, నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెం వంటి క్లాసు I పంచాయతీలకు కాల పరిమితి దాటిపోయినప్పటికీ, ఎన్నికలు జరుపకుండా వాయిదా వేస్తున్న నియమరహిత పద్ధతిని తొలగించుటను గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది

88. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:—

కాని, నెల్లూరు జిల్లాలో 10 వేల శివాయి జమాదారులను బంజరు భూముల నుండి వెళ్ళగొట్టు పద్ధతులను ఆపుచేయించి వారికి న్యాయమును చేకూర్చుటను గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియ చేస్తూ యున్నది.

89. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:-

కాని, ఆంధ్రలో ప్రాథమికోపాధ్యాయుల జీతములను పెంచినచో కేంద్ర ప్రభుత్వం సగం భరిస్తానన్నప్పటికీ జీతములను పెంచుటను గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

90. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి:-

కాని, ప్రస్తుత ఆంధ్రరాష్ట్రంలోని ఎన్.జి.ఓ. ల జీతాలకూ, హైదరాబాద్ లోని ఎన్. జి. ఓ. ల జీతములకు గల వ్యత్యాసమును ఆంధ్రప్రదేశ్‌లో తొలగించుటను గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారమును తెలియచేస్తూయున్నది.

91. శ్రీ బి శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి -

కాని, విద్యుచ్ఛక్తి సరఫరా ప్రణాళికలు అమలుజరుపుటలో నిర్ణయించబడిన క్రమము ననుసరించి గాక, నియమ రహితముగా జరుగుతున్న విధానమును గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

92. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రిందివిషయమును చేర్చాలి.-

కాని, ఆంధ్రలో జిల్లాబోర్డు రోడ్ల దుస్థితిని గమనించి, రోడ్ల నిర్వహణ నిమిత్తం కేటాయించిన మొత్తములో జిల్లాబోర్డు రోడ్ల నిర్వహణకు కేటాయించిన 10 శాతము కంటె ఎక్కువ మొత్తమును కేటాయించవలసిన విషయమును గూర్చి ప్రస్తావించ నందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

93. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.-

కాని, ఇండియా ప్రభుత్వ పారిశ్రామికవిధానం ప్రకారం ఆంధ్ర ప్రభుత్వమునకు అధిక ఆదాయమును చేకూర్చగల అభ్రకం పరిశ్రమను ప్రభుత్వ అధ్వర్యములో కొనసాగించి, పరిశ్రమను అభివృద్ధిపరిచే విషయము గూర్చి ప్రస్తావించనందుకు ఈ సభ విచారమును తెలియచేస్తూ యున్నది.

94. శ్రీ బి. శంకరయ్య:

తీర్మానమునకు చివర ఈ క్రింది విషయమును చేర్చాలి.-

కాని, చేనేత సహకారోద్యమములోకి చేనేత పారిశ్రామికుల నందరినీ సమీకరించుటకు ఇప్పుడున్న అవరోధములను తొలగించుటను గురించి ప్రస్తావించనందులకు ఈ సభ విచారము తెలియచేస్తూ యున్నది.

95. Sri PILLALAMARRI VENKATESWARLU

Add the following at the end—

" but regret to note the failure of the Government to bring in Land Reforms including ceiling of holdings, at least to the extent suggested by the Planning Commission in its report of Second Five Year Plan"

96. Sri PILLALAMARRI VENKATESWARLU

Add the following at the end—

" but regret to note the failure of the Government to announce its disapproval and rejection of the 'Report of the Land Reforms Committee Andhra' (Subba Rao's Committee)"

97. Sri PILLALAMARRI VENKATESWARLU

Add the following at the end—

" but regret to note the failure of the Government to impress upon the Government of India the necessity of appointing a Boundary Commission or Commissions to settle the disputes that had arisen between our State and neighbouring State"

98. Sri PILLALAMARRI VENKATESWARLU

Add the following at the end —

" but regret to note the failure of the Government to take adequate steps to imprees upon the Government of India the necessity of giving greater financial allotments to our State which is backward financially and economically to implement the Second Five Year Plan successfully"

99. Sri PILLALAMARRI VENKATESWARLU:

Add the following at the end .—

" but regret to note the Policy adopted by the Government in superseding Guntur and Vijayawada Municipal Councils from 22nd June 1956 just when it was time to hold elections in those cities, is undemocratic"

100 Sri PILLALAMARRI VENKATESWARLU ·

Add the following at the end—

" but regret to note the policy adopted by the Government in continuing the District Boards under the Collectors as Special Officers and constituting Advisory Committees without any powers, is undemocratic and ill-advised"

101 Sri PILLALAMARRI VENKATESWARLU ·

Add the following at the end—

" but regret to note the failure of the Government to provide permanent buildings to the hospitals in those places like Munagala where there are no such buildings and also appoint doctors where there are no doctors appointed in the hospitals"

102 Sri PILLALAMARRI VENKATESWARLU

Add the following at the end—

"but regret to note the failure of the Government to take up Jaggiahpet Panchayat for providing protected water supply under the Five Year Plan"

103. Sri PILLALAMARRI VENKATESWARLU

Add the following at the end—

"but regret to note the failure of the Government to take over the mining and trading in the important centre of mining areas of Mica and iron ores to augment the State Revenues"

104 Sri PILLALALMARRI VENKATESWARLU

Add the following at the end—

"but regret to note the failure of the Government either to nationalise bus services in the State or atleast to auction the bus routes in the State"

105 Sri PILLALAMARRI VENKATESWARLU

Add the following at the end—

"but regret to note the failure of the Government to pursue a policy which may enable the Government to grant house-sites to Harijans without delay"

106. Sri S. KASI REDDI

Add the following at the end—

"but regret to note the failure of the Government to provide universal free education upto III From despite the promise made by the Hon Chief Minister on the floor of the House"

107 Sri G YALLAMANDA REDDI ·

Add the following at the end —

"but regret to note that the policy pursued by the Government in increasing the average attendance in the private managed elementary schools from 20 to 25 and thus effecting retrenchment of thousands of teachers, is highly objectionable and retrograde"

Mr SPEAKER :—The main motion and the amendments are now before the House for discussion

Sri K V VEMA REDDI Mr Speaker, Sir, in moving this motion of thanks on behalf of this House to the address delivered by Sri C M Trivedi, Governor of this State, I wish to make a few observations, particularly with reference to certain important points referred to in the address At the outset, I must pay my tribute to the Governor of this State for having rendered valuable services in the development of this State by his valuable advice Also I must thank the Chief Minister for having given me the opportunity of moving this motion expressing thanks to the address of the Governor The address presents a picture of the Policies adopted by Government and the extent of implementation of those policies I do not wish to deal with them at length But I wish to make a brief survey of the points referred to in the address.

Our State was formed only a few years ago by our separation from the Madras State in a truncated form, and to-morrow ours will be an enlarged State with the merger of Telangnna—it being the step taken in 1953 being pursued to its logical conclusion. Then, ours will be one of the premier States in India with all i's resources—water and power resources, mineral wealth and raw materials. We have a great future. The future of this State depends upon unified leadership, free from prejudices, free from communal bias and free from parochial and regional consciousness. We have to compose our differences and contribute to the well being of this State by a strong and stable Government This Government has already taken steps in consultation with the Hyderabad Government in bringing about integration of both States and in providing accommodation both residential and office and also for legislators.

We are in a new age, we are on the eve of momentous changes; we have begun the Second Five year Plan. and we are marching towards building up a new India based on the socialistic pattern of society. No doubt this is a huge task which requires lot of funds and lot of co-operation both from the public and the Central Government. But it must be remembered that the Second Five Year Plan touches only the fringe of our development. We have to pass through several such Plans to achieve our object.

Sir, the Governor was kind enough to make a reference to the seasonal conditions in this State and our Hon Minister, Sri Chandramouli just now made a statement giving the details of the havoc caused by the floods not only in Guntur, Godavari and Krishna districts but also in Cuddapah. The havoc caused cannot be reckoned in terms of money as the damage caused is colossal Though I have no first-hand knowledge of the havoc caused by the floods, yet, from what I see from the newspaper, I see that the damage caused to crops covers over thousands of acres Several villages have been inundated and sources of irrigation have been heavily damaged I am glad our Chief Minister and other Ministers rushed to the spot, visited the affected areas, and have rushed relief to alleviate the suffering of those poor people

Now let me turn to the irrigation facilities contemplated in the Second Five Year Plan and the progress that has already been made with reference to them in the First Five Year Plan Ours is an agricultural country with a lot of pressure upon land, with large potentialities for the increase of production from land We have made immense progress in creating several irrigation facilitics, and I need not give a catalogue of those minor and major projects taken up But I wish to refer to the three projects, to which reference was made by the Governor and which paly a great part in the development of our State The Vamsadhara project agitated for so long by the Srikakulam district people has to-day become a reality. The Nandikonda projcet, a gigantic project involving an expenditure of 22 crores, irrigating about 30 lakhs of acres and generating 73,000 k w , is really a great boon to our State. It is the efforts of the Governor and the efforts of our Government headed by the Chief Minister, and the efforts of the Deputy Chief Minister, Sri Sanjeeva Reddi, that has contributed to the achievement of this magnificent project.

Next I want to refer to the High Level Channel. The representative of our Government ,Sri Sanjeeva Reddi, the Deputy Chief Minister and the representatives of the Mysore Government could reach an agreement to realise the fructification of the High Level Channel, which was a long-felt need of Rayalaseema To-day it has become a reality, and I am sure it will bring greater prosperity to the famine striken areas of Rayalaseema and it will be an insurance against the recurring famines of

Rayalaseema Sir, I need not refer to the several minor projects which are all in progress now.

As regards Electricity' the Machkund project is a mighty hydro-electric project, which is supplying great power to our State It, along with the Tungababhadra project, which will be ready by the end of December 1957, will contribute to the electrification of the rural areas.

The scheme is pushed through with utmost rapidity, thanks to the special efforts of the Government and Sri G. Latchnna. Minister for Electricity. I am glad, indeed, that within the course of a short time, the rural population will be benefited by these schemes for expansion of electricity. Also, special priority has been given to areas like Rayalaseema and some other places where cultivation is carried on by wells

As regards industries, the first Five Year Plan does not give a progressive record of the industrialisation of the country. The Second Five-Year Plan envisages an era of industrialisation in our country Our Government have taken steps for starting new factories like spinning mills and sugar factories and they have granted licences to several people in this regard. But the necessary capital is not coming forward. I know in my own district of Anantapur when Governament were kind enough to start a sugar factory and a spinning mill, adequate capital did not come forward and it is because the co-operative movement has not instilled confidence in the people for purchasing shares. So far as minior industries are concerned, the second Five year plan plays a prominent part in the development of minor as well as cottage industries Minor and cottage industries form an integral part of the second Five - year plan which has provided adequate funds for their development. Because of the importance of these industries in the economy of our country, the Government have suggested several schemes for financial assistance from the central Government.

As regards revival of sericulture, I should corgratulate the Government, about 16 schemes, as referred by the Governor in his address, were sanctioned by the Central silk Board and I am sure they will be started in places where mulberry tress are available in plenty I am sure that Hindupur in Anantapur district will be one for the development of sericulture.

Apart from the development of major and minor industries, the development of cottage industries has received an impetus by the aid from the Central Government through the Cess Fund and Co operative Societies. I am sure that by the end of the Second Five-Year plan, our country will make tremendous progress in industrialisation which will solve unemployment to a large extent

With regard to education, the Governor was pleased to refer to the expansion of primary education and free educational facilities granted to the students up to III Form It is a kind gesture of the Governmen that they have sanctioned free education for girls up to III Form from the current year and for boys by stages Expansion of education is very essential for democracy and the Constitution also has provided for liquidation of illiteracy by free and compulsory education within the next 10 years But the target cannot be reached, the reasons being obvious With the slender finance of the State, it is not possible to reach the target. But I must congratulate the Hon Chief Minister for having taken keen interest in respect of expansion of primary education With a view to get the management of shools under unified control as a first step, the aided schools in Nellore district have been taken over by the Government. Sri Venkaterwara University marks an era in the devlopment of higher education in Rayalaseema. Today Rayalaseema can boast of a University and we are entering a new age when Rayalaseema will be much benefited.

Sir, the Governor in his address has referred to the co-operative movement, community development programmes and national extension service blocks Indeed, community development programmes and national extension service blocks cover about 4, 450 villages and they have made considerable progress wlth the co operation of the public which is vital for the community development programmes These schemes have instilled a sense of duty and a sense of service in the people and they have contributed their share in the shape of capital or labour

The Governor was also pleased to refer to land reforms. The land Reforms Committee has submitted its report and it is under the examination of the Government. I have not gone through the report as yet

Still I feel, from what I hear, that it is very conservative. The Second Five-Year Plan however contemplates agrarian reform. It is good, it is inevitable. But the agrarian reform involves several other complications. For instance, the Second Five Year Plan also envisages ceiling of land; I do agree that it is necessary. But the ceiling of land should synchronise with the ceiling of incomes in urban areas. Ceiling of income and ceiling of land must go together Today if agriculturists alone are affected by the agrarian reform, leaving aside the urban people, there will be a great struggle between the urban capitalists and the rural agriculturists I am sure the Government will consider all these aspects of the question and land reforms will be introduced at least when Andhra Pradesh is established with Hyderabad as our capital

Then, Sir, the uplift and raising of the economic condition of backward classes, scheduled castes and seheduled tribes, forms an integral part of the Second Five-Year Plan The Government have taken up several schemes in this regard and the Central Government also have approved them and all these schemes will really go to improve their condition.

Sir, let me now refer to health and medical fields which the Governor was pleased to refer to. The medical facilities in the State, as admitted by the Governor, are very inadequate. Because of the slender financial resources of the Government, they are not able to take up schemes which entail large expenditure. At present the villages have no medical facilities and the Government are taking some steps to extend medical facilities to villages I must congratulate the Government for effecting improvements to district and taluk headquarters hospitals and it is a matter of gratification that the Government have opened a Medical College at Kurnool. Kurnool may not be the seat of the Government, but it may develop, I hope, into a seat of learning.

So far as the different systems of medicine are concerned, the Government have decided to recognise the systems of Unani and Homeopathy and they want to bring in legislation for this purpose. With this, I hope the dearth of doctors will be minimised.

As regards communications, the Governor was pleased to refer to Srisailam road from Dornakal This is a very important road connecting the piligrim centre of Srisailam. As regards National Highways, the Governor was pleased to refer to Alamuru bridge on the Godavari and another on the Tungabhadra near Kurnool which will increase the transport facilities to the people Sir, the Address gives a picture of the policy and the attempts of this Government In spite of slender finances, the Government has done well for the development of this State. Thank you, Sir.

Sri M SATYANARAYANA RAJU అధ్యక్షా, గౌరవనీయ గవర్నరు గారు 8వ తేదిన 11 గంటలకు వచ్చి, సరిగా ఒక గంటసేపు ఉపన్యాసం ఇచ్చారు. కాని ఆ ఉపన్యాసంలో ప్రస్తుతము మన ఆంధ్ర రాష్ట్రములోఉన్న క్లిష్ట పరిస్థితులను గురించి చాలా నిరుత్సాహంగా ఉన్నదని, ఏమాత్రం ఆశా జనకంగా లేదని చెప్పటానికి చాలా విచారిస్తున్నాను. ఎందుకనగా, ఒకప్రక్కన ఆహార పదార్థాల ధరలు పెరుగుతున్నప్పటికి యీ విధంగా పెరుగుతున్నాయని గతమార్చి Budget Session లోనె కొంతమంది గౌరవ సభ్యులు ప్రభుత్వ దృష్టికి తీసుకు వచ్చినప్పటికి, అప్పటి నుంచీ కూడా, రానురాను (రోజు, రోజు) ధరలు పెరుగుతున్నప్పటికి కూడా, దానికి తగు చర్యలు తీసుకోలేదు. ఇప్పటికి రమారమి ఆరు మాసాలైంది. దీన్ని గురించి ప్రభుత్వము ఏదో watch చేస్తున్నట్లుగా గవర్నరు గారు సెలవిచ్చారు. యీవిధంగా గమనించుకొంటూ ఊరకుండడము. ఎంతవరకో; అర్థం కావడంలేదు. యీ మధ్యన కార్మికులైతేనేమి, పేద ప్రజలైతేనేమి హెచ్చుధరలతో కొనుక్కోలేక చాలా కష్టపడుతున్నారు. ఈవిషయంలో ఇంత ఆలస్యంచేయడం చాలావిచారకరము. కాబట్టి ముఖ్యంగా, యీ ధర వరుల విషయంలో ప్రభుత్వము వెంటనే చర్య తీసుకోకపోతె బీదప్రజలు చాలా కష్టపడవలసి వుంటుంది.

తరువాత, ఈ మధ్యన అధిక వర్షాలవల్ల, ఇంచు మించు అన్ని జిల్లాలలోను, పంటలు నష్టమై పోతున్నాయి. అందులో ముఖ్యంగా గోదావరి, క్రిష్ణా, గుంటూరు జిల్లాలలో ఈ నష్టం తీవ్రంగా జరిగింది. శ్రీకాకుళం జిల్లాలో కూడ ఈ వర్షాలవల్ల చాలా పంట నష్టం అయింది. ఈ వరద ముంపు నివారణ గురించి దఫ దఫాలుగా ప్రభుత్వం దృష్టికి తెస్తున్నాము. Budget Session లో కూడా లు ఈ విషయం గురించి మాట్లాడారు. ముఖ్యంగా బుడమేటి scheme

గురించి వాదోప వాదాలు జరుగుతున్నాయి ఈ బుడమేటి ముంపు నివారణ scheme గురించి, అతి లాభసాటి కాదని, ఒక diversion scheme మాత్రం చేస్తామని ప్రభుత్వం చెప్పినారు. ప్రస్తుతము, మంత్రి వర్యులు అందరు ఆ ప్రాంతములో పర్యటన చేశారు గనుక, దీనివల్ల ఎంత నష్టము కలుగుతున్నదో వారికి తెలిసి యుంటుందని అనుకొంటున్నాను కాబట్టి యిదివరలో వేసిన లెక్కల బట్టి చూచి నటయితే ఈ నష్టముయొక్క నివారణ లాభసాటిగా ఉంటుందనే విషయముగుర్తించ వలసిందని కోరుతున్నాను. అందుచేత ఈ బుడమేటి ముంపు నివారణ scheme ను వెంటనే తీసుకొని ఈ ముంపు ప్రమాదమును నివారణ చేస్తారని ఆశిస్తున్నాను.

తరువాత నీటి పారుదల విషయంలో గవర్నరుగారు చాలా మట్టుకు పెద్ద పెద్ద ప్రాజెక్టులు, నందికొండ, వంశధార మొదలగు పెద్ద ప్రాజెక్టుల గురించి చెప్పి నారు ఈ నందికొండ ప్రాజెక్టు గురించి 120 కోట్లు తెచ్చి చేస్తన్నాము, ఇంకా ఏ దేవో చేసున్నామని చెప్పినారు. కాని ఈ నందికొండ, వంశధార మొదలగు పెద్ద పెద్ద ప్రాజెక్టులు వెంటనే ఫలితాన్ని ఇచ్చేవికావు. ఏ 15, 20 సంవత్సరాల కోగాని వాటివల ఫలితము రాదు. ముఖ్యంగా, minor irrigation projects తెగిపోయిన చెరువులకు, కాలవలకు, మరమ్మతు చేయుట— ఈ పనులు వెంటనే మనకు ఫలితము నియ్యగలవు. ఇటువంటి minor irrigation పనులు గురించి ఈ ఉపన్యాసములో లేకపోవడం చాలా విచారకరము. గత సంవత్సరం తెగిపోయిన చెరువులుకూడా ఇంకా అవిధంగానే ఉన్నాయి వాటినిగురించి పదే పదే చెబుతున్నప్ప టికి ఆ పనులు కూడ ఇంకా పూర్తిచేయలేదు, అవి కాక, ఈ సంవత్సరం కూడ కొన్ని చెరువులు, కాలవలు తెగిపోయినాయి. వాటిని గురించిగాని, వీటిని గురించి గాని, ఈ మాత్రం కేటాయించామనే విషయంకూడా గవర్నరుగారి ఉపన్యాసంలో లేకపోవడం చాలా విచారకరము. అందుచేత, ఎప్పుడో, ఏ 15, 20 సంవత్సరాలకో ఫలితము నిచ్చేవాటిని గురించి శ్రద్ధ వహించే దానికంటే, వెంటనే ఈ సంవత్సరమో వచ్చే సంవత్సరమో మనము ప్రతిఫలము పొందేటటువంటి నీటి పారుదల పనుల విషయములో హెచ్చు శ్రద్ధ ప్రభుత్వము వహించవలసిందని వారి దృష్టికి తీసుకొని

తరువాత Planning and Development, గురించి చాలావరకు గౌరవ నీయులైన గవర్నరుగారు సెలవిచ్చినారు. First Five-Year Plan మధ్య కాలము లో మన ఆంధ్రరాష్ట్రము ఏర్పడినందున, మనము దీన్ని సంతృప్తికరంగా చేయలేక

పోయినామని, మనముచేయగలిగేది రెండవ పంచవర్ష ప్రణాళికలో చేయవలసి యుంటుందని ఇదివరకే అనుకొన్నాము ఇప్పుడు ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో మొదటి సంవత్సరము జరుగుచున్నది, ఈ మొదటి సంవత్సరంలో క్రొత్త works ఏవి చేయవద్దని జిల్లావారిగా అప్పుడే orders వచ్చిఉన్నాయి. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో సమాప్తికానటువంటి పనులు చేయవలసిందని చెప్పబడింది. అందులో కొత్త Works take up చేయకూడదని ఉన్నది. ఇప్పటికే August మాసము అయిపోవుచున్నది ఇంక వచ్చేరెండు, మూడు మాసాలు వర్షాకాలముగా ఉంటుంది, కాబట్టి ఈ సంవత్సరానికి allot చేసిన 12 కోట్ల రూపాయలు ఎప్పుడు ఖర్చుపెడతారో తెలియదు. ఇదివరకో జనవరి, ఫిబ్రవరిలోనే పనులు ప్రారంభం చేసి, మార్చి 31 తేదీలోగా పూర్తి చేయవలసిందని చెప్పడంవల్ల, తొందరపాటుతో పనులు సరిగా జరగకపోవడం, దుబారా ఖర్చు హెచ్చుఅవడం జరిగింది. ఇదే పరిస్థితి రెండవ పంచవర్ష ప్రణాళికలోకూడా జరిగేటట్లుఉన్నది కనుక ఈ విషయంలో ఎంతమాత్రం జాగుచేయక, రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రథమ సంవత్సరానికి మొత్తము వెంటనే allot చేసి వెంటనే పనులు ప్రారంభం చేస్తేనే తప్ప పనులు సవ్యంగా జరగవనే విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను.

గవర్నరుగారి ఉపన్యాసంలో-గత ఏప్రిల్‌లో ఇచ్చిన ఉపన్యాసంలో అయితేనేమి, నిన్న ఇచ్చిన ఉపన్యాసంలో అయితేనేమి, ఎప్పుడూ ఈ పోలవరం దగ్గర bridge గురించి, శ్రీశైలం రోడ్డుగురించి, గుంటూరు-పర్చూరు రోడ్డుగురించి మొదలగువాటిని గురించి చెప్పడం జరిగిందేగాని శ్రీకాకుళం, విశాఖపట్టణం గురించి చెప్పకపోవడం విచారకరము వారు చెప్పినవాటికంటె హెచ్చు ప్రాముఖ్యత కలిగినటువంటి, ఉపయోగకరమైనటువంటి రోడ్లు, ప్రాజెక్టులు చాలాఉన్నాయి బహుశః మంత్రులు ఈజిల్లాలో తరచుగా తిరగకపోయినా, అప్పుడప్పుడు విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలకు వస్తున్నారు. అక్కడ ఉన్నటువంటి నదులను దాటుటకు bridge లేకపోవడంవల్ల ప్రజలు అక్కడ ఎంతకష్టపడుతున్నారో వారికి తెలిసి యుంటుందనుకొంటాను; లేకపోయినట్లయితే, అక్కడి పరిస్థితులు స్వయంగా తెలుసుకుని, వెంటనే ఆపనులు ప్రారంభించవలసి యుంటుంది. నెల్లిమర్లవద్ద ఒక bridge గురించి 4,5 సంవత్సరముల క్రిందటనే investigation అయింది. దానికి token grant అని ఒక లక్ష రూపాయలు sanction చేశారు కాని పనిమాత్రం ప్రారంభించినట్లు కన్పించలేదు.

గోస్తనీనది మీద bridge work ప్రారంభించి రెండు మూడు స్థంభాలు పెట్టారు. ఆ స్థంభాలు అప్పుడే ఒరిగి పోయినాయి కూడ, మరొక సంవత్సరం, రెండు సంవత్సరాలైతే అవి పడిపోవచ్చు కూడ. దానికి చాలాడబ్బు ఖర్చుఅయింది. ఆపని ఆ విధంగా సగముచేసి విడిచిపెట్టడంవల్ల వృధాఅయిపోవడమో కాకుంటే, ఆపని జరుగకపోవడము, ప్రజలు కూడా చాలా ఇబ్బంది పడడమూ జరుగుతుందనే విషయం ప్రభుత్వం వెంటనే గుర్తించి, ఈ రెండు bridges పని వెంటనే ప్రారంభించవలెనని కోరుతున్నాను.

తరువాత industries గురించి గవర్నరు గారు చెప్పారు. ముఖ్యంగా major industrie లో sugar factories ను co-operative basis మీద ఇస్తున్నామని, దీనికి licence ఇవ్వమని ప్రభుత్వం సిఫార్సు చేసిందని, కాని దానికి తగినట్లు ప్రజలనుంచి capital రావేదని, దానికి సంబంధించిన సభ్యులు ఈ capital వచ్చేటట్లు చేయవలసిందని అన్నారు. కాని ఒక కంపెనీని register చేసినంత మాత్రాన దానికి licence recommend చేసినంత మాత్రాన, ఆ industry thrive కాదు. ముఖ్యంగా మన ఆంధ్ర రాష్ట్రం ఆర్థికంగా వెనుకబడినటువంటి రాష్ట్రమని అందరికీ తెలుసును. ఇటువంటి వెనుకబడిన రాష్ట్రంలో వెంట వెంటనే డబ్బు రావడం చాలా కష్టము కనుక, ఇటువంటి పరిస్థితులలో, వాళ్ళయొక్క అయివేజులు బట్టి, వారికి అప్పు ఇచ్చో- మరోవిధంగానో ఏమైనాచేసి దానియొక్క మూలధనమును సేకరించి, అటువంటి సహాయముకూడ చేసినట్లైతే, industry ముందుకు వస్తుందిగాని- కేవలం దాన్ని register చేసి దానికి licence ఇవ్వడానికి recommend చేసినంత మాత్రాన అదిముందుకు రాదు. కాబట్టి ఈ capital విషయంలో కూడా గవర్నరు గారు శ్రద్ధ తీసుకొని ఆవిధంగా దాన్ని తొందరగా ఏర్పాటు చేయవలసి యుంటుంది.

తరువాత Cottage industries ను గురించిన్నీ చేనేత industry గురించిన్నీ గవర్నరుగారు చాలా మట్టుకు ప్రసంగించారు. అందులో ముఖ్యంగా hand loom industries కు సంబంధించినవి dyeing industry ను గురించి కూడ చెప్పలేదు. ఈ industry లో రంగులు, అద్దకాలు మొదలైనవి ఉన్నవి. వీటిసంగతి గవర్నరు గారు చెప్పక పోవడము చాలా విచారకరముగా ఉన్నది. Dyeing industry విశేషంగా శ్రీకాకుళం జిల్లాలో సిగరాం అనే గ్రామములో తరతరాలనుంచి జరుగుచున్నది. దీని విషయంలో మనము ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్నపుడు 1947 సం॥లో ప్రత్యేకంగా Textile Commissioner అని ఒకరిని ఏర్పాటు

వేశారు. ఆయన జిల్లాలలో ఆసామివారీగా లైసెన్సులు యిస్తూ, వారి వారికి అవసరమైన కోటాలు మంజూరుచేస్తూ, రంగులు వేసిన నూలును తెప్పించు కోటానికి వీలు కలుగజేస్తూ ఉండేవారు. ఈ లైసెన్సులు ఆసామివారీగా యిచ్చేవారు. Wholesale కోటాలు సహకారసంఘాలు పుచ్చుకోవాలి అని ఆదేశించడం జరిగేది ఈ విధానము మనము మద్రాసు రాష్ట్రమునుంచి విడిపోయి వచ్చేవరకు అనగా 1953 వ సెప్టెంబరు నెల ఆఖరువరకూ జరుగుతూ వచ్చింది తరువాత మనకు రాష్ట్రము ఏర్పడిన తరువాత, యిది తీసివేయడము జరిగింది. అప్పటి నుంచి యిప్పటివరకు ప్రభుత్వము వల్ల ఏ సహకారము లేకుండ యీ industry కుంటు బడింది. ఈ విషయము ప్రభుత్వ దృష్టికి, మంత్రుల దృష్టికి తీసుకుని రావడము జరిగింది. దీనిని గురించి ప్రభుత్వము ఏ విధమైన శ్రద్ధ తీసుకోక పోవడము చాలా విచారకరముగా ఉన్నది. ఇప్పటికైనా యీ చేనేత పరిశ్రమ అన్ని విధాలుగా జయప్రదముగా జరగాలి అంటే, రంగుల పరిశ్రమ, అద్దకాల పరిశ్రమ, యీ రెండున్నూ చేనేత పరిశ్రమలో సమాన స్థాయిలో ముందుకు తీసుకుని రావటానికి ప్రభుత్వము ప్రయత్నించ వలసిందిగా కోరుతున్నాను

తరువాత హరిజనులకు యిళ్ళ స్థలాలను గురించి గవర్నరు గారి ఉపన్యాసములో చెప్పారు. ఇదివరకు యిచ్చిన రెండు లక్షలకుతోడు యీ సంవత్సరము మరొక రెండు లక్షలు అదనముగా శాంక్షను చేయబడిందని చెప్పారు. అయినప్పటికినీ, యీ విషయము యిప్పటికి నాలుగు అయిదు సంవత్సరముల నుంచి జరుగుచున్నది. దరఖాస్తులు పెట్టటం గూడ జరుగుచున్నది. కాని యింతవరకు యీ స్థలాలకు సంబంధించిన స్థలము acquire చేయకపోవడంవల్ల, ఆలస్యము కావటానికి అవకాశము కలిగింది. కాబట్టి యింతవరకు అవలంభించిన విధానము ప్రభుత్వం మార్చుకుని, నూతన విధానము త్రొక్కి, యీ స్థలమును త్వరలో acquire చేసి హరిజనులకు యివ్వవలసిందిగా కోరుచున్నాను హరిజనులకు యిళ్ల స్థలాలు యిస్తామని ప్రభుత్వము ఎంతో కాలముగా చెబుతూ వస్తున్నది కాని యింతవరకు యివ్వక పోవడమువల్ల, హరిజనులకు చాలా అసంతృప్తి కలిగింది. ఈ అసంతృప్తిని పోగొట్టటానికి ప్రభుత్వం ప్రయత్నించ వలసిన అగత్యం ఎంతో ఉన్నది. హరిజనులనుంచి దరఖాస్తులు, డబ్బు డిపాజిట్లు తీసుకున్నంత మాత్రాన, ప్రభుత్వం స్థలాలు సేకరించి యిస్తేనేగాని హరిజనులలో ఏర్పడిన అసంతృప్తి పోగొట్టే అవకాశం కలుగదు. స్థలాలు యిస్తేనేగాని, వారికి యిళ్ళు ఏర్పడవు. కాబట్టి ప్రభుత్వ విధానము మార్చుకుని నూతన పంథాలో స్థలాలు త్వరలో acquire చేయవలసిందిగా కోరుతున్నాను.

తరువాత విద్యా విషయము చూస్తే, ముఖ్యమంత్రిగారు బాల బాలికలందరికి ఉచితముగా విద్య నేర్పుటకు ఏర్పాటు చేస్తానని, తన బడ్జటు స్పీచ్‌లో చెప్పారు కాని ఏ కారణముచేతనోగాని, బహుశ ఆర్థికలోపముచేత కాబోలు, బాలురకు క్రమేణ మూడు సంవత్సరముల లోపల అని, బాలికలకు వెంటనే అని III Form వరకు ఉచితముగా విద్య నేర్చుకొనే ఏర్పాటు చేశారు. ఈ విధమైన ప్రకటన ప్రభుత్వం చేసింది. యీ ప్రకటన మూలంగా యీ సంవత్సరము I Form లోనే ఎంతో మంది బాలురకు సీట్లు దొరకడము చాలా కష్టమైంది. పెద్ద క్లాసులలో సీట్లు దొరికినవి కాని, I Form లో ప్రవేసించేవారికి వందలకొలది బాలురకు సీట్లు దొరకలేదు. కొన్నిచోట్ల I Form, II Form పిల్లలకు బొత్తిగా సీట్లు దొరకనేలేదు. మా శ్రీకాకుళం జిల్లాలోనే యీ విషయము నేను స్వయముగా చూశాను. గుంటూరు జిల్లాలో సుమారు 15 వందల మందికి పైగా I Form లో ప్రవేసించే బాలురకు సీట్లు దొరకనేలేదని పత్రికలలో ప్రచురించడము వల్ల తెలుసుకోగలిగాను. మొదట్లో ప్రవేశించే I Form లోనే సీట్లు దొరక్కపోవటము శోచనీయము. ఈ విధముగా జరిగితే, యిక యీ బాలురందరికి విద్య ఏ విధముగా వస్తుందో ప్రభుత్వం గుర్తించాలి. దీనిని బట్టి యీ సంవత్సరము పూర్తిగా విద్యలేని వారవుతారు. పైగా ఒక సంవత్సరము దాటిపోయినట్లే గదా. ఎక్కడ ఏ జిల్లాలో ఎట్లా ఉన్నప్పటికినీ, మా శ్రీ కా కు ళ ం జిల్లా సంగతి నాకు స్వయముగా తెలిసిన విషయము, నేను చెబుతున్నాను. స్కూలులో సీట్లకు accommodation దొరకటము చాలా దుర్లభమైంది. ఈ విధముగా జరిగిందనిన్ని వీరందరికి సీట్లకు ఏర్పాటు చేయవలసిందన్నీ, Director of Public Instruction కు వ్రాశాను వారి మీదట కొద్దిగా సీట్లు దొరికినవి కాని, పూర్తిసహాయము దొరకలేదు. మా జిల్లాలో కొన్ని middle schools ను start చేయవలసిందిగా ప్రభుత్వానికి గూడ వ్రాశాను. అందుచే అక్కడ ప్రజలు స్కూలుకు accommodation చూపిస్తామని, స్కూలుకు యివ్వవలసిన డబ్బు డిపాజిటు చేస్తామని వ్రాశారు. మూడువేల రూపాయలు డబ్బు డిపాజిటు చేస్తామని జిల్లాబోర్డువారి వద్దకు వెళ్ళి చెప్పుకున్నారు. ప్రభుత్వము వద్దనుంచి ఉత్తరువులు రాకముందు డబ్బు డిపాజిటు చేయవద్దు, వచ్చిన తరువాత చేయవచ్చునని జవాబు చెప్పారు. School కు తగిన accommodation చూపటానికి, డబ్బు డిపాజిటు చేయటానికి సంసిద్ధత తెలిపినన్నూ, యీ middle schools ను ఏర్పాటు చేయుట ప్రస్తుతానికి defer చేశామని

ప్రభుత్వం నుంచి ఉత్తరువులు వచ్చినట్లు చెప్పారు. Accommodation చూపిస్తామన్నా, డబ్బు డిపాజిటు చేస్తామన్నా, పిల్లలకు సీట్లు దొరకకుండా ఉండే సమయములోనే, schools ను start చేయకపోతే, యిక యీ బాలురకు చదువు రావడము ఎట్లా అని అడుగుచున్నాను. ప్రభుత్వము యీ విషయములో ఎందుకు చర్య తీసుకో కూడదో, నాకు అర్థము కావడము లేదు. కాబట్టి యిప్పటికైనా మించిపోలేదు. అక్కడ ప్రజలు కోరుతున్న ఎనిమిది మిడిల్ స్కూల్సును వెంటనే శాంక్షను చేస్తూ ఉత్తరువులు జారీ చేయవలసిందిగా కోరుతున్నాను.

ఇకపోతే Veterinary College ప్రస్తుతము బాపట్లలో ఏర్పాటు చేశారు. అది అక్కడ ఉండడము తాత్కాలికమని చెప్పారు. తాత్కాలికము- తాత్కాలికమని చెప్పి, వేల కొలది, లక్షలకొలది డబ్బు వ్యయ పరచడము ఏమంత సమంజసము గాదు. ఇక్కడ కర్నూలులో తాత్కాలిక రాజధాని నెలకొల్పుతున్నామని చెప్పి లక్షల కొలది, కోట్ల కొలది డబ్బు వ్యయపరచడమయింది. మరల యిక్కడ నుంచి కాపిటల్ కదిలి పోతున్నది. స్థిరముగా వుండే ప్రదేశములో మరల డబ్బు ఖర్చు చేయవలసిన అవసరము వస్తున్నది. ఈ పశువుల కాలేజీ విషయములో మొదట్లోనే ఎక్కడైనా స్థిరముగా ఉండేటట్లు ఒక్క చోటనే ఏర్పాటు చేస్తే బాగా ఉండి ఉండేది. ఇప్పటికైనా ప్రభుత్వము యీ పరిస్థితిని గుర్తించి డబ్బు వృథాగా వ్యయ పరచకుండా ఎక్కడనో ఒక చోట స్థిరముగా ఉండేటట్లు యీ Veterinary College ను Agricultural Research Station ఉన్నచోటున ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను. అంతే కాని, తాత్కాలికము అని చెప్పి డబ్బు వ్యయ పరచడములో అర్థము లేదు. కాబట్టి ప్రభుత్వము వెంటనే యీ కాలేజీలకు స్థిరముగా ఉండే ప్రదేశములో ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను.

తరువాత రాష్ట్రములో ఉండే హాస్పిటల్సు విషయము చూస్తే, వీటి యొక్క ప్రస్తుత దుస్థితి గవర్నరుగారే ఒప్పుకుంటూ ప్రసంగించారు. కొన్నిచోట్ల లో ఒక పెద్ద M. B. B. S. Doctor ను వేయడమేగాని, ఆయనకు కావలసిన మందులుగాని, surgical side న operations చేయటానికి instruments సప్లయి చేయలేక పోతున్నామని గవర్నరుగారే చెప్పారు. దీని కంతటికి కారణము ధనాభావమేనని అన్నారు. మందులు, instruments సప్లయి కానందువల్ల,

డాక్టరును నియమించి ప్రయోజనమేమి ? ఆయనకు పని లేకుండా ఊరికనే కూర్చొనబెట్టి, జీతాలు, యలవెన్సులు యివ్వడము, staff కు జీతాలు యివ్వడము జరుగుతున్నదని ప్రభుత్వము గుర్తించుతుందని నా అభిప్రాయము. ఉదహరణకు చీపురుపల్లిలో మాంగనీసు industry ని గురించి చెబుతున్నాను. ఆ industry అక్కడ develop కావడము వల్ల floating population ఎక్కువయింది. దినమునకు హాస్పిటలుకు వచ్చే వాళ్ళు సుమారు ఏ మూడు, నాలుగు వందలమందో ఉంటారు. ఆ హాస్పిటలులో ఒక M B B. S Doctor ను వేసినప్పటికినీ, వాళ్లకు తగిన మందులు వగైరాలు సప్లయి చేయకపోతే, డాక్టరును, స్టాఫ్‌ను ఊరికనే కూర్చొన పెట్టవలసివస్తున్నది. ఈ విషయము ప్రభుత్వము గుర్తించి, ఆ డాక్టరుకు కావలసిన మందులు, operation instruments వగైరాలు సప్లయి చేసే యేర్పాటు చేయ వలసిందిగా కోరుతున్నాను. ప్రభుత్వము ధనాభావమువల్ల మందులు వగైరాలు సప్లయి చేయలేదని అంటే, యిక అక్కడ అంత పెద్ద డాక్టరును పెద్ద జీతముతో ఎందుకు ఏర్పాటుచేయాలి ? డాక్టరును వేసే చోట్ల మందులుకూడ సప్లయిచేయాలని అంటున్నాను. లేకపోతే, అక్కడ ఆ ఏర్పాటు అంతా వృధా అని అంటున్నాను.

తరువాత Land Reforms Committee వారు ప్రభుత్వానికి చేసిన సూచనలు చాలా ప్రశంసనీయముగా ఉన్నవని గవర్నరు గారు చెప్పారు ఆ కమిటీ వారి రిపోర్టును, సూచనలు నేను స్వయముగా చూడ లేదుగాని, పేపర్లలో ప్రచురించినవి చూడగా, అవి ఏ మాత్రము మన రాష్ట్రమునకు ఉపయోగపడేవికావు. సమర్థనీయము కూడ కావు. ఆ సూచనలు రద్దు చేయించి, క్రొత్త సూచనలు అవసరము చేయాలి. ప్రస్తుతము మన భారత దేశములో Socialistic Pattern of Society ని ఏర్పాటు చేసుకొంటున్నాము గనుక, అందుకు తగిన Land Reforms మన రాష్ట్రములో నెలకొల్పుకొన అవసరము ఉన్నది. ఆ విధముగా జరిగితే, చాలా సంతోషిస్తాము. కాబట్టి, ప్రస్తుతము ప్రభుత్వానికి అందజేసిన Land Reforms, Committee వారి సూచనలు సరియైనవి కాదు కాబట్టి, అవి బుట్ట దాఖలు చేయడమే మంచిది. ప్రభుత్వము ఆ విధముగా చేస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri R. B RAMAKRISHNA RAJU . Mr Speaker, Sir, at the outset I am inclined to sound a note of personal gratification at the Address delivered by the Governor. You remember, Sir, last time when I

addressed the House on a similar Address by the Governor I moved an amendment that wherever the words 'my Government' occur, they should be changed into 'our Government'. I am also conscious of the fact that the Hon. Ministers strenuously opposed any such change. I am evry much gratified to note Sir, that in the Present address that thing has been carried out.

The Hon. Dr. B. GOPALA REDDI · We tried to put it into action though we opposed it on the floor of the House. (Laughter)

Sri R. B. RAMAKRISHNA RAJU Thank you, Sir I do not know if better wisdom dawned on the Ministers, or, the Governor saw the justice of my contention and advised the Ministers to prepare the speech in the present form. Whatever it is, I wish to congratulate both the Governor and the Ministers appointed by him. I do not call this Government -'his Government'. No doubt the Ministers are appointed by him. I therefore wish to congratulate the Governor and the Ministers for this welcome change in this address. It is not a sentimental objection that I took, Sir. It is a very far-reaching change that I wanted, because it affects the self-respect of this House as well as the self-respect of the Ministers who hold their portfolio not at the sweet will and pleasure of any particular individual but at the sweet will and pleasure of this House They cannot continue in their office a moment longer if we do not want them, however much the Governor may want them to remain. So, Sir, it is very proper that the Government should be called 'our Government' I am glad the Governor also has come down to the opinion that the Government is our Government, including his, ours as well as the whole of country at large

The Hon. Dr. B GOPALA REDDI. When you say 'my district of Chittoor', what does it mean ? ( Laughter )

Sri R. B. RAMAKRISHNA RAJU It means, Sir, the district from which I come. That is all, it does not mean anything more than that. I do not think the Minister means that I own the district. If I say 'my district' it means the district from which I come Similarly I do not think the Ministers are prepared to agree that they take their genesis and their birth from the Governor. If they are prepard to do that I have no objection, let them feel happy over that; but certainly,

Sir, they wil not feel that they are mere creatures of the Governor, but the offspring of the good will of this House I therefore submit that I am very glad that this change has come about and it rebounds to the credit of the whole House and, the country at large

Mr Speaker Sir, I have given notice of three amendments and they all stand in my name The first is about the finances of district boards. I find, Sir the state of district board roads has attracted attention I do not know, whether it is of the Governor or the Government For I finds a statement here

> " In view of the inability of the District Boards in the State to provide adequate funds for the proper maintenance of roads under their control, our Government have ordered the diversion of ten per cent of the provision made in the Budget for the maintenance of State roads for 1956-57 towards maintenance of district board roads."

I am really glad that after all the very deplorable condition in which the district board roads are now has attracted the attention of the Government at long last Speaking for myself, from my district, Sir, I can say, the district board roads in my district are awful. Some of us have been responsible for building some roads, and it is only people who have been responsible to construct roads of very good length When they see how those roads are now in a deplorable condition, they can realise the awfulness of the situation. I made very great efforts to see that the Special Officer, that is, the Collector, takes some interest in roads. Whenever we go and approach him, he simply waves his hand and says simply, "my hands are tied, I am unable to do anything, the Government sits very tight over me, they are not providing adequate funds for the maintenance of these roads, and I can't do anything" I appeal to you, Sir, for you have been in charge of a very big district board, and we know, how these district board roads were maintained, how lakhs and lakhs of rupees were spent every year for their maintenance If roads are allowed to be neglected as at present for a series of years, we can very well imagine what the condition of these roads will be in the course of a few years and we are at a loss to know how Government are going to find the money, or even the district boards are going to find the money to put them in order in the coming years.

Sir, in this connection I will read only an extract from Mr. Vasudevan's report which has been just given to us. I find with reference to the Chittoor District Board, the officer says :—

"The Board failed to keep the expenditure within the limits of its resources in spite of the instructions of the Government (while reviewing the budget of each year) In fact the District Board was able to run the administration only with the aid of the advances and dearness allowance grants sanctioned by Government year after year as indicated below "

And then a little further he says

"Transfer of large amounts from General Account Ordinary to Capital Account There is specific instruction of Government to curtail expenditure drastically and not undertake new schemes involving recurring commitments and not capital expenditure by diversion from General Account."

And then a little further the report says

"As instructed by Government the Board ought to have regulated Capital Expenditure to the amounts of grants sanctioned without necessitating transfer of large amounts to the extent of Rs 6,87,717 from General Account Ordinary to Capital Account especially when the financial position of the district board was very unsatisfactory."

Now, who is respnnsible for this?

The Hon. Dr. B GOPALA REDDI District Board members

Sri R B RAMAKRISHNA RAJU : I am glad, Sir, the Chief Minister is saying, the district board members are responsible.

The Hon Dr, B, GOPALA REDDI District board people.

Sri R, B. RAMAKRISHNA RAJU District board people are not responsible. District board people have elected certain people as representatives and those representatives have mismnaged the affairs of the district board. It is not for me to tell the Chief Minister, who is to be made responsible for this. I would lay the blame at the doors of the Government, for thev have got a proper check over the district boards.

I ask, 'how did you allow this extraordinary expenditure to go on when the district board has no funds? How did you allow the overdraft?" The other day, Sir, when I was attending the meeting of the Public Accounts Committee I put this same question to the depatment concerned What they told me was, that in the accounting that is happening in the treasuries, while there is a credit entry in the ledgers of district board on the one hand, when the amounts are transferred to other treasuries the debit entry is not shown! It is an astounding statement, I cannot believe it In the Government departments, when there is a treasury officer and that too of the status of a Deputy Collector appointed to control the finances of various district boards, to say, that he could only look at the credit and not at the debit side, and simply because there is ten lakhs in the credit side and so went on issuing checks for ten lakhs,ten lakhs and any amount to the extent of ten lakhs - it is a statement which I can never believe At whose door is this blame to be laid? I do lay it at the doors of the Government. If they have not done anything to check this wanton wastage of public funds, I do not know who else is to be held responsible.

The Hon. Dr B. GOPALA REDDI I do not think it is wastage of public funds to open new schools. I do not think there was wastage as they opened institutions beyond their capacity to run.

Sri. R B RAMAKRISHNA RAJU It is clear wastage, Sir. What are you going to do with the roads now? You have transferred six lakhs from general funds to Capital Account, and they have built so many things What about those roads? Is it not wastage? All the moneys spent on these roads, who is going to make up? Even if Government give a grant, is it not a wastage? Now the deficit is 11 lakhs. Who is going to make up this deficit? The other day when I asked the Collector to maintain a road to the length of 24 miles, he had the braziness to write to me to say, "All right get the villagers to contribute half the amount." Just think for a moment what the amount will be to keep a road of 24 miles in good condition! And the Collector wants the villager to contribute! Is it a feasible proposition? What is to become of the finances of the district board which you are now collecting? Why don't you see that a reasonable proportion of the income of the district board is being spent on maintenance of roads? The Collector of Chittoor

tells me that it is only 20,000 rupees that is given to him as maintenance grant for one full year, while the district board is spending three lakhs and odd for the maintenance of district boards roads, What can we do with 20,000 rupees? I therefore say, Sir, that the Government must at least now bestir themselves and see that out of the amount that is being collected as income from district boards a reasonable proportion of amount is set apart for maintenance Otherwise, I am sure, a day will come when the Government will have to come forward and give a chunk from their exchequer Sir, these roads are daily carrying on a lot of bus traffic, besides other traffic. I know almost every day bus drivers are complaining of a spring being broken or a tyre having burst and so many accidents occurring, and yet the roads are allowed to continue to remain in unsafe and deplorable condition. I therefore say, Sir, with all the emphasis at my command that Government must bestir themselves and see that sufficient amount is provided for the maintenance of these roads I won't be sorry if persons responsible for this are surcharged for lakhs and lakhs of rupees that have been overdrawn from Government, for which they have no right If the Government have sanctioned it I am sure—I don't say, Sir, it should be a charge on general revenues, but it should be a charge on the revenues of the particular Minister or Ministers who were responsible for this particular busines

Now Sir, coming to practicalities, the Governor speaks of ten percent of the allotment for the maintenance of State roads to be diverted I don't know what it comes to if the ten per cent is to be distributed over the eleven districts I don't know what each district will get But one thing I can say, it is not enough. I therefore request, Sir, that Government will take note of this fact and see that a proper provision for the maintenance of these disrict board roads is made Not only I, every person who has got something to do with these roads, Mr Kakani Venkataratnam, Mr. Brahmam, will say in what deplorable condition these roads are at present, and they reqire urgent repairs

The Hon. Dr. B GOPALA REDDI What is your policy?

Sri R. B RAMAKRISHNA RAJU The policy is "give more money". Because you allowed these district boards to run into debts like this. You give more money wipe off these deficits and be done with

the bother These eleven lakhs for my district, give as a lump sum grant and wipe off the deficit and allow the district board to run on Otherwise abolish the district boards. My suggestion is, "abolish district boards" and give all the money to the panchayats so far as panchayat areas are concerned, take all the high roads and give them to the Highways Department and run on as best as you can "

Sir, the next amendment of mine is about rural water supply and national water supply and sanitation scheme Sir, we do not know very much about this national watersupply and sanitation scheme But one thing I know, and that is, not much is being done in the village apart from local development schemes where grants are being given for providing wells in particular villages. This national watersupply and sanitation scheme I am told, Sir, refers to about a hundred villages in a unit and these villages are given a special attention The proposal, I understand, is to extend the amenities of the scheme to four more districts Apart from this, I wish that each village wherever it is necessary, is at least given the minimum amenity of a good drinking water well. No doubt local development scheme can do a lot. But the position, so far as my district is concerned, I am sorry to say is, we have got nearly 12 lakhs worth of works on hand, for which Government have been pleased to give only three lakhs. The existing works, I mean, the incomplete works are worth 12 lakhs including wells and the total amount required is 12 lakhs The Collector told us the other day in the Planning Committee meeting that he has got only three lakhs from Government to meet the cost of completing the incomplete works as well as of taking up new schemes this year. I am unable to see how all these things could be done within three lakhs So far as Planning scheme is concerned, there is not much that is forthcoming this year for my district I only wish to bring to the notice of Government that a number of works heve been taken up, some pits have been dug for ten feet or twelve feet or eighteen feet as the case may be in each case and they are allowed to remain in that condition; and for such works Rs 100 or Rs 200 or Rs. 1,000 as the case may be, has been paid and those works are in urgent need of being finished

I do not know what the Government is going to do. I hear, Sir, so far as that matter is concerned, the speech says that about 28 lakhs of rupees have been provided for completing the works That is what

we find from the speech. That means, Sir, that provision has been made for the existing works. What about the new works that have to be taken up? For instance, wherever the block system is not going to be introduced (it is not going to be introduced in all the blocks), and wherever there are no blocks, it is absolutely necessary that this scheme should continue and if this scheme should continue, new works will come in, because every village thinks, you know Sir, that they will at least get a well and if you are not going to finance the existing unfinished works, I do not know how you are going to provide funds for more. I am only sorry that this speech does not give any comprehensive view about that.

As regards house-sites for Harijans, in Chittoor District, I know Sir, that a number of schemes have been enquired into, everything done, but kept pending for want of money. The Collector told me that he had only a grant of Rs. 20,000/- last year. At that rate, it is not possible to finance all these schemes. I do not know what the Government is going to do about that There are two things for pushing these schemes through. The first is the Collector is made to wait until the acquisition proceedings are started and finished before a site is taken up and given to another man. I know some instances where the villager who owns the land is prepared to give and the Harijans also are prepared to take and construct the buildings, but nothing is done there pending these acquisition proceedings You know Sir that acquisition proceedings take its own time. but wherever it is possible, wherever the villager is prepared to give his land and take the money whenever the Government gives, why not the Department move and see that the land is allotted to them and the money is given to these people whenever it is made available after the acquisition- That is the first thing Another thing is, instead of wasting this money in so many other ways, it is better that adequate provision must be made for the two most urgent things for the Harijans viz., for drinking water supply and house—sites I hope Sir, that with these remarks, our Government will be able to provide more funds for these things Thank you, Sir.

Sri P. RAJAGOPAL NAIDU. అధ్యక్షా ! నిన్న గవర్నరు గారు ఇచ్చినటువంటి అడ్రసును బల పరుస్తున్నాను. గాని అందులో కొన్ని విషయాలను ముఖ్య మంత్రి గారి దృష్టికి తీసుకొని రాతలచు కున్నాను. రైతాంగమునకు సంబంధించి మూడు విషయములు చాలా ప్రధానమైనవి. అవి: (1) పన్నులు; (2) ధరలు;

(3) సంస్కరణలు. ఈ మూడువిషయాలతోను మన ప్రభుత్వ విధానము చాలా మారవలసి ఉన్నది అని నా అభిప్రాయము. ముఖ్యముగా ఈ పన్నుల విషయములో మన ముఖ్య మంత్రిగారి విధానము, దృక్పథము మారనే లేదు. అని నా ఉద్దేశము. ఇంతకు ముందు సర్‌చార్జి బిల్లు వచ్చినపుడు ఒక్క సంవత్సరానికి కాబట్టి ఒప్పు కొనవలెనని చెప్పారు. ఆనాడు ఇది పోతుందనుకున్నాము. ఇప్పుడు మళ్లీ పొడిగిస్తా మంటున్నారు. ఇది మాను కొనవలెనని వారికి విజ్ఞప్తి చేసున్నాను.

ధరల విషయములో కొంత మంది సభ్యులు ధరలు పెరిగిపోతున్నవని అన్నారు. పత్రికలలో కూడా ఈ గోల ఎందుకు వచ్చిందో నాకు అర్థము కావడము లేదు. ప్రభుత్వ పన్నుల విధానము వల్ల తప్పని సరిగా వ్యవసాయ వసువుల ధరలు పెరిగి తీరుతవి. అని, ఈ ఆందోళన ప్రతిపాదించిన వారికి ఎందుకు తెలియలేదో నాకు అర్థము కావడము లేదు. ఈ విషయము వారు ఆలోచించ వలయును. ఇంతకు ముందే డీసెలు ఆయిలు మీద పన్ను వేసినారు. ఆయిలు ఇంజన్ల ధరలు చాలా పెరిగిపోయినవి. నూనెల ఖరీదు ఎక్కువ అయింది. వ్యవసాయ పని ముట్ల ఖరీదులు ఎక్కువ అయినవి. గవర్నరు గారి అడ్రసులో వ్యవసాయ వస్తువుల ధరలు, పంటల ధరలు ఎక్కువ అయినట్లు ఉన్నది గాని, రైతులు కొనవలసిన వస్తువుల విషయమై- ఆయిలు ఇంజన్లు, నూనెల ధరలు ఏవిధముగా పెరిగినవో చెప్పిఉంటే ఈ విధమైన ఆందోళన రావడానికి అవకాశము లేదు. కాబట్టి ఈ ధరల పెరుగుదల ఆందోళన రైతులకు ప్రమాదము తెచ్చి పెట్టేది గాని, ఇంక ఏమీ లేదు.- అని ముఖ్య మంత్రి గారికి తెలియ చేస్తున్నాను. వారు ఆలోచిస్తారని నా నమ్మకము.

సంస్కరణల విషయములో ఈ నాడు 'భూములను పంచవలెను' అని ఎంతమందో ఆందోళన చేస్తున్నా   దీనికి లొంగిపోవటము దురదృష్టకరము. ఆందోళన ఒక సిద్ధాంతాన్ని అనుసరించి సాగుతున్నది. భూములను పంచాలి, తగ్గించాలనే విషయము నేను కూడా అమోదిస్తాను గాని, ఇతర ఆస్తుల మాట ఏమిటి. కాబట్టి సంస్కరణలు అమలు జరిపే ముందు అన్ని ఆదాయాల విషయము ఆలోచించాలి అని ముఖ్య మంత్రి గారికి మనవి చేస్తున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI  అన్నీ ఒక్కమారే చెయ్య మంటారా ?

Sri P RAJAGOPAL NAIDU. పుల్లరి పెంచినారు. చాలా మందికి నష్టముగాఉన్నది. దానివల్ల వచ్చే ఆదాయము రెండులక్షలు. ఎందువల్ల ముఖ్య మంత్రి గారు ఈ రెండులక్షల కోసము ఇంత మందిని బాధ పెడుతున్నారు: ఈ నాడు ఫారెస్టు మంత్రిగారుదాని విషయము ఆలోచించవలెనని కోరుచున్నాను. ఇంతకుముందు ఎస్టేటు ఫారెస్టులను ప్రత్యేక బ్లాకులుగా చేసి, వేలం వేస్తూ ఉండేవారు. కార్వేటునగరు ఎస్టేటు లో ఈనాడు ఇద్దరు ముగ్గురు కంట్రాక్టర్లు మాత్రం వేలం పాడుతున్నారు. పూర్వము వచ్చేడబ్బు ఇప్పుడు రావడములేదు.

ఒక block కు మూడువేల నుంచి 10 వేల ఎకరాల వరకు వుంటుంది దానిలో వున్న యీ miner produce ను గనుక వేలంపెట్టి నట్లయితే మంత్రి గారు అనుకున్న 2 లక్షలు కాదు. కనీసం, 7, 8 లక్షలు ఎక్కువ వస్తుందని అంచనాల మూలకంగా తెలుస్తుంది. ఇది నేను వేసిన అం చ నా కాదు. చిత్తూరు జిల్లాలో ఎంత డబ్బు వస్తుందో దీనిని బట్టి లెక్క వేస్తే తెలుస్తుంది. అందువల్ల పుల్లర విధానాలను మార్చాలి. ముందున్న పుల్లరి వుండాలని నేను కోరుతున్నాను. ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో చిత్తూరుకు ఏమీ చేయబడలేదు. ముఖ్యంగా మాకు కాలేజీ కావాలని మేము కోరినాము. ముఖ్యమంత్రిగారు కాలేజీ కావాలంటే డబ్బు కావాలన్నారు. ఒక వేళ డబ్బు యిస్తేనే కాలేజీ పెట్టాలనే సూత్రము మీద ఆధారపడేటట్లయితే అది వెనుకబడిన జిల్లాలుకు వాల నష్టము. ఒకవేళ కాలేజీని పెట్టలేకపోతే ఇవుడు రాయలసీమలో పాలీటెక్నిక్ ఒకటి పెట్టాలని అంటున్నారు. చిత్తూరులో పాలీటెక్నిక్ పెట్టినట్లయితే అక్కడవున్న వారందరూ సాంకేతిక విద్య నైనా నేర్చుకుని ఏదో ఒక విధంగా దేశానికి ఉపయోగ పడుతారు గనుక తప్పని సరిగా చిత్తూరులో పాలీటెక్నిక్ పెట్టాలని కోరుతున్నాను. Irrigation విషయమై సిద్ధులగండికి 13 వేల రూపాయలు తప్ప యీ సం వ త్స రా ని కి చిత్తూరులో medium projects కుఏమి ఖర్చు పెట్టలేదు, చిత్తూరులో medium projects చాలా వున్నాయి. అక్కడ పెద్ద ప్రాజెక్ట్సు ఏమి లేవు. కాబట్టి యీ సంవత్సరం కనీసం 4, 5 medium projects నైనా ప్రభుత్వం తీసుకోవాలని నేను కోరుచున్నాను. మైనర్ ఇర్రిగేషన్ విషయంలో అవలంభించ బడే procedure కూడా సరిగాలేదు. Estate area లో తెగిపోయిన చెరువులను మరమ్మతు చేయడానికి 2-3 సంవత్సరాలకంటె ఎక్కువ పడుతున్నది, ఉదాహరణకు ఎలరెడ్డి చెరువున్నది. రెండు సంవత్సరములైంది తెగిపోయి. కాని దానిని కట్టడానికి ప్రభుత్వము ఇంతవరకూ

పూనుకోలేదు. ఎందువల్లనో తెలియడము లేదు. ఓవర్‌సీర్ estimate వేస్తా డను కోండి. అది ఇంజనీర్ దగ్గరకు పోతే ఆయన ఒ ప్పు కో వ డ ము లేదు. ఇంజనీర్ గారి దగ్గరనుంచి పోతే సూపరింటెండింగ్ ఇంజనీర్ ఒప్పుకోవడములేదు. ఈ లాగు పైనుంచి క్రిందికి క్రింది నుంచి పైకి తిరుగుతూ వుంటుంది. అసమర్థులుగా వుండిన వారు estimates వేస్తే దానిలో ఏదో ఒక పొరపాటు వుండ వచ్చును. కాని, పైనుంచి క్రిందికీ క్రిందినుంచి పైకీ 7,8 సార్లు తిరుగ వలసిన అవసరమేమున్నది? ఈ breached tanksను ఎందుకు close up చేయడానికి వీలులే కుండా వుందో ప్రభుత్వమువారు తెలుసుకోవాలని కోరుతున్నాను. అంతే కాక Estates లో ముఖ్యంగా procedure చాల అసంతృప్తికరంగా వుంది. ఈ నాడు దసిబందము చెరువులు చాల వున్నాయి. వాండ్లందరూ వీటిని ప్రభుత్వానికి వ్రాసి యిస్తున్నారు. చెరువుల repairs సమగ్రంగా లేవు. Supply channels ను కూడా సరిగా తయారుచేయడం లేదు. చెరువులను రిపేర్స్ ఎలాగుచేయాలో తెలియదు. ఒక వేయి, రెండు వేల రూపాయలు ఖర్చు పెట్టినట్లయితె తూములు repair ఔతాయి. తూములను repair చేయకుండా కట్టమీద మట్టిపోసి నట్లయితే ఎలా నీరును నిల్వజేయ గల్గుతారో కూడ ఆలోచించడములేదు. కాబట్టి మైనర్ ఇర్రిగేషన్ పనతులు ఏర్పాటు చేయడంలో, ముఖ్యంగా జమీందారీ గ్రామాలలో చెరువుల repairs పద్ధతి మార్చకపోయి నట్లయితే ప్రభుత్వము ఖర్చు పెట్టుతున్న డబ్బు వృధా ఔతుందని నా ఉద్దేశం. యీనాడు కో-ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటీలకు ఎరువుల పంపక విధానాన్నియిచ్చి వున్నారు. అది చాల మంచి పద్ధతే. ప్రభుత్వాన్ని అభినందింప వలసి యున్నది. ఐనప్పటికి ఆ ఎరువుల పంపకము యిస్తూ రెండవ పైపున సాధక బాధకాలను విచారించడము లేదు. డబ్బుకట్టి తీసుకునే పద్ధతి కాకుండా, ప్రత్యేకంగా agency basis మీద ఫర్టిలైజర్స్‌ను సప్లై చేయాలని ముఖ్యమంత్రి గారికి ఇంతకు ముందే మనవి చేసి వున్నాము. Rural housing schemes ను పెట్టుతున్నారు. ఇవి ఏమాత్రము కూడా అను కూలంగా లేవు. దీనిని మార్చకపోయి నట్లయితే ఒక scheme కూడా అమలు కాదు, ఇప్పుడు వున్న పరిస్థితులను బట్టి. అంతే కాక దానికి యిచ్చిన డబ్బుకూడా చాల తక్కువ. డబ్బులు హెచ్చు చేయాలి. పైగా స్కీమ్‌ను మార్చాలి. రెండవది అర్బన్ scheme విషయంలో కూడా cement దొరకక పోవడం చాల ఇబ్బంది గా వున్నది. Cement distribution ఇబ్బంది వల్ల local development works చేయడానికి కూడా వీలు కాకుండా వుంది. కాబట్టి cement పంపకములో ప్రభుత్వ

ప్రత్యేకమైన విధానాన్ని అవలంభించాలని నేను కోరుతున్నాను. ఈ urban housing scheme తప్పని సరిగా జయప్రదం కావాలంటే యీ cement ను Co-operative Department కు ప్రత్యేకించాలని నేను విజ్ఞప్తి 'చేస్తున్నాను' శ్రీరామక్రిష్ణరాజుగారు చెప్పారు జిల్లా బోర్డుల గురించి, ఆ విషయమై నేను ప్రత్యేకంగా చెప్ప వలసిన అవసరము లేదు. ఈనాడు బిక్షుక సమస్యను కూడా కొంతవరకు పరిష్కరించ వలసి యున్నది. లెప్పర్లు అందరు వీధులలో తిరుగడంవల్ల యీ కంటేజియస్ డిసీజ్ ఎక్కువగా spread కావడానకి వీలువున్నది. కాబట్టి కనీసం యీ లెప్పర్స్‌ను, అలాగే కంటేజియస్ డిసీజ్‌లు గలవాండ్లను బిక్షుకవృత్తినుంచి మాన్పించి వేసి వారికి ప్రత్యేకసంక్షేమ కేంద్రాలు పెట్టితే బాగుంటుందని నా ఉద్దేశము. అలాగు చేస్తారనికూడా నేను ఆసిస్తున్నాను. పలమనేర్‌లో cattle farm పెట్టినారు. దానిని శ్రీ తిమ్మారెడ్డి గారు పెట్టినారు. ఆయనను అభినందించాలి. ఎందువల్ల నంటే, అక్కడ ప్రత్యేకంగా పుంగనూడి బ్రీడ్ పెట్టినారు. దానిని అభివృద్ధి చేయడానికి దానిని permanent చేయడం అవసరం. ఆలాగు చేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Mr. SPEAKER.— సభ తిరిగి 2-30 గంటలకు సమావేశ మౌతుంది.

The House then rose for lunch.

---

After lunch (2-30 P.M.)

---

Sri V. VISWESWARA RAO. అధ్యక్షా, గవర్నరు గారు చాలా విషయాలు మాట్లాడారు. అందులో ప్రత్యేకించి ప్రభుత్వం ప్రకటించే administration report అంతావారిద్వారా వినడం జరిగింది. కాని ఈనాడు చాలామందిని కలవర పరిచేటటువంటి అనేక పెద్ద సమస్యల విషయంలో ప్రభుత్వం ఏమీ చర్యతీసుకోలేదని చెప్పవలసిన అవసరం ఏర్పడుతుంది. ప్రత్యేకించి వ్యవసాయ సంస్కరణలు కావలెనని, అదే కాంగ్రెసు ప్రణాళికల ఉద్దేశం అని అనేక సందర్భాలలో చెప్పడం కూడ జరిగింది. మంత్రి వర్గంకూడ, గత శాసనసభలో అనేక సార్లు మేము ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చినపుడు, మేము దానిని ప్రవేశ పెట్ట బోతున్నాము; లక్కరాజు సుబ్బారావు గారి రిపోర్టు కొరకు ఎదురుచూస్తున్నాము; నేడో రేపో రాబోతుంది. రాగానే మేము పెద్ద ప్రణాళికలు తయారుచేస్తాం. ఒక బిల్లును కూడా ప్రవేశ

పెట్టుతామని ప్రభుత్వంచెప్పింది. కాని గవర్నరు గారి ఉపన్యాసంలో ఆ విషయాలు ఏమీచెప్పకపోవడం చాల విచారకరమైన విషయం. ఇక కొంతమంది మిత్రులు మాట్లాడుతూ పట్టణాలలో ఉండే ఆస్తుల విషయమై ఎవరు మాట్లాడడం లేదు, ప్రత్యేకించి భూములకు ఎందుకు (ceiling) పరిమితి పెట్టవలసిన అవసరం వచ్చింది అని చెప్పడంకూడ జరుగుతూ వచ్చింది. ఇతరులు ఏమి మాట్లాడినప్పటికికూడ, ఈనాడు వ్యవసాయమంత్రి అయినటువంటి జైన్‌గారు ఈ మధ్య రేడియోలో మాట్లాడుతూ వ్యవసాయ సంస్కరణలు ఎందుకుపెట్టవలెనో చాలా స్పష్టంగా చెప్పినారు. ఒక ప్రక్కన socialistic pattern of society కావలెనని చెప్పే ప్రభుత్వంలో వ్యవసాయ సంస్కరణలు పెట్టకపోతే నూటికి 70మంది రైతాంగం, అంటే-70మంది ప్రజానీకం ఈ socialistic pattern of society కి బయటనే ఉండిపోయ్యే పరిస్థితులు ఏర్పడుతాయని వారు స్పష్టంగా చెప్పారు. భారతదేశం, ఎక్కువగా వ్యవసాయికదేశం. ఈ వ్యవసాయిక దేశంలో ఉండేరైతాంగం అందరికికూడ, ఒకశక్తి కలుగ చేయాలంటే వారియొక్క పరపతి, ఉత్పత్తి శక్తిని అభివృద్ధి చేయవలెను. అంటే ఈనాడు వ్యవసాయిక సంస్కరణలు అవసరం. భూమికి ఒక పరిమితిపెట్టి, ఆపైనఉండే భూమిని తీసుకొని బీద ప్రజానీకానికి పంచి పెట్టవలెనని చాల స్పష్టంగా వారే చెప్పారు. అందులో మనము ఇట్లాచేయకపోతే 70మంది రైతాంగం దీనివెలుపలనేఉండి పోతారు. అందువల్ల వ్యవసాయిక సంస్కరణలు అత్యవసరంగా ప్రవేశపెట్టవలెనని వారు శెలవివ్వడంకూడా జరిగింది. వారు ఇంకా లెక్కలు చెప్పుతూ నూటికి 60మందిగా ఉండే రైతులకు, రైతులయొక్క స్వాధీనంలో 15.5% సాగు అయ్యేభూమి మాత్రమే ఉందని అదే ప్రశ్నలో, రైతులుగా ఉండే భూస్వాముల చేతులలో 100కి 34% ఉందనికూడా శెలవిచ్చారు. ఈ లెక్కలు అన్నీ కూడా నేను ప్రత్యేకంగా సేకరించినవి కావు. జైన్ గారే వారి ఉపన్యాసంలో ఇచ్చినలెక్కలు. ఇవికూడా ఆంధ్ర రాష్ట్రానికి పరిస్థితిని, ఆంధ్ర రాష్ట్రంలో ఇదే రూపంలో ఉందని చెప్పవలసి వస్తుంది. నూటికి 40మందిగా ఉండే వ్యవసాయ కూలీలు ఈ నాడు అనేక రూపాలలో భూములు లేక బాధలు అనుభవిస్తూ ఉంటే వారి విషయం మనం ఏమి పట్టించుకోకుండా, ఈ నాడు ఇటువంటి సంస్కరణలు ప్రవేశపెట్టడానికి పూను కోకుండా, ఏదో ఏదో పట్టణాలలో ఉండే ఆస్తుల విషయంలో ప్రభుత్వం ఏమి తలపెట్టడం లేదుగాని, భూముల విషయమే పదే పదే తలపెట్టడం న్యాయంకాదు, ధర్మంకాదు అని వారుచెప్పుతున్నారు. నేను వారందరిని కోరేది

ఏమంటే ముందు వ్యవసాయ సంస్కరణలు ప్రవేశ పెట్టండి. వాటిపై చర్య తీసుకోండి. వెంటనే దానికి అవసరమైనటువంటి పట్టణాలలో ఉండే ఆస్తుల విషయమైకూడ మీరు ఆలోచించవచ్చును. ఆలోచించవలసిన అవసరంకూడా ఏర్పడుచుంది. అప్పుడే రెంటిని సమన్వయ పరుచ గలుగుతాము గాని, అది చేయలేదని దీనిని, దీనిని చేయలేదని దానిని, వాయిదాలు వేసేకార్యక్రమానికి మాత్రం పూర్తిగా స్వస్తి చెప్పవలసిన అవసరం ఉందని నేను చెబుతున్నాను. అదే విధంగా ఈ ప్రభుత్వం సామాన్యమైన వ్యవసాయ సంస్కరణలు ప్రవేశ పెట్టుటకు కాలయాపనచేస్తూ ఉంది. అంతేకాదు, Land Reforms Committee ఒకరిపోర్టునుకూడా ప్రకటించింది. దీనిని Land Reforms Committee report అని అనాలో లేక vested interests land ను consolidation చేసే రిపోర్టు అని అనాలో తెలియకుండా ఉన్నది. ఆ రిపోర్టులో ఉండే particulars పత్రికలలో చూస్తే నాకు ఆశ్చర్యంవేస్తుంది. ఈవేళ circulate చేశారు. మొత్తం చూడలేదుగాని పత్రికలద్వారా చూచినదానినిబట్టి, ఈ భూస్వాముల ఆస్తులను మాత్రమే జాగ్రత్తగా, కాపాడడానికి మార్గాలు అన్వేషించారు అని చెప్పవలసిన అవసరంఉంది, ఇది 1956లో మాత్రం రిపోర్టు కావలసినది కాదు, అంతక్రితం ఏ 10, 15 సంవత్సరాల క్రిందటనో వచ్చిఉంటే బాగా ఉండేది. ఇంతక్రితం వచ్చిన ప్రభుత్వనివేదికలే చాలా చక్కని సూచనలతో ఉన్నాయని చెప్పవలసిన అవసరం ఏర్పడుతుంది. ఇంకొక విషయం చెప్పాలి. వేలకొలది లంకభూములున్నాయి. ఇవన్నికూడా వందలాది సంవత్సరాలుగా వ్యవసాయ కూలీలకు field labourers co operative society ల ద్వారా సాగుకు ఇచ్చారు. వాండ్లు సాగుచేస్తున్నారు. కాని గతసారి శాసనసభలో ప్రభుత్వవిధానమని ఈ లంకలలో మూడవ వంతు లంకలు తీసుకొని పాట పెట్టుతాము అని చెప్పారు. పాట పెట్టేటప్పుడుకూడ ప్రభుత్వం తరపున మంత్రి గారు వాగ్దానంచేశారు. ఆయాప్రాంతాలలో అక్కడ రైతాంగం దగ్గర ఉండే పశువులకు గ్రాసంలేకుండా బాధపడుతున్నారు. పచ్చిగడ్డికొరకు మాత్రమే వాటిని పాటకు పెట్టుతాము అని, వాటిని పచ్చ గడ్డికే ఉపయోగించవలెనని చెప్పినారు. కాని తర్వాత ఈ మధ్య Government orders చూస్తే ఇవి పచ్చిగడ్డికొరకు కాదు. పాటపెట్టడం మాత్రం జరుగుతుంది. దానిఅర్థం ఇప్పటికే భూములు ఉండే భూస్వాములకు తమక్రింద ఉన్న భూములు చాలవని, తమ భూమిలో కొంత భాగం పశుగ్రాసంకొరకు బీళ్లుగా ఉపయోగించవలసిన అవసరం ఏర్పడుతుందని బాధపడుతున్నారేమో, వాండ్లకు మరొక రూపంలో మరికొంత భూమిని ప్రభుత్వం

వారికే పాటల రూపంలో కట్టపెట్టవలెనని ఆలోచిస్తుందా అని అభిప్రాయ పడవలసి యున్నది. ఒక ప్రక్క భూస్వాముల భూములకు పరిమితిపెట్టి, దానిని తీసుకొని బీదప్రజలకు పంచిపెట్టమని చెప్పుతూ, ప్రభుత్వం తమక్రింద ఉండే లంకభూములను బంజరు భూములను పాట అనే పేరుతో ఆ భూస్వాములకే కట్టపెట్టవలెనని, బహిరంగ బజారులో పాటలద్వారా తలపెట్టుతుందని సందేహించవలసిన అవసరం ఏర్పడుతుంది. కాబట్టి వ్యవసాయ సంస్కరణలు కావలెనని కోరితే మనప్రభుత్వం మాటలలోమాత్రం తెస్తామనిచెప్పి భూస్వాములకు భూమినికట్టిపెట్ట వలెనని మరొక వంక ఆలోచిస్తున్నది. ఈనాడు ఆహార పదార్థముల ధరలు ఎక్కువగా ఉన్నాయి కాని గవర్నరు గారు తమ ఉపన్యాసంలో, సంవత్సరాలతో పోల్చిచెప్పి గత సంవత్సరంకన్నా బాగాపెరిగినాయి గాని, అంత క్రితం సంవత్సరంకన్నా కొంచెం పెరిగిందని చెప్పడంజరిగింది. అయినా ఇది budget సమావేశంలో వారి దృష్టికి తీసుకొనివచ్చాము, వీటిని అరికట్టడానికి ప్రభుత్వం చర్య తీసుకోవాలని కోరుతున్నాము.

ధరలు ఈనాడు పెరిగిపోతున్నవి. కాని వాటిని అరికట్టాలని చర్యలు తీసుకోమంటే ఆనాడు watching అన్నారు. ఈనాడు కూడా watching చేస్తున్నారా అని అనుమానించవలసి ఉన్నది. ఆనాడు 20 రూపాయలు ఉంటే watching అన్నారు. ఈనాడు 25, 26, 27, రూపాయల వరకు ఉన్నది. అది ఎక్కడ పెరిగిపోతుందో మాత్రం అంతు కనబడడంలేదు. సత్వర చర్యలు తీసుకొని, ఒకవేళ ప్రభుత్వం ధరలను ఈ విధంగా అనుమతిస్తే కూడా, బీద ప్రజలకు బియ్యం సప్లయి చేయడానికి చౌక డిపోలను పెట్టాలని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ప్రత్యేకించి ముఖ్య మంత్రిగారు మా కృష్ణా జిల్లాలో కైకలూరు తాలూకాలో అక్కడకువచ్చిన వందలకొలది రైతుకూలీలు ముందుకువచ్చి వారికి కనీసం, ఏ వరదబాధితులకు సౌకర్యములు కలుగచేసినా చేయకపోయినా వెంటనే చౌక డిపోలనుపెట్టి బియ్యమును చౌక ధరలకు సప్లై చేయించవలసినదిగా కోరడం జరిగింది.

The Hon. Dr. B GOPALA REDDI ఈ విషయాన్ని నిర్ణయించి చౌక డిపోలను త్వరలో పెట్టుతున్నాము. గవర్నమెంటు ఆఫ్ ఇండియా వార్ని కూడా మేము కోరినాము. బియ్యం త్వరలోనే ఇస్తున్నారు. తప్పకుండా జరిగిపోతుంది.

Sri V. VISWESWARA RAO మంత్రిగారు ఈప్రకటన చేసినందులకు సంతోషం. కానీ దానిని వెంటనే అమలుపరచమనీ, అవి అందరికీ అందుబాటులో ఉండేటట్లుగా, పూర్వంలాగానే చౌక డిపోలను విస్తృతరూపంలో పెట్టవలసిన అవసరాన్ని వారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. ఇక ప్రభుత్వంయొక్క నడక కూడా చూడవలసిన అవసరం ఉన్నది. కథకలి, భరత నాట్యం మంత్రిగారు చూచారో లేదో తెలియదుగానీ, అప్పుడే మూడు, నాలుగు నెలలు అయింది. Budget సమావేశంలో చర్చలు సాగించాము. డబ్బు కేటాయింపులు కూడా జరిగినవి. ఆ డబ్బుసు జిల్లాలకు కేటాయించినపుడు ప్రభుత్వం తీసుకొన్న వైఖరిని మాత్రం సమర్థించటానికి ఏ విధంగానూ వీలులేని పరిస్థితులలో ఉందని చెప్పక తప్పదు. ప్రత్యేకించి వ్యవసాయ కూలీలకు ఇండ్ల స్థలాలను ఇవ్వాలని ప్రభుత్వం చాలా సందర్భాలలో చెప్పడం జరిగింది. "మేము యిస్తాం. ఇదిగో 10 లక్షల రూపాయలు కేటాయించాం. దాన్ని ఇవ్వటానికి పూనుకొంటున్నాం" అని అన్నారు గత సంవత్సరం. ఆ 10 లక్షల రూపాయలను ఖర్చుకూడా పెట్టాము అన్నారు గత సంవత్సరం బాగానే ఉన్నది ఈ సంవత్సరం గడచిన రెండు లక్షల రూపాయలు మాత్రం కేటాయించింది. ఈ సంవత్సరం మార్చి నెలలో Budget సమావేశంలో అంగీకరించాం. రెండు లక్షల రూపాయలను జిల్లాలవారిగా పంచడానికి నాల్గు మాసాలు అయింది. కానీ 4 మాసాలు అయినప్పటికీ కూడా ఆ రెండు లక్షల రూపాయలను 'పంచిపెట్టుటకు' అని ఆర్డర్సు పంపించలేదు. కానీ జిల్లాలలోని ఆందోళనవల్లనే మీ ప్రభుత్వం తిరిగి తమ విధానాన్ని పునఃపరిశీలించి శాసనమును పరిశీలించుకొనడంవల్ల మరి 4 లక్షలను కేటాయించారు.

ఈ నాలుగు లక్షల రూపాయలుగాని, ఆ రెండు లక్షలుగాని. 6 లక్షల రూపాయలను కేటాయిస్తూ ఇంతవరకు అప్పుడే నాలుగు నెలలు అయినప్పటికీ orders రాలేదు. అనేకచోట్ల అనేక రూపాల్లో ఇవి కావాలని చెప్పుతూ ఈ ప్రభుత్వం తీసుకొందామని నిర్ణయంచేసినవి అనేకం ఉన్నవి. ఇందులో కొన్ని సాగుకు ఉపయోగపడే భూములున్నవి. సాగుచేసినటువంటి భూములుకూడా ఉన్నవి. సాగు కాలం.కూడా వచ్చింది. సాగుకూడా జరుగుతున్నది. కానీ ప్రభుత్వం దాన్ని ఇంతవరకు ఎట్టి చర్యకూడా తీసుకోలేదు. కేటాయించలేదంటే ప్రభుత్వ నడక ఎంత కుంటినడకో: తాబేలు నడకో, చెప్పాల్సి ఉంది. N.E.S. Blocks అని

C.D. Blocks అని మేము వాటి ద్వారా చాలా చేయబోతున్నాం దేశంలో పెద్ద పరిణామాన్నే తీసుకొని రాబోతున్నాం. అని చెప్పుతున్నారు. హరిజన అభివృద్ధికి ధనాన్ని ఏ విధంగా వెచ్చిస్తున్నారో, దానిని ఆ నాటికి ఆనాడు కుంటుపరుస్తూ, ఆ డబ్బును తగ్గించడానికి ఏలా ప్రయత్నిస్తున్నారో, జాతీయ ప్రణాళికా, విస్తరణ ప్రణాళిక కేంద్రాల విషయంలోకూడా ఆలాగే ఉంది. మొట్టమొదట 7½ లక్షల రూపాయలు ఒక్కొక కేంద్రములో ఖర్చు పెడదామన్నారు. 7½ లక్షలు పోయి 7 లక్షలకు దిగింది. దాంట్లో బహుశా ఈ సంవత్సరం అరలక్ష రూపాయలు కోతకోశారు. వచ్చే సంవత్సరం ఏమి చేస్తారో తెలియదు. ఈ ఏడులక్షల రూపాయలు కూడాపోయి దానిని 4 లక్షలకు దింపటం అనేది జరుగుతుంది. కారణం ఏమిటంటే 3 లక్షల రూపాయలు ఏలాగూ అప్పేకాబట్టి మేము ఇవ్వవీలుకాదు. కో-ఆపరేటివ్ సొసైటీస్ ద్వారా మీరు ఏలాగూ అప్పుతీసుకొంటారు కాబట్టి, అందులో 3 లక్షలుపోయి మరల దానిని 4 లక్షలకు దింపటంకూడా జరుగుచున్నది. ఇక C D Blocks విషయం తీసుకొండి. 15 లక్షలు అన్నారు. 15 లక్షల నుంచి అది 12 లక్షలకు పోయినది. దాంట్లో development కార్యక్రమం ఏమన్నాఉందా అంటే అభివృద్ధి కార్యక్రమం సున్న. దాంట్లో బహుశ ఇదివరకు లక్ష రూపాయలుఖర్చు పెట్టిఉంటే development blocksలో 6 వేలకంటే తక్కువే ఖర్చుపెట్టడానికి ప్రభుత్వం పూనుకొంటుందని animal husbandry దాంట్లో ప్రత్యేకించి రైతాంగానికి సేవ చేయాలని రైతులయొక్క అవసరాలను తీర్చాలని చెప్పుతున్నారు. ఈ C.D Blocks లో గాని, N E.S Blocksలో గాని Animal Husbandry విషయంలో, ప్రత్యేకించి, పశుసంపద, పశువైద్యం వాటివిషయంలో పూర్తిగా ఆ కేటాయింపు తొలగించేసినట్లుగా స్థానికంగాకూడా చెప్పడం జరుగుతూంది. ఈ విధంగా చూస్తే ప్రభుత్వం ఇక పైన ఈ కేటాయించిన డబ్బుకైనా ఫైనల్ బడ్జెట్టుగాని అలాట్ మెంటు గానీ వచ్చిందాఅంటే ఇంతవరకు రాలేదు అని ప్రతిబ్లాకులోను, ప్రతికేంద్రంలోను చెప్పడం జరిగింది. కేటాయింపులేమీ రాలేదు కాబట్టి తీర్మానాలనిపుడు పెట్టిమాత్రం లాభంలేదు అని వాటినన్నిటినీ వాయిదా వేయాలనే రూపంలో చర్చలు జరగడం సాగుతోంది. వీటివలన మనప్రభుత్వం ఈ ప్రణాళిక కొరకుగాని లేకపోతే budget విషయంలో కాని ప్రవాహంమాత్రం సాగించి ఒకనెలలో వాటినన్నిటిని కూడా pass చేయించి 9 నెలలు ఆలోచించి- చివరకు వచ్చేటప్పటికి ఒకనెలలో పనిపూర్తిచేయాలని చెపుతూ. లేకపోతే 2 నెలల్లో పనులను పూర్తిచేయాలని చెపుతూ. పూర్తికాలేదు కాబట్టి గ్రాంటులన్నీ lapse అయినాయి కాబట్టి, అవి ఇక వచ్చే సంవత్సరానికి ఉపయోగ

పడవు అనడం జరుగుతూంది. కాబట్టి ఇటువంటి వైఖరి వెంటనే పోవాలని, 4 నెలలు ఎందుకు పట్టాల్సిన అవసరంఉందో నాకు అర్థంకావటంలేదు. దీనిని వెంటనే కేటాయించి అక్కడ ఉన్న అవసరాలను తీర్చాలని నేను కోరుతున్నాను. ఇదే విధంగా Education విషయంలోకూడా ప్రభుత్వం యొక్క Ordersను 3-4 నెలలుగా చూస్తే నిన్న వచ్చిన ఆర్డరు ఈవేళ ఉంటుందా అనే ప్రశ్న ఏర్పడుతుంది. ఆనాటికి ఆనాడు ఆర్డర్సు మారడం, G. O లు అనేక రూపాల్లో మారడం జరుగుటూ వచ్చింది. ఈ సంఖ్య పెరగడం చూస్తే ఈ Orders ఎలా ఉన్నవంటే, నిన్న తప్పిపోయిన వాడు రేపు ప్యాసు అవుతాడు అనేసందేహంలో IV From లో చేరుదామా, III Form లో చేరుదామా V Form లో చేరుదామా అనే సందేహంతో ఉన్న కుర్రవాండ్లనుకూడా చాలామందిని ఎరుగుదును. ఎందుకని? కొన్ని standards ను ఒకనాడు fix చేయడం, ఆ standards ను మళ్లీ క్రమేపీ ప్రజల ఒత్తిడివల్లనో, అధికారుల సూచనల వల్లనో వాటిని ప్రభుత్వం మార్చుకోవడం జరుగుతున్నది. మొట్టమొదట ఒక Order, తరువాత మరొక ఆర్డరు, అసలు మొట్టమొదట ఇచ్చిన ఆర్డరే పూర్తిగా తప్పు, పరీక్షలు అయినతర్వాత standards అనే పేరుతో ఒక కొత్త order ను సృష్టించాల్సిన అవసరం ఏమీలేదు. అకడమిక్ ఇయర్ ప్రారంభంలోనే అటువంటి Order ఇచ్చి ఉంటే విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, స్కూళ్లకు ఎంతో అభివృద్ధిగా ఉండేది కాని ఈవిధంగా చేయక మధ్య మధ్యను Ordersను పంపడంవల్ల సాధకబాధకాలు వచ్చే అవసరంఉంది. నూజి వీడులో అక్కడ ఒక మెకానికల్ సెక్షన్ అని ప్రారంభించారు. IVth form లో mechanical section అని ప్రారంభంచేసి subjectsను open చేశారు.దానికి కావలసిన యంత్రసామగ్రి అంతాకూడావచ్చింది. కానీ ఇంతవరకూడా Buildings తయారు కాలేదని Practical courseను ప్రారంభించరేదు. తండ్రులచేత బాండ్లు వ్రాయించుకొన్నారు. ఈ కుర్రాళ్ళను ఈ స్కూలునుంచి మరొక స్కూలుకు మార్చటానికి వీల్లేదనడం కూడా జరిగింది. ఇంతవరకూ బిల్డింగ్సుపూర్తికాలేదు. యాపచెట్లు, సామాన్లు మాత్రం వచ్చి అక్కడ కూర్చున్నాయి. Building పూర్తికాలేదు అని సాకుచెప్పడం సరిఅయిందికాదు. వెంటనే buildingsను పూర్తిచేయటానిక్కి తగు చర్యలు తీసుకోవాలని, ఇటువంటి విద్యార్థుల శిక్షణ ద్వారా సాంకేతిక విద్యాభివృద్ధి కావాలని కోరుతూ, ఇట్లా చిన్న చిన్నవాట్లలో కాలయాపన చేయటం న్యాయం కాదని మంత్రి వర్గానికి విన్నవిస్తూ ఇంతటితో ముగిస్తున్నాను.

N. SRINIVASA RAO: అధ్యక్షా! నిన్నటి రోజున గవర్నరు గారు సమగ్రమైన Address చేసినారు. ఇందుకు నేనువారిని అభినందిస్తున్నాను. అయితే ఇప్పుడు

మనమిత్రుడు మాట్లాడుతూ ప్రభుత్వం వారు చేసినట్టి orders గాని, బడ్జట్ వ్యవహారము లుగాని, allotments గాని నిలకడలేకుండా రోజురోజుకూ మారిపోతున్నాయని, పరిపాలనా వ్యవహారములు చాలా మందగమనంతో సాగుతున్నాయనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. కాని అవిఅట్లు మారుచుండుట సహజము. ప్రధానమైన అంతర్జాతీయ సూత్రాలు, పతాక చిహ్నములు, మున్నగు ముఖ్యవిషయములే మారుతున్నప్పుడు దేశకాల పరిస్థితులనుబట్టి ఒక్కొక్కప్పుడు పద్ధతులు మారుతూ ఉండడం విధికృతం. 1952వ సం॥ లోకంటె 1956 వ సం॥ వారి జనాభా తక్కువగా వుంది ఇదంతాకూడా సహజమే. ఈనాడు దేశంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద "మేము ఇంత కృషిచేస్తున్నాము, అంతకృషిచేస్తున్నామని మంత్రులు చెపుతున్నారని" విశ్వేశ్వర రావు గారు చెప్పారు. "పంచవర్ష ప్రణాళిక అంటే అది వట్టి ఆర్భాటమే కాని ప్రజల శ్రేయస్సుకు యేమాత్రమూ ఉపకరించదని మొదట మేము అనుకున్నాము. ఇప్పుడు ప్రజా శ్రేయస్సుకు ఉపకరిస్తుందని మేము గుర్తించాము. ఇప్పుడు దానిని మేము పూర్తిగా బలపరుస్తున్నామని విశ్వేశ్వరావు గారి పార్టీ అగ్రనాయకులే చెప్పినారు. ప్రజాహిత కార్యక్రమాలనే- పేరుతో కృష్ణా జిల్లాలో కాల్వతొ్రవ్వటానికి సుందరయ్య గారు, రాజేశ్వరరావు గారు తట్టలుమోసి పనిచేసినప్పుడు ప్రజాక్షేమంఅనే దృష్టిలో అప్పుడు ప్రజలంతా సహకరించినారు. National extension service blocks అనేవి ప్రజాభ్యుదయమునకు ఉపకరిస్తాయి. వెంకటేశ్వరరావు గారు మున్నగు వారంతా తట్టలు మోసినప్పుడు dignity of labour అనో, లేక సుందరయ్య గారి పాలసీఅనో ప్రజలంతా పాల్గొంటే వారు ఇంకా ఎక్కువ స్థానాలను సంపాదించు కొనుటకు అవకాశం వుంటుంది, అంతేకాని ప్రభుత్వాన్ని ఇది బాగాలేదు, అదిబాగా లేదుఅని విమర్శించ కూడదు.

మనం ప్రజలను ఎంతవరకు విశ్వాసంతులను చేశాము ? ఎంతమంది ప్రజల నుండి ఆర్థికసహాయాన్ని శ్రమదానాన్ని తీసుకున్నాము ? వారి శ్రమదానం మీద విశ్వాసం వుంచకపోయి నట్లయితే వచ్చే ఫలితం ఏమిటి ? కేంద్రపార్టీయొక్క తీర్మానంఏమిటి ? మీరు ప్రేమిస్తున్నటువంటి విదేశాలలోని అగ్రనాయకులు మన దేశం వచ్చి ఏమిచెప్పారు ? మున్నగు విషయాలను జ్ఞాపకం చేసుకొని నడమకొన్నట్లయితే ప్రజాసహకారాన్ని పొందుటకు అవకాశం వుంటుంది. ప్రజలదగ్గరనుండి 10 రు॥ లు తెచ్చినట్లయితే ఒక 10 రు॥ లు ప్రభుత్వం ఇస్తుందని వెంకట్రావు గారు చెబుతున్నారు. మనం ప్రజల సహాయసహకారాలను ఎక్కువగా పొందగల్గితేనే

పరిశ్రమల విషయంలో అభివృద్ధి చెందుటకు అవకాశముంటుంది. పై విషయముల నన్నింటినీ విడిచిపెట్టి ప్రభుత్వం విధానంలో లోపాలను యెంచుతూ, మందకొడిగా సాగుతోందా లేదా అని దృష్టిలో పెట్టుకొని పనిచేస్తే మనం ప్రారంభించినపని మంద కొడిగానే సాగుతుంది,

అట్లా జరిగినట్లయితే ఆగస్టు విప్లవం జరిగిన తరువాత పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలన్నిటిలోనూ పారిశ్రామిక నియంతృత్వ స్థాపన జరగవలసి యున్నది. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం అట్లా జరగవలసినదే. కాని జరగలేదు. ఒక పనిసక్రమంగా నెరవేరాలంటే మన కృషిఎంత వరకూ వుండాలి? ప్రజాసహకారం ఎంతకావాలి? అనే విషయం గమనించాలి, ప్రభుత్వ యంత్రాంగంలో ఉన్నటువంటి వారితో మాకు ఎట్టి అభిప్రాయభేదములూ లేవు. దానిని గురించి విశ్వేశ్వరరావు గారి పార్టీవారు ఉపయోగించిన పదజాలంకంటె constructiveగా, వారు బుర్రకథలలో చెబితే, మేము శిరికథలు హరికథల రూపంగానూ, వారు గేయాలలో పాడితే మేము దండకాల రూపంలోనూ చెబుతున్నాము.

అన్ని పార్టీలవారు జాగ్రత్తగా ఆలోచించవలసిన ప్రధానమైన చేనేత పరిశ్రమను గురించి సభవారికి తెలియజేస్తున్నాను. చేనేత పరిశ్రమను అభివృద్ధి చేయుటకు కొంత సెస్సు ఫండును నిర్ణయించి, మంచిచరఖాలను యేర్పాటు చేస్తున్నందుకు ప్రభుత్వం వారిని అభినందిస్తున్నాను, దానికి ప్రత్యేకంగా Inspectors ను నియమించి చేనేత మగ్గాలకు registration వ్యవహారాలు చేయిస్తున్నారు. కల్లుగీత పనివారికి తీపికల్లు తయారు చేయుటకు అనుమతి ఇచ్చి వారికష్టాలను తీర్చినారు. ఉద్యోగాల విషయంలోను, భూములవిషయంలోను కొంతభాగం వారికి కేటాయించినారు.

ఇందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. సంవత్సరంలో 9 మాసాలు పని లేకుండాపోయే వ్యవసాయ కూలీలనుగురించి యేయే పార్టీల వారు యేయేప్రణాళికల నుదృష్టిలో పెట్టుకొని కృషిచేస్తున్నారు? అసలు దేశంలో వున్న భూమిఎంత? ఎన్ని ఎకరాలకు ceiling నిర్ణయించాలి? ఏప్రాంతంలో ఎంతవరకు wages నిర్ణయించాలి? అనే విషయమై ఏపార్టీవారుకూడా ఆలోచించుట లేదు, పార్టీ నిర్మాణం కొరకు, organisation కొరకు, కవులకు (శ్రీరంగం శ్రీనివాసరావు వంటి కవులకు)

ఖర్చుపెడుతున్నారేకాని, వ్యవసాయ కూలీరంగాన్ని అభివృద్ధి చేయడానికై అందులో సగంధనం కూడా ఖర్చుచేయుటలేదు. కోతలసమయంలోనూ ఊడ్పుల సమయంలోనూ కూలీల దగ్గరనుండి డబ్బు వసూలుచేసినట్టి పార్టీవారు కూలీల అభివృద్ధికై కృషిచేయ లేదని నేను సవాలుచేసి చెప్పగలను. ఇతరదేశాలలోని అనేక పార్టీలవారికి కూడా ఈ విషయంలో సానుభూతి గలవారున్నారు. వారంతయుకూడా "దధిఘృత పాయసాన్నములు ధైర్యముగా భుజియించి" చల్లటి నీడలో కూర్చుని socialistic pattern of society ని గూర్చి పత్రికలలోనో, సిద్ధాంత పుస్తకములలోనో చదివి అనికొంటేము మన స్థాపన అనిగాని, వేర class re action అని గాని అనుకుంటూ వుంటారు. సంవత్సరంలో 9 మాసముు నిర్వ్యాపారంలో వుండే వ్యవసాయకూలీలగురించి మనం ఏమిచేయాలి అని ఆలోచించుట లేదు సామాన్య ప్రజానీకానికి అతీతు అర్థిక శాసనంచే ని మనస్థలు శాస్త్రిపెట్టగాని ఇప్పుడాలోచిస్తేయితే మనం చేస్తున్నకృషివాలా స్వల్పమైనదని తెలుస్తుంది. గంజి నాగేశ్వ వారు పెద్ద ఉపన్యాసముల నివ్వగలరే కాని కూలీల కష్టాలను తీర్చువారు లేరు. ఇప్పు నాయి కూలీలలో సంబంధంగల అన్ని పార్టీల అగ్రనాయకులుకూడా పాలేరులకీయ వలసిన ధాన్యంబు పిచ్చుకుంచాలతో ఇచ్చు వారియొక్క బిడ్డలుగా జన్మించడం వల్లి నో, వారి జీవితాన్ని అర్థంచేసు కోలేని కారణం చేతనోగాని, వారి కష్టాలనుగూర్చి మాట్లాడేవారు లేరు Ceiling విధానం ప్రవేశపెట్టినప్పటికీకూడ వ్యవసాయకూలీలకు జరిగే లాభము తక్కువని నా అభిప్రాయం.

వ్యవసాయకూలీలకు wages నిర్ణయించినప్పటికీ వారి సమస్యపరిష్కారం కాదు. ఎందువల్లనంటే కొన్ని ప్రాంతాలలోని వారికి సం॥లో 2, 3 నెలలకంటే ఎక్కువ పనిఉండదు. నిర్ణయింపబడిన wages ప్రకారం ఆ 2, 3 నెలలు పుచ్చుకుంటే, పని దొరకని మిగిలిన 9 నెలలు వారిసంగతి ఏమిటి? మన శాసనసభ్యులంతా కల్లుగీత మానేసినవారి విషయం, వస్త్రోత్పత్తి చేసేవారి విషయంకంటే మనం బ్రతుకుటకు ముఖ్యావసరమైన (అన్నమును) ఆహారధాన్యమును ఉత్పత్తిచేసే కూలీల విషయమును శ్రద్ధగా ఆలోచించినట్లయితే మన గోపాలరెడ్డి గారు ఆశించిన స్వర్ణయుగం సిద్ధి స్తుంది, లేకపోతే ఆ ఆశయం నెరవేరడం కష్టం. ఆహారపదార్థాన్ని ఉత్పత్తి చేయ డానికి గాని, వస్త్రోత్పత్తి చేయడానికిగాని, చెప్పులుకుట్టేవారు గాని, చేనేత, కల్లుగీత వారు గాని యించుమించు నూటికి 70, 80 మంది షెడ్యూలు తరగతికి చెందిన వారే ఉన్నారని మనవి చేస్తున్నాను. వీరందరికి పెన్షనుఫండు నిర్ణయించమని నేను ముఖ్య

మంత్రిగారిని అడగదలచుకున్నాను. వృత్తులు పోయిన వారందరికి కొంతపెన్షన్ ఫండు నిర్ణయించి వృత్తులు చెస్తున్నప్పుడు వచ్చే నష్టాన్ని భర్తీచేయడానికి ఆంధ్ర ప్రభుత్వంనుంచో, కేంద్ర ప్రభుత్వం నుంచో తీసుకు వచ్చి యిస్తున్నారు. సంవత్సరములో 9 మాసములు వృత్తిలేని వారి సంగతి శ్రద్ధగా ఆలోచించ వలసియున్నది. ఇప్పుడు సినిమాలు ఎక్కువగుటవలన వంశపారంపర్యంగా బొమ్మలాటలు, వీధి భాగవతములు ఆడేవారు వారివ్యాపారాలకు విలువపోయి ఆవృత్తులను వదలుకున్నారు. శతవార్షికోత్సవములంటూ జరుపుతూ, ఎరేలంగి వంటి నటుడినో చూడ గల్గిన ప్రజలు నాటకాలకు వీధి భాగవతములకు ఎందుకు వెడలారు? అందుచేత Surabhi families dance చేసేవారు, గంగిరెద్దుల వారు, అనేకమంది తమ వృత్తులను కోల్పోయారు. ఇటువంటి వారందరికి పెన్షనుఫండు యిస్తే బాగుంటుందేమో ఆలోచించాలని కోరుచున్నాను. ఇదంతా ఒక Administrative report గా గాని, లేక అమలు జరిపే పంచవర్ష ప్రణాళికనంతను యిందులో యిరికించుటం సాధ్యంకాదు అట్లా చేసినట్లయితే ఆ printing చేయించడానికి ప్రభుత్వానికి డబ్బు ఖర్చు. ఈనాడు దేశంలో peaceful means of socialism కు socialistic pattern of society కి అడ్డం లేకుండా ఒక విధంగా సోషలిజంను చేరుకొన్నాము. చేరుకున్న తరువాత కూడా పాత పద్ధతులనే దృష్టిలో పెట్టుకొని లోపాలను ఎంచుతూ వుండడం న్యాయంకాదు.

National reconstruction work విషయమై ఈనాడు సోవియట్ రష్యా దేశంలో ఏమి జరుగుతున్నదో చూడండి. విప్లవం వచ్చిన తరువాత దేశంలో ఉన్నటువంటి రైతాంగముగాని ప్రజానీకంగాని, అందరుకూడా "ఇది నాదేశము" అని ఎంతో కష్టించి శ్రమపడితేనే ఇప్పుడు ఆ దేశంలో అధికోత్పత్తి జరిగింది. అధికోత్పత్తి జరిగినప్పుడే దేశంలో ఉన్నటువంటి ఆహార కరువు వగైరాలు తీరుతవి. అలా కాకుండా ఎవరికివారు మడికట్టుకొని, ట్రాటిస్కీ ముఠావారు ఒకప్రక్క, లెనినిస్టులు ఒకప్రక్క, స్టాలినిస్టులు ఇంకోప్రక్క—— అనార్కిస్టులు ఇంకోప్రక్క—— కూర్చున్నట్లయితే ఈ నాడు సోవియట్ రష్యా భవిష్యత్తు అట్లా ఉండేదికాదని మనవిచేస్తున్నాను. ఇవ్వాళ కమ్యూనిష్టులు కూడా కొండ్రపాటి పట్టాభిరామయ్య ముఠాకావచ్చు, చండ్ర రాజేశ్వరావు ముఠాకావచ్చు, లేక మరేముఠా అయిన కావచ్చు. సహకారం ఇవ్వకుంటే పనులు జరగవు. దీనిని Speaker గారి దృష్టిలోకి, మిగతాసభ్యుల దృష్టిలోకి ఎందుకు తీసుకువస్తున్నానంటే "వికృతివిరా మిడతంభొట్లు" అన్నట్లు పౌర పాటువ మా పేదవాళ్లంతా వారి కేకలకు, వారి స్లోగన్‌లకు ఆకర్షింపబడి వారి

చేతులలో పడిపోయారు ఇప్పుడు శ్రమదానం చెయ్యవలసినవాళ్లు వాళ్లే. వీధిలో దేవాలయం కట్టాలంటే, బావి కట్టాలంటే "మనమేమి చెయ్యక్కరలేదు; ఎవరికోసం చేస్తుంది ప్రభుత్వం? చేసి తీరాల్సిందే. ఆర్థిక మంత్రిగారైనటువంటి గోపాలరెడ్డి ఎందుకు చేయరు?" అని సామాన్యంగా కష్టించే కార్మికుని దగ్గరనుంచి ఉపన్యాసాలు ప్రారంభిస్తే ప్రభుత్వానికి, జాతికి కావలసినటువంటి సహకారం చాల సన్నగిల్లిపోయేటటువంటి పరిస్థితి వస్తుంది. కనుక, అట్లాంటి స్థితి రాకుండా నిర్మాణాత్మకమైన సూచనలు చేస్తూ పంచవర్ష ప్రణాళికను రావడానికి ఏర్పాటు చేయవలసిందని కోరుతున్నాను. ఈనాడు మన దేశంలో ఉన్న లంకలు, బంజర్లు పంపకాల విషయంలో సమగ్రమైనటువంటి ఏర్పాటు చేయాలని మరొకసారి మనవిచేస్తున్నాను. వ్యవసాయ కూలీలయొక్క స్థితినిగురించి ఎక్కువ నిర్మాణాత్మకమైన సూచనలు చేయవలసి ఉంది. వ్యవసాయ కూలీలను విభాగించినట్లయితే చెప్పులుకుట్టేవారుగా కొంతమంది, బట్టలు నేసేవారుగా కొంతమంది, రాట్నాలు త్రిప్పేవారుగా కొంతమంది కేటాయింపబడుతారు. ఈ విధంగా అనేక రకరకాల చేతివృత్తులను కొన్ని మాసాలుగా ఏర్పాటు చేయడానికి సావకాశం కలిగినటువంటి స్థితిలో మన దేశంలోని వ్యవసాయకూలీలు ఉన్నారు. కాబట్టి పంచవర్ష ప్రణాళికలో గాని, ప్రజా సంఘాలు ద్వారాగాని, ఇంకా ఇతరత్రాగాని సహకార పద్ధతిపైనే వారికి కావలసినటువంటి సహకారం మనం చేసినట్లయితే దేశంలో land పై pressure తగ్గుతుంది, ఉత్పత్తి అధికము అవుతుంది. జాతీయ ఆదాయము హెచ్చుతుంది. గోపాలకృష్ణయ్యగారు కోరినట్లు folk dances మొదలైన వాటికి గోపాలరెడ్డిగారు liberal గా డబ్బు ఇవ్వడానికి వీలు ఉండదు. అలాంటి అవకాశం కల్పించడానికి సోదర సభ్యులందరూ సహకారం చేసినపుడే ఇది విజయవంతం అవుతుంది. ఈ సావకాశం కల్పించినందుకు Speaker గారికి నా నమస్కారములు.

Sri P NARASIMHAPPA RAO : అధ్యక్షా! నిన్నటిదినము గవర్నరుగారు ఇచ్చినటువంటి Address మీద నేను కొద్దిగా మాట్లాడ దలచుకొన్నాను. వేమారెడ్డిగారు దానిని బలపరచాము అని చెప్పారు. నాకు బలపరచడానికి సంతృప్తిగా లేదు. అతిక్రమించడానికి వీలులేదు. అందుచేత మధ్యరకంగా మాట్లాడ దలచుకొన్నాను.

ముందు Local Development Works గురించి కొద్దిగా చెప్పదలచుకొన్నాను. Local Development Works కు గాను ఇచ్చినటువంటి గ్రాంట్లు ఏ ఏ జిల్లాలకు

ఇచ్చారు ? ఏ ఏ జిల్లాలలో ఎంతెంత work జరిగిందో తెలుసుకోవలసిందని ముఖ్య మంత్రిగారికి మనవిచేస్తున్నాను. మాటలలోమాత్రం శ్రీకాకుళం జిల్లా వెనుకపడిందని చెపుతారు. శ్రీకాకుళం జిల్లాలో ఒక గ్రామంనుంచి ఒక గ్రామానికి రహదారి సౌకర్యాలులేక ప్రజలు నానా ఇబ్బందులు పడుతున్నారు. శ్రీకాకుళం జిల్లాలోని ప్రజలు ఏ ఏ ఇబ్బందులు పడుతున్నారో, వెనుకపడిన జిల్లాలకు ఏరకంగా గ్రాంట్లు ఇచ్చారో పరిశీలించవలసిందని మీకు మనవిచేస్తున్నాను. ఎందుచేతనంటే ఎప్పుడూ కృష్ణా, గుంటూరు, రాయలసీమ ప్రాంతాలలోనే రోడ్లువేయడం జరుగుతోందేగాని విశాఖపట్టణం మొదలుకొని ఆపైనవేయడం జరగలేదని మనవిచేస్తున్నాను. వంశధారా ప్రాజెక్టు కడతామంటున్నారు. దానివల్ల మన Speaker గారి తాలూకాలో చాల ఉపయోగము ఉన్నదని నిన్న గవర్నరుగారు చెప్పారు దానివల్ల ఏవో 2,3 తాలూకాల వాళ్లు సంతోషిస్తున్నారేగాని, శ్రీకాకుళం జిల్లా ప్రజలందరు సంతోషిస్తున్నారని చెప్పడానికి అవకాశంలేదు. శ్రీకాకుళం జిల్లాలో, పురాతనంనుంచి, ఉందే East India Company వారు foundation వేసినటువంటి నందివాడ ప్రాజెక్టు వేయడానికి ఈపరికి కూడా అవకాశంలేకుండా పోతోంది. దానికి ఎంతో సొమ్ము అవసరములేదు, దానివల్ల చీపురిపల్లి తాలూకా, పాలకొండ తాలూకాల్లో లక్ష ఎకరాలు సాగుకావడానికి సిద్ధంగా ఉన్నాయి. East India Company వారు వేసిన పునాదులు ఇప్పటికీ ఉన్నాయి. ఎన్నో సార్లు investigate చేశారు. Sanction చేశారు. మళ్లా అట్లా కాదని, శ్రీకాకుళం తాలూకాలో నారాయణపురం ఆనికట్టు కట్టారు. అదేమంటే పాలకొండ తాలూకాలో కట్టాముకదా అనిచెవుతారు. దీనివల్ల పాలకొండతాలూకాలో ఒక ఎకరం కూడా భూమి సాగుకావడానికి అవకాశం లేదు. సాగు అంతా కూడా శ్రీకాకుళం, చీపురుపల్లి తాలూకాలలో కావలసినదే. నందికొండ ప్రాజెక్టు కట్టినందువల్ల గుంటూరు జిల్లాలోని ఒకప్రక్కవారు సంతోషిస్తున్నారు. మధ్య ఉన్నవాళ్ళు సంతోషిస్తున్నారా? ఒకరు కడుపునిండా తింటూ ఉంటే రెండవవాళ్ళు ఊసురోమని ఏడుస్తారు. కాబట్టి వాళ్ళకికూడా కొద్దో గొప్పో సదుపాయాలు చేయాలని నా ఉద్దేశ్యము. అన్ని పదవులు మంత్రిగారి చేతిలోనే ఉన్నాయి గనుక హైదరాబాద్ వెళ్ళకముందే medium projects కు foundation వేసి కొంత token grant ఇచ్చి- కొంతవరకు పని ప్రారంభిస్తారని ఆశిస్తున్నాను.

జిల్లాబోర్డుల గురించి చెబుతాను. ఏవిధంగా మంత్రిగారు portfolio పుచ్చుకొన్నారోగాని ఇంతవరకు ఎక్కడా కూడా ఒక్క పని ఆయనచేత్తో చేసినట్లు

వినలేదు. Election జరపడం ఆయన చేత కాదు. జరపలేరని కూడా నేను మనవి చేస్తున్నాను. జిల్లాబోర్డులు Special Officer చేతి క్రిందకు వచ్చి ఎంతోకాలము అయింది. ఈ నరికి కూడా మా ప్రాంతంలో కొన్ని schools లో head-masters ను గాని, masters ను గాని వేయడానికి అవకాశం లేకుండా పోయింది. ఎందుచేత నంటే అన్ని అధికారాలు జిల్లాబోర్డులకు ఇచ్చారు. వరదలనే చూస్తారా? Schools నే చూస్తారా? ఎన్ని పనులని చేస్తారు? Election పెట్టడానికి ఇష్టం లేకపోతే, అందులో పూర్తిగ సహకారం వస్తుందో రాదోనని ఉద్దేశం ఉంటే, ఇంకో Special Officerను వేసి అతనిచేత పనిచేయించండి. ఇంతవరకు కూడా schools కు head-mastersను వెయ్యకపోతే పిల్లలకు ఏమి చదువు వస్తుంది? తరువాత పిల్లలకు education లేదని చెప్పడం జరుగుతోంది. అన్ని పనులు ఒక్క కలెక్టరు పైననే పెట్టడం ఎందుకు? P A ఉన్నాడంటారు. ఎందుకా P A.? ఇదివరకు budget meeting లో M. L. A లు అందరు కలసి P. A. చేసే టటువంటి పనుల ఎలా ఉన్నాయో చెప్పినా ఇంతవరకు కూడా ఆ P. A ను transfer చేసేందుకు అవకాశం లేకుండా పోయింది. దీనిని బట్టి చూస్తే P. A. చేసినటువంటి పనులలో మంత్రిగారు కూడా include అయినారని అనుకోవడానికి అవకాశం కనిపిస్తోంది. జిల్లాబోర్డులు రోడ్లు లేక చచ్చిపోతుంటే, school master లకు జీతాలులేక అవస్థ పడుతుంటే, 1,25,000 రూపాయలు ఇచ్చి tender లేకుండా furniture తీసుకొచ్చి పెట్టారు. దీనిని అంతా ఎవరు estimate చేశారు? ఆతాలూకా Engineer estimate చేయాలి. చేయించారా లేదా అని అడుగుతున్నాను. అసలు procedure అదేనా? 10 సంవత్సరాలు గోపాలరెడ్డి మంత్రిగా ఉన్నారు. ఆమోస్తరు administration ఎప్పుడైనా చేశారా? పంచాయతీబోర్డులకు elections పెట్టారు. ఇన్ని elections జరిపారని గవర్నరు గారు చెప్పారు. 290 writs వేశారు. చట్టానికి amendment పెట్టకుంటే ఇన్ని writs వేయవలసిన అవసరం ఉండదు. ఈ writs వల్ల ప్రజలకు గవర్నమెంటుకు ఎంతో డబ్బు నష్టం అవుతుంది. ప్రభుత్వం Inspector-General of Local Boards కు power ఇచ్చారు. ఆయన ఇంకొకరికి, వారు మరొకరికి ఈ విధంగా అధికారదత్తం చేయడం జరుగుతూ ఉన్నది. ఇలా చేయడంవల్ల కేసులలో ఓడిపోతున్నారు. అందువల్ల హైకోర్టులకు పోతున్నారు. ఇందువల్ల చాలా డబ్బు నష్టం అవుతున్నది. కాబట్టి అధికారం ఒకరిచేతులలోనే ఉంచుకొని శాసనమును సక్రమంగా అమలు చేయించాలని కోరుతున్నాను.

తనమీద ఆధారపడి ఉన్నపనిని ఇతర అధికారులకు ఒప్పచెప్పకూడదు. సమర్థత కలిగి పనిచేయాలి. ఒక Special Officer ను transfer చేసే విషయం గురించి 20 మంది M. L. A. లు మార్చినెలలో చెపితే ఇంతవరకు చేయడానికి అవకాశం లేకుండా పోయింది. ఈ విధంగా ఉంటే మంత్రిత్వము ఎలా చేయగలుగుతారు?

ఇక రోడ్ల విషయం ఉన్నది. District Boards administration Special Officer చేతికి వచ్చింది లగాయతు 1000 రూపాయలు పెట్టి ఒక రోడ్డునూ కూడ బాగుచేయడం మేము చూడలేదు. మా శ్రీకాకుళం జిల్లాకు 7 లక్షల రూపాయలు గ్రాంటు ఇచ్చారన్నారు. ఆ 7 లక్షల రూపాయలను furniture మొదలైనవాటిక్రింద ఖర్చు పెట్టారేగాని, ఉన్నరోడ్లన్ని పాడైపోయి వేలకు వేలు ఖర్చుకావడానికి అవకాశం కన్పిస్తున్న వాట క్రింద ఏ మాత్రము ఖర్చుచేయలేదు

District Boards కు elections అయినా పెట్టండి. లేదా మీ policy అయిన మార్చుకొని, District Boards ను తీసివేసి వాటిని పంచాయితీ బోర్డులకు అప్పజెప్పండి. లేక District Planning Committees కు అప్పజెప్పండి. అంతే కాని, అనవసరంగా డబ్బుఅంతా వీళ్లకు ఇలా తగలబెట్టడమెందుకని మనవి చేస్తున్నాను.

ఇక భూసంస్కరణల గురించి ఒక విషయము చెప్పవలసి యుంటుంది.

బూరుగుచెట్టుకై భూలోకకీరంబు
కోరి యాశించిన తీరువైె ॥

అన్నట్లు. బూరుగు చెట్టేమో ఎంతో లావుగా ఉంటుంది. 'ఈ చెట్టు చూస్తే ఇంత లావుగా ఉంది. దీని పువ్వు ఎంతో అందంగా ఉంది. ఇక దీనిలోని పండు ఎంత అందంగా ఉంటుందోనని' ఒక చిలుక చూపెట్టుకొని కూర్చున్నట్లు, రాష్ట్రములో ఉన్న ప్రజలు ఈ లక్కరాజు సుబ్బారావుగారి కమిటీ రిపోర్టు వచ్చింది. మాకు ఏమిటో జరుగుతుందని ఆశలో చూపెట్టుకు కూర్చున్నారు. కాని అది తిన వలసివచ్చేటప్పటికి సరిగా ఆ పువ్వులోని దూది పేలిపోయి బయటికి ఎగిరిపోయినట్లు, ఈ బిల్లు వచ్చేసరికి, ఇన్నాళ్లు ఎంతో శ్రమపడి వారు ఆ రిపోర్టు వ్రాస్తే, ఆ దూదివలె ఇదికూడా పూ అంటూ గాలికి ఎగిరిపోయింది. ఆ రిపోర్టు అలా కనిపిస్తుంది. దానివల్ల ప్రజలకు

ఏమి ఉపయోగములేక పోయింది. ప్రభుత్వము ఏదో ఒక నిర్ణయము చేయాలంటే. వారికి సమర్థతలేదా? మన ప్రక్కనున్న హైదరాబాదు రాష్ట్రము చేసిందికదా? అదే విధముగా ఒరిస్సా రాష్ట్రము కూడ చేసింది కదా? కనుక మీరు ఏమి నిర్ణయము చేయదలచుకొన్నారో ఆ విధముగా చేయండి. ఎంతో ఆశపెట్టుకొని రైతులు మొదలగువారంతా పూర్తిగా తగవులాటలకు దిగారు. భూమి అంతా మాకు వస్తుంది అని ఎంతో ఆశపడుతున్నారుగాని, ఏమి రావడంలేదు. ఒక కుటుంబములోనే ఇద్దరు అన్న దమ్ములు ఉంటే, ఒకడు పట్టణములో ఇళ్లు కట్టుకొన్నాడు; ఇంకొకడు భూమి కొనుక్కొన్నాడు. ఇళ్లు కట్టుకొన్నవాడేమో బాగా రాబట్టుకొంటున్నాడు. భూమి కొన్నవాడు- తనకేదో వస్తుందని మాపెట్టుకొన్నాడు. కాని ఈ బిల్లును ప్రభుత్వము ఒక రూపములోకి తీసుకువస్తేనేగాని, లేకపోతే- అది నిరాశ అయిపోతుంది. ప్రభుత్వము ఎంతవరకు ఈ బిల్లు settle చేయకుండా ఉంటారో, అంతవరకు రాష్ట్రంలో ఇటువంటి తగాదాలు ఏర్పడడానికి అవకాశముంటుంది. ఈ మధ్యన రెండు మాసాల క్రిందట విశాఖపట్టణం జిల్లాలో ఒక గ్రామంలో ఒక కుటుంబంలో 5 మందిని- ఒక గర్భిణీస్త్రీ తోసహా- భార్యా బిడ్డలనందరినీ- ఈ తగాదాల మూలకంగా చావగొట్టేశారు. కనుక ప్రభుత్వము ఏదో ఒకటి తేల్చివేసినప్పుడే ప్రజలకు ఈ నిరాశ పోతుంది. కాని అంతవరకు పోదు. ఉదాహరణకు Elementary Education తీసుకోండి. Retire అయిన teachers ను 60 ఏళ్ల వయస్సువరకు appoint చేస్తామని చెప్పారు. అంటే, qualified hands లేనప్పుడు వేస్తామని advertise చేశారనుకోండి. దీనివల్ల ఏమి జరుగుతుంది? ప్రతి retire అయిన ముసలివాడు, ఏ M. L. A నో, లేక District Board member నో, మరెవ్వరినో పట్టుకొని ఉద్యోగంకొరకు ఆశిస్తూ ఉంటాడు. కాని ప్రభుత్వము definite గా ఇటువంటి వారిని వేయము అని ఉత్తరువు చేసినట్లైతే, ఈ విధంగా రెండవవాడు ఆశించడు. అదేవిధంగానే ప్రభుత్వము ఈ విషయంలోకూడ ఏదో ఒక నిర్ణయము ఖచ్చితంగా చేస్తే, ప్రజలలో ఉండే ఈ ఆశా నిరాశలు తెగిపోతాయి. మనము హైదరాబాదుకు పోయినతరువాత అక్కడ పరిస్థితి ఎట్లాఉంటుందో చెప్పలేము కాబట్టి అక్కడికి పోకముందే ప్రభుత్వము తమకు ఏవిధంగా ఇష్టంవుందో ఆవిధంగా నిర్ణయంచేసి దీనిని settle చేసివేస్తే మంచిదని తెలియచేస్తున్నాను. 10 ఎకరాలో 50 ఎకరాలో, వంద ఎకరాలో పరిమితిపెట్టి ఎందుకు దీనిని వెంటనే settle చేయ

కూడదని అడుగుతున్నాను. పనప్రక్కన రెండు రాష్ట్రాలు ఈ బిల్లు చేశారుకదా. మనంకూడా ఏదో విధంగా settle చేద్దామని మనవి చేస్తున్నాను.

ఇక prohibition గురించి చెప్పవలసివస్తే, "దీని ఉద్దేశమేమో మంచిదే" ఇది గాంధీగారి ఉద్దేశము. నేనుకూడ దీనిని అమలు చేయాలని చెప్పాను. కాని ఇప్పుడు చెప్పను. అమెరికాలో ఇది 8 సంవత్సరాలు పెట్టబడింది. కాని failure అయిపోయింది, కనుక, తీసివేశారు. ఇప్పుడు మన ప్రభుత్వానికి డబ్బులేదు, డబ్బు రాబట్టవలసిన అవసరమెంతైనా ఉన్నది. ఈ prohibition అనేది ఉండడం వల్ల, దీనికి సంబంధించిన ఆఫీసర్లు వేలకొలది పుచ్చుకొంటున్నారు. వారికి వచ్చేది జీతము వంద రూపాయలైతే, రెండువేలవరకు సంపాదించుకొంటున్నారు. Open గా అడిగి పుచ్చుకొంటారు. కనుక, ముఖ్యంగా మనకు డబ్బు అవసరమైనప్పుడు దీనివల్ల వచ్చే 4, 5 కొట్ల రాబడి తీసుకొని ఇంకోవిధంగా ఉపయోగకరమైన పనులు చేయవచ్చు. అమెరికాలో ఏమి జరిగిందో తెలుసుకొన్నాముగదా! మన policy ప్రకారమే అక్కడ 8 సంవత్సరములు prohibition పెట్టారు. కాని fail అయిపోయిందని తెలుసుకొని తీసివేశారు. అదేవిధంగా ఇక్కడకూడ ఇది fail అయినట్లు అందరము చూస్తున్నాము, అది ఎప్పటికీ వద్దని నేనుచెప్పను. అది సవ్యంగా నడిచినప్పుడు నడిపించండిగాని, అది fail అయినప్పుడు మనకు దానివలన నష్టము తప్పితే మరేమి ప్రయోజనం లేదు. మీఇంట్లోనే- మీపిల్లలే దొంగతనం చేస్తూఉంటె, ఎంతవరకని కాపలా కాస్తారు! మీ ఉద్యోగస్తులే దొంగతనము చేస్తూంటే, ఎంతకని కాస్తారు? ప్రతిచోట ఈ ఉద్యోగస్తులు మామూళ్లు పుచ్చుకొంటున్నారు. Police వారికి స్వాధీనం చేసినతరువాత ఇది మరీ హెచ్చుఅవుతూంది. వాళ్లు కూడ త్రాగివచ్చి, హా! హా! అంటూ త్రాగినవాళ్లను పట్టుకుంటారు. ఈ త్రాగినవాడు వచ్చి ఆ త్రాగినవానిని పట్టుకుంటాడు. కనుక, ఇది ఎటూ failure అయింది. Failure అయినప్పుడు, దీనివలన అనవసరంగా మనకు నష్టం కలుగుతున్నప్పుడు దీనిని తీసివేయవలసిందని మనవి చేస్తున్నాను.

ఇక భూమి శిస్తుగురించి కొంత మనవి చేస్తున్నాను. ఇప్పటికి election అయి రమారమి $1\frac{1}{2}$ సంవత్సరం అయింది. $1\frac{1}{2}$ సంవత్సరములో అప్పుడే అర్ధరూపాయి వేశారు. నేను 1950 లో కాంగ్రెసులో ఉన్నాను. అప్పుడు election జరిగింది కాని, నేను రాలేదు. ఇప్పుడు ఏదో బయటపడి వచ్చాను. ఏదో మీదయవల్ల,

ఇతరుల దయవల్ల 1962 వరకు ఉండవచ్చునని ఆశిస్తున్నాము. కాని, మళ్ళీ election వస్తేమట్టుకు- మేము వస్తామని ఆశలేదు. ఎందుకంటె, ఇప్పటికే 0-8-0 వేశారు. ఈ విధంగా రైతుమీద రోజురోజూ వేస్తూఉంటె, ఏవిధంగా రాగలము. ప్రభుత్వానికి ఎప్పుడూ రైతే కన్పడుతున్నాడు గాని ఇంకెవరు కన్పడకుండా ఉన్నారు. ఈ సందర్భంలో ఒకవిషయము మనవిచేస్తున్నాను. మీరు పన్నులు వేయకూడదని నేను చెప్పడంలేదు వేయవచ్చు. కాని, అందరిని ఒకేవిధంగా చూడండని నాప్రార్థన. ఒకరైతుమీదే వేయవద్దండి విశాఖపట్నంలో కొల్లూరు వెంకటరత్నం చెట్టి అని ఒకతను ఉన్నాడు. అతను hospital దగ్గర 30 ఇళ్లు కట్టాడు. వాటివలన నెలకు 12 వేల రూపాయలు అద్దెవస్తుంది కాని. అతని తమ్ముడి విషయం చూడండి. అతనికి భూమిఉంది కాని ఆభూమివల్ల అతనికి ఏమి ప్రయోజనం లేకపోయింది. ఆ అగ్రహారమంతా సున్నఅయిపోయింది ఈ విధంగా- ఇళ్లు కట్టువాడికి, భూమి ఉన్నవాడికి ఎంతబేధము కన్పిస్తున్నదో గమనించవలసిందని కోరుతున్నాను. కనుక, మీరు రాబట్టాలంటె అన్నివిధాలా, అందరివద్ద రాబట్టండి- ఒకటే విధంగా రాబట్టండని మనవిచేస్తున్నాను. ఇప్పుడు మంత్రులు పర్యటన చేసే విషయంలో, ఒక్కొక్కరు ఒక్కొక్కచోటికి 4, 5 సార్లుకూడా వెళ్లుతున్నారు. పర్యటన చేసినప్పుడు. అక్కడ ఉన్న ప్రజల అందరి పరిస్థితులు దృష్టిలో పెట్టుకొని ఆ విధంగా చేయండని మనవి చేస్తున్నాను. పార్టీలో ఉన్నంతవరకు, కాంగ్రెస్‌పార్టీ అనో మరో పార్టీ అనో చెప్పవచ్చు; కాని, ప్రజలలోకి వచ్చినప్పుడు మాత్రం అందరిని ఒకేవిధంగా చూడవలసిందని; అందరి తాలూకు areas లోను tour చేసి ప్రజల పరిస్థితులు గమనించవలసిందని మనవిచేస్తూ, ఇంతటితో విరమిస్తున్నాను.

Sri Ch S R V P MURTY RAJU అధ్యక్షా' గౌరవనీయ గవర్నరు గారి ఉపన్యాసాన్ని నేను బలపరుస్తున్నాను కాని, ఇప్పుడు జరుగుతున్నటువంటి కొల్లేరు ప్రజల గోడు గురించి కూడా, ఎంత మాత్రము యిందులో లేకపోవడం చాలా విచారకరంగా ఉన్నది ఆ కష్టాలన్నీ అనుభవించే వారికి గాని తెలియవు. ఈ నాడు కొల్లేరులో వచ్చేటటువంటి ముంపులవల్ల ఏర్పడిన పరిస్థితిని చెప్పనలవి కాదు. బుడమేరు, రాములేరు, కమ్మిలేరు, ఇంకా కొల్లేరులో పడేటటువంటివి చాలా ఉన్నాయి అంతేకాదు. ఇంకా- local గా ఉన్నటువంటి మురుగు కాలువలు ఉన్నాయి. ఇవేవి కూడ మరమ్మతు చేయకపోవడంవల్ల నైతేనేమి, వీటి ముంపు నివారణకు చర్యలు తీసుకోకపోవడంవల్లనైతేనేమి వచ్చే నష్టము చెప్పడానికి వీలు

చేసుంటా పోతున్నది. ఈ మధ్యన ముఖ్య మంత్రిగారు కూడ ఆ ప్రాంతంలో సంచారము చేశారు. మన విశ్వేశ్వరరావుగారు కూడ కొంతవరకు ఉన్నారు. ఇంకా చాలామంది ప్రజలు కూడా ఆ ప్రాంతాలు చూడడం జరిగింది. నా చిన్నతనం నుంచి చూస్తూ ఉన్నాను—ఈ పరిస్థితులు. ఈ ప్రాంతాలు అందరు చూడడం మాత్రమే జరుగుతున్నవి గాని, అసలులో ఏమి జరగడం లేదు. నేను శాసనసభ్యుడు కాక ముందు ఇటువంటి విషయాలు చెప్పుకోడానికి బాగుండేవి గాని, ఇప్పుడు, శాసన సభ్యుడైన తరువాత ఇవి చెప్పుకోవాలంటే నాకే సిగ్గుగా ఉన్నది ఎందుచేతనంటే ఎవరు ఏది చూచినప్పటికినీ, ఏదో చేస్తామని చెప్పడమే జరుగుతుందిగాని, జరిగింది మాత్రము ఏమిలేదు. ఆఖరుకు డెల్టాలో పోయ్యేటటువంటి మురుగు కాలవలు కూడ సరిగా మరమ్మతులు చేయకపోవడంవల్ల, ఈవేళ లక్షలకొలది నష్టము సంభవిస్తున్నది. కనీసం ఈ కొల్లేరు ప్రజలకు ప్రభుత్వము remission కూడ యివ్వడంలేదని చెప్పడానికి విచారిస్తున్నాను. బాగా పండిన చోట్లనే remission యివ్వడం జరుగుతున్నది. ఎందుచేతనంటే డెల్టాలో పెద్ద రైతులు కరణాలకు, మునసబులకు డబ్బు ఇచ్చుకొని, వాళ్ళచేత- బాగా పండినప్పటికీ- పండలేదని వ్రాయించుకోవడంవల్ల వారికి, రెండవ పంటకు అదనంగా ఇవ్వడం జరుగుతున్నది కాని కొల్లేరు ముంపుకు గురి అయిన ప్రజలు ఆ విధంగా లంచాలు యిచ్చుకోలేరు వాళ్ళు పెట్టిన పెట్టుబడే రానటువంటి పరిస్థితులలో బాధపడేటప్పుడు- లంచాలు ఇచ్చి చేసుకోవడం చాలా కష్టము

అటువంటి పరిస్థితులలో నిజంగా ముంపు వచ్చిన వారికి పంట యేమీ లేకుండా పోతుంది. ముంపు లేకుండా ఉండేవారికి, రెండవ పంటకు నీరు యివ్వటం- అన్ని నీటి facilities వారికే యివ్వడంవల్ల, అక్కడ ఉండే వారికి రెండవ పంటకు నీరులేక పంట ఎండిపోవటం, ప్ర థ మ పం ట నీటిలో మునిగిపోవడం జరిగింది. అప్పుడు ప్రజల సంగతి ఏమవుతున్నదంటే, కొల్లేటిలో ఉన్న భూము లన్నీ అమ్ముకోవలసి వస్తున్నది. అమ్ముకుందామంటే కొనే వారుండరు. ఈ పరిస్థితులలో కొల్లేటి ముంపు భూములుగల యజమానులకు ఏ విధంగా సదుపాయము చేయాలనేది ప్రభుత్వం సంపూర్ణంగా ఆలోచించవలసిన విషయము. ఈ విషయములో ప్రభుత్వం కొంత ఉదాసీనముతో చూడకపోతే- యికముందు కొల్లేటి ప్రజలు యీ విధముగా సహిపించే వారిని హర్షించి ఊరుకోరు అని నేను గట్టిగా చెప్పగలను.

ఇకముందు కొల్లేటికి కావలసిన స్కీములు అన్నీ చాలామటుకు investigate చేస్తామని ప్రభుత్వం చెబుతూ వస్తున్నది.- అది, ఉప్పుటేరు widening చేయడము, deepening చేయడము అని అన్నారు, ఇది మొదటి విషయము. ఇకపోతే రెండవది, బుడమేరు విషయములో diversion, dams projects, reservoir వగైరాలు కట్టించడము. ఇవికాక. యింకా అక్కడ ఉన్నవాటికి reservoir కట్టించడము అవసరము ఉన్నది ఈ సందర్భములో ఒక్క కొల్లేటికి ముంపు రాకుండా చేయడము అనే పద్ధతి కాదు అక్కడకు వచ్చిన నీటిని బైటకు వెళ్ళగొట్టటానికి ఉప్పుటేరును widen చేయడం ఒకటి. ఇంకను ఆ ప్రాంతములో ఉన్న 48 గ్రామాలవారు చేపలు పట్టుకునే వృత్తివల్ల జీవించుచున్నారు. కేవలము చేపలు పట్టుకునే జాతివారే కాకుండా, అక్కడ నివసిస్తున్న హరిజనులుకూడ యిదే వృత్తివల్ల బ్రతుకుచున్నారు ఈ రోజున వారి పరిస్థితి ఎట్లా ఉన్నదంటే, వారికి తిండికిలేక మలమలమాడుతున్నారు. పొరుగూరు వెళ్లాలంటే అంతా నీటిలో మునగడమువల్ల మార్గాలు లేవు. తాడిచెట్ల దోనెలు ఉన్నవి వాటిమీద ప్రయాణము చేయవలసి యున్నది. అంతే కాకుండా చేపలు పట్టుకుందామంటే- వారికి వీలులేకుండా ఉన్నది కారణముఏమిటంటే, కొనుక్కోటానికి డబ్బులేదు వలలు కొనుక్కోటానికి అంతకంటే డబ్బులేదు. అలాంటి పరిస్థితులలో వారిగతి ఏమికావలి? ఇలాంటి పరిస్థితులలో ప్రభుత్వం మాత్రము ఏమి చేయాలో ఆలోచించక పోవడం నాకు అర్థముకావడములేదు ఈనాడు తిండి, బట్ట లేకుండా బాధపడే కుటుంబాలు కష్టపడుతూ ఉంటే, యీ విషయము గవర్నరు ప్రసంగములో బొత్తిగా ఉదహరించబడలేదు. అయితే దానికి ఒకటే కారణము అయి ఉండవచ్చును. అది డబ్బు విషయమనుకుంటాను. సరే' డబ్బు విషయమే అయితే, యిది ఎప్పుడూ ఉన్న యిబ్బందే ఏదో సామెత చెప్పినట్లు, ఎప్పుడూ చచ్చేవాడికి ఏడ్చేది ఎవరు అన్నట్లు, ప్రభుత్వానికిఎప్పుడూ డబ్బు లేదు, లేదు, అంటే, యిక వీరి పరిస్థితి బాగుపడేది ఎప్పుడు ? ఎప్పుడైనా ఒకసారి యిబ్బందివస్తే, ఆ యిబ్బంది తీర్చటానికి ప్రభుత్వము ముందుకు వచ్చి సహాయము చేయమని కోరుతున్నాను. ఇక ప్రతి సంవత్సరము యీ కొల్లేటి ముంపు వగైరాల వల్ల బాధపడుతూ ఉంటే, ప్రభుత్వమును సహాయముచేయమని కోరడము సబబు కాదా' దీనికి ఏదో ఒక నివారణోపాయము ఆలోచించవలసి యున్నది. నిజానికి వారి దుస్థితి చూడటానికి, ప్రజా ప్రతినిధులుగా వున్న మేము వారిని చూడడమునకు, గూడ దుర్భరముగా ఉంటుంది కాబట్టి యీ యిబ్బంది పర్మనెంటుగా తీర్చివేయాలంటే, మురుగు వచ్చినప్పుడు, దానిని బైటకు

వెళ్లగొట్టడమునకు పద్ధతి ప్రభుత్వం ఆలోచించాల్సిన అవసరము ఉన్నది. దీనికి ఒకపద్ధతి నేను చెప్పదలచుకున్నాను. అక్కడ కొల్లేరులో సుమారు 48 గ్రామాలు ఉన్నవి. ఆగ్రామాలలో అక్కడక్కడ సముద్రముకంటె పల్లంగా ఉన్నప్రదేశాలు ఉన్నవి. అన్నిటికంటె లోతుగాఉన్న ప్రదేశాన్ని సుమారు 50 చదరపు మైళ్లవరకూ చూచి, దానిని ఒక చెరువుగా ఏర్పాటుచేసి, అక్కడ ఉండే మురుగుకాలువలు అన్నింటినీ ఆ చెరువు లోనికి పంపించినట్లైతే, లెవెల్ ఎక్కువై ఇప్పుడు ఆమురుగు కాలువల నీరు అంతా ఆ చెరువులోనికి తీసుకొనిపోయి వదిలినట్లైతే యీ నీరుఅంతా సుళువుగా పోతుంది. ఇదంతా చేయటానికి ప్రభుత్వానికి ఏరెండుమూడు కోట్లో అవుతుంది. అంతకంటె ఎక్కువకాదు ఈ విధముగాచేస్తే ప్రభుత్వానికి వచ్చే ఆదాయము ఎక్కువగా రావటానికి వీలుంటుంది. కొల్లేటిలో unsurveyed భూమి సుమారు ఒకలక్ష యకరాలు సాగుచేయగలది వున్నది. ఈ భూములు ఎకరం ఒకటింటికి నూరు రూపాయలచొప్పున వాయిదాలమీద తీర్చుకునేటటుగా పేద వాళ్లకు యిస్తే మాకేమి అభ్యంతరం లేదు. సంవత్సరానికి పది, ఇరవై రూపాయల ప్రకారము ప్రభుత్వానికి యివ్వగలుగుతారు. దానిమీద సుమారు ఒక కోటిరూపాయలైన— కనీస ఆదాయము— రావటానికి అవకాశము ఉన్నది. సుమారు యాభై మైళ్లుగల నీటి ప్రాంతములో చేపలు పెంచినట్లైతే, సుమారు సంవత్సరానికి నలభై లక్షలు ఆదాయము వస్తుంది. ఇలాంటి స్కీము ప్రభుత్వము ఎందుకు take up చేయకూడదో అర్థము కావడములేదు. ఈమధ్య ముఖ్యమంత్రిగారు ఆప్రాంతాలకు పర్యటనకు వచ్చినప్పుడు, అది రాత్రివేళ అయినందున, వారితో మాట్లాడటానికి ప్రజలకు అవకాశము లేకపోయింది. అక్కడి ప్రజల బాధలు వారు స్వయముగా తెలుసుకోగలిగేవారు; కాని, సందర్భపడలేదు. ముంపునీరు ఎక్కువైనందున, రాత్రిళ్ళు లైట్లువేసుకుని, భోజనముకూడా లేకుండా కాపలా కాస్తున్నారు ఆసమయములో వాళ్ళుపడేబాధలు చూస్తే, మనస్సుఎంతో కరిగిపోతుంది. నామటుకు నేనే స్వయముగావెళ్ళి చూచాను. ఆరాత్రికాక మరునటి ఉదయము పడవలోవెళ్ళి చూస్తే వాళ్లు తెల్లవార్లు గట్లు తెగిపోకుండా కాపలా కాచినారట. ఆ రాత్రిగడచింది మరునాడు ఉదయము ఎప్పుడో గట్లు తెగిపోయినవట. నన్ను చూడగానే నాతో "ఏమండీ రాజుగారు ! రాత్రిఅంతా కాపలా కాచామండి, భోజనము చేయలేదండి, ఒకముద్ద, అరముద్ద తిని కాపలాకాచామండి, పొద్దునే గట్లు తెగిపోయినవండి. మేము యీ ముంపును ఎదుర్కొని గట్లు కాపాడుకోలేక పోయామండి. ఇప్పుడు పైరు

అంతా మునిగిపోయిందండి. మాకు పంట దక్కదండి ఊడుపుకూలిఅయినా గిట్టేటట్లు లేదండి. ఇలాగైతే, యిక యీసంవత్సరం పొడుగునా, మాకు తిండి ఎట్లాగండి ? మేము బ్రతికేది ఎట్లాగండి?" అనిమొరపెట్టుకున్నారు. నిజంగా వాళ్ళపరిస్థితి చూస్తే నాకే ఎంతోజాలి అయింది. నేనుమట్టుకు ఏమిచెప్పగలను ? నిజానికి వాళ్ళవద్ద ఓట్లు పుచ్చుకొని, వాళ్ళకు అదిచేస్తాము, యిదిచేస్తాము అని చెప్పి వచ్చి, తీరా, యీలాంటి కష్టములనుండి వాళ్ళను తొలగించలేకపోతున్నాము అంటే. యిక మేము ఆ ప్రాంతాలలో తలఎత్తుకొని తిరగడమునకు వీలులేని పరిస్థితి వచ్చింది. వాళ్ళకు తిండిలేదు, గుడ్డలేదు ఈ విధమైన పరిస్థితి నుంచి వాళ్లను కాపాడకపోతే, నేను ఆప్రాంతములో తిరగటానికి సాధ్యపడడము లేదు. నామటుకు నేను నాఆస్తి, వగైరాలు అన్నీ వదలివేసి వచ్చివేస్తేనైనా, వారికష్టములు చూడకుండా తప్పిపోతుందేమోనని అనుకుంటున్నాను. ఈ ముంపు విషయమేకాదు,— ఈ మధ్య తోకలపల్లి గ్రామములో సుమారు రెండువందల యిళ్లు ఒకేసారి తగులపడిపోయినవి. అందులో ఒక్కరికికూడ నివాసము దొరకలేదు, ఇప్పుడు మునిగిపోయింది. వారికైనా ప్రభుత్వము తగు సహాయము చేయలేకపోయింది. నాఆస్తి అంతా పోయినా సరే, అక్కడ ఒకస్కూలుకు భవనాలు కట్టించడానికి ప్రయత్నించాను. ఈనాడు Local Development Works క్రింద యాభై, అరవై లక్షలు మనము ఖర్చుచేస్తున్నాము. ఇది చేసేబదులు ముందు అక్కడి ప్రజలబాధలు తొలగించినట్లైతే మంచిది. మన ఆస్తులు అన్నీ పోయినాసరే, మనము నాశనము అయినాసరే, ముందు ఆప్రజల బాధలు తొలగించకపోతే, యిక ప్రభుత్వానికి popularity ఎక్కడనుంచి వస్తుంది? నామటుకునేను ఆస్తిని పోగొట్టుకోటానికి, నేను నాశనము కావటానికి సిద్ధముగా ఉన్నాను. నిజానికి వాళ్లను నమ్మించి ఓట్లు తీసుకొని, వారికి సమయము వచ్చినప్పుడు సహాయము చేయకపోతే ప్రయోజనమేమి? నామట్టుకు నేను ఒక్కడిని ఎంత తాపత్రయ పడిననూ, ఏమి అవుతుంది ? నేను పోయినప్పటికీ కూడ, నాఆస్తిఅంతా పోయినప్పటికీ కూడ, నేను నాశనమయినప్పటికికూడా, నేను సిద్ధముగా ఉన్నాను: కాని, ప్రభుత్వం సరియైన సదుపాయాలు ఆప్రజలకుచేసి గౌరవాన్ని కాపాడుతుందని ఆశిస్తున్నాను. తోకలపల్లి గ్రామములో ఒకేసారి రెండువందల యిళ్లు తగులపడిపోయినవి. అదేవిధముగా ఆగడలంక గ్రామములో కూడ ఒకేసారి 300 యిళ్లు తగులబడి పోయినవి. ఆగ్రామములోని ప్రజలందరూ నిరాశ్రితులైరి. వాళ్లకు చివరకు తాటాకు తెచ్చుకునటానికైనా దూరముపెళ్లలేరు. వారికి తాటాకులకు కావలసిన డబ్బు లేదు. ఒకరు ఎవరైనా భూములు ఉన్నవాడు ఉంటే,

ప్రభుత్వము లోన్సు యిస్తామని అంటున్నారు గదా. లోను కావాలని అధికార్ల దగ్గరకు పోతే, మీకు joint patta ఉన్నది కాబట్టి- loan యివ్వటానికి వీలుకాదని చెబు తున్నారు. అందువల్ల ఆ లోను అయినా దొరకడములేదు. ఇలాంటి దుర్భర పరిస్థితులు గ్రామాలు ప్రాంతములో ఉంటున్నప్పుడు యిక వాళ్ళ బ్రతుకడము ఎట్లాగో అర్థము కావడములేదు. వాళ్ళకు కావలసిన స్కీములుఅన్నీ శాంక్షను చేయడము, కావలసిన సిమెంటు సదుపాయములు చేయడము, అవసరమైనప్పుడు తిండికి గింజలు విత్తనాలు సప్లయి చేయడము, ప్రతి సంవత్సరము వచ్చే ముంపు రాకుండా చేయడము, ఇలాంటి సౌకర్యములు అన్నీ చేయవలసిందిగా కోరుతున్నాను. పంటలు పోయినా, కూలిపని అయినా చేసుకుని బ్రతుకుదామని అనుకుంటే, కూలి దొరకదు. పోనీ చేపలుఅయినా పట్టుకొని అమ్ముకొని జీవించుదామంటే, యీ రోజులలో అన్నీ పిల్లచేపలు ఉంటాయట. పిల్లచేపలు పట్టగూడదు అని ఒక శాసనము ఉన్నదట. ఇలాంటి శాసనాలు అన్నీచూస్తే, యిక్కడ Legislature లో వున్న సభ్యులకు మనకే అవి అర్థముకావు. అంతకంటే వాళకు యింకా అర్థముకావు 1953 వ సంవత్సరములో వచ్చిన గోదావరి వరదవల ఆ ప్రాంతములో ఉన్న గ్రామాలుఅన్నీ పోయినవి. అప్పటినుంచి యిప్పటివరకు వాటిని బాగుచేయించలేదు. గ్రామాలలో వున్న ప్రజలు కో-ఆపరేటివ్ సొసైటీలు పెట్టుకోవాలని అంటే, వారికి కావలసిన షేరు ధనము కట్టుకోటానికి డబ్బు కావాలి ప్రభుత్వంవారు భూములు యివ్వాలని Registrar ను Society ని రిజిష్టరు చేయమని అంటే, ఆయన చేయరు సొసైటీ రిజిష్టరు చేయక పోతే, అప్పు తెచ్చుకోటానికి వీలుండదు ఈ విషయములో తగిన ఏర్పాటులు చేయవలసిందిగా కోరుతున్నాను ఆ ప్రాంతపు ప్రజల కష్టాలనుగురించి యింకా చెప్పాలంటే, అనేకములు ఉన్నవి. వారికి కావలసిన సదుపాయములు చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri S. VEMAYYA: అధ్యక్షా! గవర్నరు గారి ఉపన్యాసము మీద అనేక విషయాలు తీసుకునివచ్చి చెప్పారు. అయినప్పటికీ యీదినము వారి భాషణలో కొన్ని విషయాలు ఉదహరించబడలేదు. అవి మంత్రి వర్గము గవర్నరు గారికి అందజేయ లేదని నాభావన. ముఖ్యంగా N G. O.ల విషయము తీసుకుంటే, మనము త్వరలోనే హైదరాబాదుకు పోబోతున్నాము. వారి విషయము గవర్నరు గారి భాషణలో చెప్ప బడియుంటే బాగాఉండేది. ముఖ్యముగా వాళ్ల జీతాల విషయములో ఉన్న తేడాలు,

వాటి సర్దుబాట్ల విషయము చెప్పనేలేదు. ఇక్కడ ఉన్నవారికంటే, అక్కడ హైద్రాబాదులో పనిచేస్తున్న N G O. లకు ఎక్కువగా జీతాలు యిస్తున్నారు. 1953లో మన State N G. O లు మద్రాసునుంచి వచ్చినప్పుడు వాళ్లకు ఒకరకంగా allowances యిచ్చారు. రేపువీళ్లు హైద్రాబాదు వెళ్లేముందు అదే విధముగానైన్నా allowances యివ్వటానికి ప్రభుత్వము వెనుదీయరని నేను అభిప్రాయ పడుతున్నాను

కేంద్ర ప్రభుత్వం ఇస్తున్న డియరునెస్సుఅలవెన్సు లో కొంత భాగము జీతములోకలిపివేసినారు. దానిని గురించి ప్రభుత్వానికి నష్టముఏమీ ఉండదు కాబట్టి డియరునెస్సు అలవెన్సును జీతములో మర్జిచేసి డిస్పారిటీ లేకుండా చెయ్యవలెను. హైద్రాబాదు ఉద్యోగస్థులకు ఒక విధమైన జీతాలు, మనవారికి ఒక విధమైన జీతాలు లేకుండా మనప్రభుత్వం చెయ్యవలెనని కోరుచున్నాను.

నేడు ముఖ్యముగా ధాన్యాల ధరలు ఎక్కువ అగుచున్నవి. వరద దెబ్బతిన్న ప్రాంతాలవారికి చౌకధరల డిపోలు పెడుతామని ముఖ్యమంత్రిగారు అన్నారు. అందుకు వారిని అభినందిస్తున్నాను. ఈ ధరల పెరుగుదల ఒక్కవరద ప్రాంతాలలోనే కాదు మిగతాచోట్లకూడా విపరీతముగా పెరుగుచున్నవి. బియ్యం శేరు 0-10-0 అణాలు 0-11-0 కూడా అమ్ముతున్నారు, మనప్రభుత్వం గవర్నమెంటు స్టాక్సు రిలీజు చేయించి జిల్లాలో, తాలూకా కేంద్రాలలో చౌక డిపోలను పెట్టి ధరలు తగ్గేటట్లు చెయ్యా దానికి వెంటనే చర్యతీసుకొన వలెనని కోరుచున్నాను. గవర్నరు సంభాషణలో కూడా 1953-54 తో పోల్చిచూస్తే ధరలు అంత ఎక్కువ కాదన్నారు కాని యుద్ధపు రోజులతో పోల్చిచూస్తే విపరీతముగా పెరిగినట్లు తెలుస్తుంది. కాబట్టి జిల్లా, తాలూకా కేంద్రాలలో చౌక డిపోలను ఏర్పాటు చెయ్యవలెను. హాస్టల్సు ఉన్నచోట గవర్నమెంటు స్టాక్సునుండి బియ్యము రిలీజు చేసి చౌక ధరలకు హాస్టల్సుకు యివ్వ వలెనని కోరుచున్నాను.

కోఆపరేటివు విషయములో ఇక్కడ కోఆపరేటివు లా కు చాలా అమెండుమెంటులు తీసుకువస్తున్నాము. గాని ఈ సంభాషణలో ఏమీ చెప్పలేదు. Field labour co-operative societies కు fisherman societies లను పెట్టము అంటున్నారు. ఈ సొసైటీలకు చెరువులు, భూములు ఇవ్వడము లేదు కాంపిటీషను తీసుకువస్తున్నారు. సూళ్లూరుపేట తాలూకా వాటంచేడు గ్రామస్థులు 380 ఎకరాలు F. L. C. కి కావలెను అంటే వేలమువేసి పెద్దపెద్ద వ్యక్తులకు ఖాయం చేశారు. తిరిగి వేలంవేస్తే

ప్రభుత్వానికి ఎప్పుడబ్బు వస్తుందని చెప్పినాకూడా ప్రభుత్వం ఖాయం (కన్ఫర్మ్) చేసి నాము అన్నారు. అల్లాగనే సొసైటీలు ఫారంకు కూడా రిజిష్టరుకాకుండా ఆలస్యం జరుగుతూఉంది. దేవస్థానంభూముల లీజు విషయములో ఆదాయం రూ. 5,000/- పైబడి లేనేగాని, డబ్బుముందు ఇస్తేనేగాని ఇవ్వము అనడంన్యాయముగా లేదు. దీనిని గురించి ఆందోళన ప్రజలలో ప్రబలివున్నది. దేవస్థానం భూములకు అడ్వాన్సు పేమెంటు లేకుండా చెయ్యవలెను. ఇతరులకు యిచ్చినట్లుగా లీజు ఆ సంవత్సరములకు యివ్వవలెను ప్రతిసంవత్సరం ఇవ్వడం న్యాయంకాదు అని చెబుతున్నాను. ఇండ్ల స్థలాల విషయములో హరిజనులకు వెనుకబడిన జాతులవారికి Land Acquisition Act సవరణ గురించి ఏమీ చెప్పలేదు House sites విషయములో ఉపన్యాసములో 4 లక్షలు అదనముగా యిచ్చినట్లు చెప్పారు. గాని ఇది ఒకటి రెండు జిల్లాలకుకూడా చాలదు. Land acquisition క్రిందకాకుండా ప్రభుత్వ పోరంబోకులు, గ్రామస్తులకు పట్టాలు ఎందుకు ఇవ్వలేదో నాకు అర్థంకావడంలేదు. నెల్లూరుజిల్లా నరుకూరు గేటున్నూ. రామలింగాపురం గ్రామాలలో గవర్నమెంటు పోరంబోకులను ఇప్పటిలో వెంటనే ప్రభుత్వం ఆర్డర్లు పంపవలెనని మనవి

వ్యవసాయ కూలీలగురించి కొంతమంది సభ్యులు చెప్పారు. వారిలో under employment ఉన్నదన్నారు. Rural Credit Survey report లో దక్షిణ భారతదేశములో ఆదాయము చాలా తక్కువగా ఉన్నదన్నారు. వారి ఆర్థికాభివృద్ధికిగాని ఈ under employment గురించిగాని గవర్నరు ఉపన్యాసములో ఏమీలేదు. Employment exchanges మన రాష్ట్రప్రభుత్వం క్రిందకు వస్తుందంటున్నారు. ఇప్పుడు ఉన్న పరిస్థితులలో ఈ employment exchanges నామకః ఉన్నవేగాని వాటివల్ల ఉపయోగము ఏమీలేదు.

ముఖ్యమంత్రిగారు విద్యామంత్రిగాకూడా ఉన్నారు కాబట్టి aided schools లో గవర్నమెంటు స్కేల్సు ఇస్తారని అనుకున్నారు. రాష్ట్రములోఉన్న స్కూల్సు అన్నీ తీసుకొంటారనుకున్నాము గాని నెల్లూరుజిల్లాలో మాత్రము ప్రభుత్వం తీసుకున్నారు. ఈనాడు జిల్లాబోర్డు స్కేల్సు ఇచ్చేటట్లుగా ఉన్నది అని పబ్లికు అభిప్రాయ పడుతున్నారు. Govt. scales యివ్వకుండ వుండడము న్యాయముకాదు.

The Hon Dr. B. GOPALA REDDI గవర్నమెంటు స్కేల్సు ఇస్తారని ఎవరుచెప్పారు. Labour schools లో కూడా జిల్లాబోర్డు స్కేల్సె ఇవ్వమని తాఖీదులు ఇచ్చాము ఇంతకుముందే.

Sri S VEMAYYA వారుకూడా గవర్నమెంటు స్కేల్సు యిస్తారని అనుకుంటున్నారు. గవర్నమెంటు స్కేల్సు ఇస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను. గవర్నమెంటు స్కూళ్లలో ఒక స్కేల్సు, Labour schools లో ఒక్క స్కేళ్లు, Aided Schools ఒకస్కేళ్లు తారతమ్యములో ప్రస్తుతమున్నవి. ఈ తారతమ్యము లేకుండా చేయడానికి ప్రభుత్వము పూనుకొంటుందా అని నేను ప్రశ్నించుచున్నాను.

ఆ విధానాన్ని అవలంభించితే retrenchment వస్తుంది. దానివల్ల అసంతృప్తి కల్గుతుంది. కాబట్టి అది లోగడవున్నట్లే వుండాలని కోరుతున్నాను. అదికాకుండా విద్యావిధానంలో ఇపుడు యీ ప్రశ్న ప్రత్యుత్తరాల సందర్భములో కూడా పుస్తకాలు లేవని ముఖ్య మంత్రిగారి దృష్టికి వచ్చిందని వారే సెలవిచ్చారు. S. S L. C Text Books రావడము 2 మాసాలు ఆలస్యమైంది. Text Books ఏమీలేవుకాని వాటికి notes, guides వగైరాలు publish చేశారు. Text Books కంటె ముందుకూడా యీ notes అంతా వచ్చి బజార్‌లో sale చేసేవి ఇది ఎంత మాత్రము సబబో మాకు అర్థంకావడం లేదు. Govt దీనిని ఎందుకు prohibit చేయరాదో నాకు తెలియదు అసలు పుస్తకాలు రాకముందరనే యీ notes ఎక్కడ బట్టినా అమ్మబడుతుంది నెల్లూరులోనే 5 రోజుల క్రితము యీ నోట్సును కొన్నారు అసలుపుస్తకాలు లేవన్నారు. ఇది బయట పెట్టకంటే. మాకు తింటా వస్తుంది అని express చేయడం జరిగింది. Text Books రావడానికి ఎందుకు ఆలస్యము జరుగుతుందో అర్థము కావడం లేదు. ఇకమీదట ఇటువంటి ఆలస్యము జరుగకుండా చూడాలని కోరుతున్నాను. S S L C Text Books విషయంలోనే కాకుండా 1st, 2nd ఫారములలోనూ తక్కిన తరగతిలోను Text Books కూడా సరిగా మాకు రావడంలేదని గగ్గోలు పెట్టుతున్నారు. Schools తెరచి రెండు మాసాలైంది. ఇప్పటికి కూడా Text Books సరిగా రావడం లేదు. ఈ ఆలస్యం జరుగకుండా చూడాలని ముఖ్య మంత్రిగారిని కోరుతున్నాను. అంతేకాకుండా ఇప్పుడు ప్రభుత్వం మరొక చట్టాన్ని pass చేసినట్లు వింటున్నాము. Accommodation

విషయంలో seats restrict చేయడంలో కొన్నిచోట్ల accommodation వుండి కూడా పిల్లలను చేర్చుకోకపోవడం సంభవిస్తోంది. ఇంతకు పూర్వము Divisional Inspector కాని D E O కు గాని 2-3 సీట్లు ఎక్కువ చేయడానికి అధికారాలు వుండేవి. ప్రభుత్వం యీ మధ్యన ప్రకటించిన దానినిబట్టి చూస్తే యీ D E O లకు యీ అధికారము లేకుండా Govt యీ అధికారాన్ని పెట్టుకోవడం సబబుగాలేదు. Accommodation లేకుంటే seats restrict చేయడం బాగానే వుంటుంది. కాని accommodation వుంటే seats restrict చేయడం బాగుండదని Govt కు మనవి చేస్తున్నాను. ఈ discretion క్రింద ఉద్యోగులకు యివ్వాలి. ఇకపోతే ముఖ్యంగా అన్నింటిని మించింది వ్యవసాయ సంస్కరణలు. Land reforms Committee వేశారు. ఆ కమిటీని వేయడంలో కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లు కనబడుతుంది. అన్ని రాజకీయ పక్షాలవారు కూడా ఇది నిజంగా Land Reforms Committee చేయవలసిన సూచనలేనా అని ఆశ్చర్యపడుతున్నారు. ఈ సూచనలు నేతి బీరకాయ విధంగా కనబడుతున్నాయి. అందువల్ల యీ కమిటీ యిచ్చిన నివేదిక ప్రకారం చేసినట్లైతే ఇది భూమిలేని పేదరైతులకు వ్యవసాయ కూలీలకు ఎంత మాత్రము ఉపయోగకరంగా లేదు. అది ఉన్నటువంటి భూస్వాములకు లాభదాయకంగా కనబడుతుంది. ఇపుడు గవర్నర్ గారిని మన ప్రభుత్వాన్ని యీ 'Protection of tenants' ordinance pass చేసినందుకు వారిని అభినందిస్తున్నాను. కాని ప్రభుత్వము యీ Protection యిచ్చినాకూడా ఒక్క విషయాన్ని మనవి చేయాలి. ఇప్పుడు బీదరైతులు Govt waste lands ను, Railway lands వగైరాలను సాగుచేసుకుంటున్నారు. వాటిని తీసుకు వేలం పెట్టడం జరుగుతుంది. ఇపుడు నాయుడుపాలెం, కోవూరు, తాలూకాలలో జరిగింది. వారు మే మే లీజ్ యిస్తాము వేలము పెట్టవద్దని మమ్ములను తొలగించవద్దంటే Govt. వారు అటువంటి వాండ్లకు ఎందుకు రక్షణ యివ్వలేదో నాకు అర్థము కావడంలేదు. రైతువారీ గ్రామాలలో రక్షణ యిచ్చినపుడు ప్రభుత్వ భూములను చేసుకొనేవారికి ఎందుకు రక్షణ యివ్వకూడదు? "Biggest land lord in the state" అయినపుడు ముందుగా సాగు చేసుకునే పేదలను భూములనుంచి వెళ్లగొట్టకుండా protection యివ్వాలని నేను మనవి చేస్తున్నాను, మా జిల్లాలో tank-bed lands ను 10 ఏండ్లనుంచి సాగు చేస్తున్నారు, బీదలకు రక్షణ ఇవ్వాలని కోరుచున్నాను. ఆఖరికి యీ పన్నుల విషయంలో water-rate పెంచడము. దీనిని uniform చేయాలని అందులో

చెప్పబడింది దీనివల్ల చిన్న పేదరైతులు చాల affect ఔతారు. కనుక uniform గా పెంచడం బాగులేదని, దానిని వ్యతిరేకిస్తున్నాను. నేను చెప్పిన ముఖ్యమైన విషయములను గవర్నమెంటు carry out చేయాలని చెప్పి సెలవు తీసుకుంటున్నాను.

(At this state Sri S Ranganatha Mudaliar Temporary Chairman occupied the chair)

Sri G NARASIMHA MURTHY అధ్యక్షా: గవర్నర్‌గారి భాషణకు అభినందన తెలియజేసే సందర్భములో కలిగిన అవకాశాన్ని పురస్కరించుకొని వారి ఉపన్యాసములో వున్నటువంటి ముఖ్యమైన విషయాలను ప్రశస్తమైన విషయాలను అభినందిస్తూ అందులోని ఒకటి రెండు విషయాలను ప్రభుత్వ దృష్టికి తీసుకిరావాలను కొంటున్నాను. ముఖ్యంగా వారి ఉపన్యాసంలో అధికాహార ఉత్పత్తికి సంబంధించిన విషయం చాలా ప్రముఖంగా కన్పిస్తూవుంది. అధికాహార ఉత్పత్తికి అత్యంత అవసరమైన పంటలకు ముఖ్యంగా మా గాణీ పంటలకు సంబంధించినంతవరకూ నీటిసప్లై ఎంత ముఖ్యమో drainage facilities (మురికి నీటివసతులు) అంతకంటె చాల ముఖ్యమైన విషయము. కాబట్టి అటువంటి మురికి నీటివసతుల గురించి వారి ఉపన్యాసంలో ఏమీవున్నట్లు కిన్పించదు. ఇపుడు ఆంధ్రదేశమంతటా ఎన్నెన్నో ప్రాజెక్టులు నిర్మాణం చేస్తున్నారు ఆ ప్రాజెక్టులద్వారా లక్షలాది ఎకరాలు సాగుకానున్నది. వాటి మాట అలా వుండగా ఇప్పుడు సాగులో వున్నటువంటి కోస్తా జిల్లాలలో కృష్ణా గోదావరి నదుల క్రింద irrigation కు సంబంధించినంతవరకూ మురుగునీటి వసతులులేక ఏ విధంగా నష్టము కల్గుతుందో అటు ప్రభుత్వాన్ని ఇటు అధికాహారోత్పత్తి చేసే రైతులను వ్యవసాయ కూలీలను అందరినీ బాధించేటటువంటి ప్రధాన సమస్యగావుంది. యీ ప్రాజెక్టుల నిర్మాణముతోబాటు మురికినీటి వసతులకుకూడా ప్రధానమైన స్థానాన్ని యివ్వాలి. ప్రతి సంవత్సరం గోదావరి వరదలవల్లనైతేనేమి, క్రిష్ణా వరదలవల్లనైతేనేమి ఎంతెంత నష్టము కలుగుతుందో మనకు ముఖ్యమంత్రికి మిగిలిన మంత్రులకు తెలుసు. ఈ సందర్భంలో ఎన్నోలక్షల రూపాయలు తాత్కాలిక సహాయం కోసము ప్రభుత్వం వ్యయపర్చవలసి వుంటుందో వారికి తెలియని విషయం కాదు మొన్న 1953 లో వచ్చిన గోదావరి వరదలకుగాను ఎన్నో లక్షల రూపాయలు వ్యయపర్చారు. ప్రతి సంవత్సరంకూడా యీ వరదలురావడం పరిపాటిఅయిపోయింది. ప్రతి సంవత్సరం ఎన్నో లక్షల రూపాయలు తాత్కాలిక సౌకర్యాలకోసము వ్యయపరచే

ఒడుట యీ వరదనీటిని సముద్రానికి శీఘ్రగతిని పంపించే ఏర్పాటులు ప్రభుత్వము చేసినట్లైయితే చాల బాగుంటుంది ముఖ్యమంత్రిగారు ఆవలికివెళ్లి పోయారు. Incharge గా వున్నటువంటి నాగేశ్వరరావుగారు విషయాలు జాగ్రత్తగా వ్రాసుకుంటా రనుకుంటున్నాను ఎందుచేతనంటే ఇది అత్యంత ప్రధానమైన విషయం. ముఖ్యంగా మురుగునీటి వసరులగురించి ఏర్పాటులు చేయకపోతే లక్షలకొలది ఖర్చు చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది 1953వ సంవత్సరములో కట్టలు తెగడమువల్ల కలిగిన నష్టమంతా యీ సంవత్సరం కట్టలు తెగకపోయినాకూడా అంత నష్టము కల్గిందని మనవి చేస్తున్నాను. గ్రామాలలోనుంచి పొలాలలోనుంచి మురుగునీటిని గోదావరికి తీసుకవెళ్లేటటువంటి drains వున్నాయి. అవి చాలాపెద్ద మురుగు కాల్వలు. మా డెల్టా ప్రాంతాలలోనేమి, కాకినాడ తాలూకాలోనైతేనేమి యీమురుగు కాల్వలలో వరదనీరు ప్రవేశించడంవల్ల చాల ప్రమాదము ఏర్పడుతుంది.

నాగేశ్వరరావుగారు ఎప్పుడు శాసన సభకువచ్చినప్పటికి ఇటువంటి అవాంతరాలే జరుగుతున్నాయి. ఆయన రెండుసార్లు వచ్చారు ఒకసారి రాగానే అసెంబ్లీ రద్దు అయిపోయింది ఇప్పుడు ఏదో మళ్లా తాత్కాలికంగా వచ్చిందని నేను సంతోషించి మాట్లాడడం. ఆయన ఉండడం జరిగిందంటే quorum లేకుండా పోయింది అందుచేత ముఖ్యమంత్రిగారు ఇకముందైనా ఇటువంటి విషయాలను జాగ్రత్తగా గమనించవలెనని కోరుతున్నాను ముఖ్యంగా మురుగునీటి వసతులకు సంబంధించినంతవరకు, ఇప్పుడు ఈ సంవ

గోదావరి వరదలవల్ల old Inapuram drain, అమలాపురం drain, పంచ నదీ drain, వాసాలి తిప్ప drain మొదలైన పెద్ద పెద్ద మురుగు కాలవలు గోదావరితో సంబంధం గలిగినవి ఉన్నాయి. ఆ మురుగు కాల్వలగుండా ఈ మురుగు నీరు గోదావరి వారనే ప్రవహించి తాలూకాలో సముద్ర తీరంలో ఉండేటటువంటి అనేక గ్రామాలను ఇందుపల్లి island అనబడే 10, 14 గ్రామాలు. మొత్తం అమలాపురం తాలూకాలోనే దరిదాపు 40 వేల ఎకరాలవరకు కూడ, మునిగి పోయిన క్రిష్ణా జిల్లాలోని కొల్లేరు దగ్గిరా ప్రాంతాలు ఏ విధంగా నష్టపడ్డాయో, అదే విధంగా నష్టపడిపోయి ఉన్నాయి. నిన్నటి 'ఆంధ్ర ప్రభలో' Revenue మంత్రిగారి ప్రకటనను చూచివాగాని. ఈవేళ శాసన సభ ఎదుట Revenue మంత్రిగారు చేసిన ప్రకటనలో గాని గోదావరి వరదలకు సంబంధించి ఒక్క పోలవరం agency ప్రాంతాన్ని గురించి వారి నివేదికలో ఉందిగాని, central delta లో తాలూకాలో గాని, మురుగు

కాలువలగుండా ఇంత హెచ్చు వరదలు వచ్చినటువంటి గోదావరి ముంపువల్ల వరి సస్యాలకు కలిగినటువంటి నష్టాన్ని గమనించినట్లు కనిపించడంలేదు. అందుచేత ముఖ్య మంత్రిగారు ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించి తూర్పు గోదావరి జిల్లాలో కూడ వచ్చిన వరద నష్టంవల్ల పోయిన పొలాలకి తగిన రక్షణ సహాయాలు సర్వత్ర ఏలాచేస్తున్నారో అక్కడ కూడ చేయవలసిందని చెప్పి మనవి చేస్తున్నాను.

ఇక prohibition సంబంధించినంతవరకు ఏదో జాగ్రత్తగా కట్టుదిట్టం చేయ డానికి ప్రయత్నాలు జరుగుతున్నవని గవర్నరుగారి నివేదికలో కనిపిస్తుంది. మన P.N Apparao గారు ఏదో మాట్లాడారు. అంతా లంచాలు పుచ్చుకొంటున్నారని. దానిని గురించి ఇపుడు ఎవరు అంతగా బాధపడడంలేదు

కారణం ఏమంటే అది పరిపాటిగానే ఉంది. ఎక్కడైనా పుచ్చుకోని వాడు ఎవరైనా ఉంటే వారిని గురించి ఆశ్చర్యంగా చూస్తున్నారు తప్ప Prohibition Department లో ఉన్న వ్యవహారాలు, పోలీసువారుగాని మరి ఇతరులుగాని, కొంత మంది దానికి సంబంధించినటువంటి వ్యక్తులుగాని చేస్తున్నటువంటి కార్యకలాపాలలో పెద్ద ఆశ్చర్యం ఏమిలేదు. దానిని గురించి ఇంకా పదే పదే చెప్పడం అవసరంలేదు. తప్పకుండా ప్రభుత్వం ఎప్పుడో దానికి తగినటువంటి సమయంచూచి కట్టుదిట్టం చేస్తారని అనుకొంటున్నాను. ఇక జిల్లా బోర్డుకు సంబంధించినంతవరకు, ఇంత కాలం జిల్లాబోర్డుకు ఎన్నికలు లేకుండగా రేపు డిశంబరులోనైనా ప్రత్యక్ష ఎన్నికల ద్వారా గాని, పరోక్షపు ఎన్నికలద్వారాగాని జిల్లాబోర్డులను పునర్నిర్మాణంచేసి స్థానికంగా ఉండే, అవసరాలకు జిల్లాబోర్డులవల్ల పొందే సౌకర్యాలన్నిటిలోను ఎప్పటి కప్పుడు సవ్యంగా జరిగే ఏర్పాట్లు చేస్తారని నేను అనుకొంటున్నాను. P. N అప్పారావుగారు చెప్పినట్లు ఒక కలెక్టరు ఎన్నెన్నో కార్యక్రమాలు నిర్వహించవలసి యున్నది.

కలెక్టరు ఈ జిల్లాబోర్డును కూడా నిర్వహించడం అసాధ్యం. అందులో ప్రత్యేక శ్రద్ధ చూపడానికి అవకాశాలు ఉండవు. వారికి P. A ఉన్నారు. జిల్లాబోర్డు Education Officer, Health Officer మొదలైనటువంటి ఆఫీసర్లు ఎవరి పనివారు చూస్తుంటారు. అనే దృష్టిలో కలెక్టరు ఉంటారు గనుక, సాధ్యమైనంత త్వరితంగా ప్రత్యక్షపు లేక పరోక్షపు ఎన్నిక ద్వారా జిల్లాబోర్డును డిశంబరు తరువాత పొడిగించకుండా వెంటనే జిల్లాబోర్డులను నిర్మాణము చేయవలసిందని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

Sri SHAIK MOULA SAHEB అధ్యక్షా! గౌరవనీయులగు గవర్న రుగారు ఉపన్యసించిన ఉపన్యాసమును నేను బలపరుస్తూ నాకు తోచిన సందేహాలను ...వాను. ఇప్పుడు కాలమాన పరిస్థితివేరు. పూర్వం ఈ భూమి, ఈ పంటలే ...త్తంమీద నెలకు ఒక వర్షం కురిసేది. కాని దేశమంతా కూడా ఒక స్థాయికాని వర్షాలు రమారమి పది inches తేడాతో ఉండేది. ఈ నాటి కాల పరిస్థితి చూస్తే, చేరిపోట్ట నీళ్లులేక. త్రాగడానికి కూడా మంచి నీళ్ళ లేక మలమల మాడి చస్తూ ఉన్నారు ఈ రోజులలో ఈ గంటవరకు కూడ కొన్ని తాలూకాలలో మితిమీరిన వర్షాలు కురిసి, అక్కడి గ్రామాదులన్ని కొట్టుకుపోయి. ఎన్నో పంటలు నాశనమై. మొత్తంమీద అనేక ఘోరాల పాలైనటువంటి జిల్లాలు కొన్ని ఉన్నాయి. ...ర్షమంతా కూడ ఒకే స్థాయిలో లేకుండా ఒకచోట విపరీతంగా కురియడం, ఒక ...చోట బొత్తిగా లేకుండా పోవడం అనేది చూస్తే, ఇది ప్రభుత్వంలో ఉండేటటువంటి లోపమా, లేక ప్రజలలో శక్తి తగ్గిన లోపమా? ప్రభుత్వం అనేది ఆడిన మాటను నిగ్రహించ జాలనపుడు, ఆ పలుకుబడిలో ఉండే లోపము ప్రజలపైన ప్రాకులాడుతుందా? లేక మాటలు తప్పిన వారిపైన ప్రాకులాడుతుందా! అనే విష యాన్ని ఇపుడు సంజీవయ్యగారు గుర్తిస్తారని నేను మనవిచేస్తున్నాను. రెండోది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఉమ్మడి రాష్ట్రంలో తయారైంది కాబట్టి. అప్పటి నిర్ణయాలలో, ఈ ఆంధ్ర రాష్ట్రం ప్రత్యేకమైన తర్వాత ఆ ప్రణాళిక ప్రకారం అమలు జరిగింది. అందులో రాష్ట్రమంతటకూడ జరిగినచోటే అభివృద్ధి జరిగింది గాని అన్ని నియోజకవర్గాలలో సమానమైన దృష్టితో జరుగలేదు. ఏ ఏ నియోజక వర్గంలో ఎంతెంత డబ్బు, అభివృద్ధికిగాను ఖర్చుపెట్టినారో అదికూడ దృష్టిలో పెట్టు కొని ఈ ద్వితీయ ప్రణాళిక, ఇంత బ్రహ్మాండమైనది కాబట్టి ఇది మనకు ప్రథమ ప్రణాళికగా భావించాలి. ఈ ప్రణాళికలలో చేయబోయే అభివృద్ధి స్కీములు అన్ని, కూడ 168 నియోజకవర్గాలలో ఉన్నాయి. ఈనాడు మూరు మూలలనుంచికూడ, ప్రతి నిధులువచ్చి, ఈ ప్రభుత్వ బాధ్యతలలో పాల్గొన్నారు. వాండ్లు భాగస్వాములుగా వ్యవహరిస్తున్నారనే దృష్టితో, సమానమైనటువంటి allotment నిర్ణయించి నియో జకవర్గముల వారీగా ఈ అభివృద్ధి కనపరిస్తే నిజంగా ఇది సమంజసంగా జరుగు తుంది. లేకపోతే, ఇది అభివృద్ధి చెందిన తాలూకాలే, ఇంతకాలం అనుభవించిన వాండ్లకే ఈ ప్రతిఫలం కూడ చేకూరుతుంది. మళ్లా అటువంటిది లేకుండా చూడ వలెనని నేను మనవిచేస్తున్నాను. ఈ నాగార్జునసాగర్ మొట్టమొదట వెనుకబడిన

ప్రాంతాలకు, నీటి వనరులేని ప్రదేశాలకు వెనుకబడిన తాలూకాలకు వర్తింపచేయడానికి గాను sanction అయింది. అప్పుడు నాగార్జునసాగరు అనేది వస్తే ఈ మెట్ట తాలూకాలు ఎంతో అభివృద్ధిచెంది నీటి వనరులు చేకూరి అక్కడి ప్రజల దరిద్రం తొలగిపోతుంది నిరుద్యోగ సమస్య నిర్మూలన అవుతుందని అనుకొన్నారు. కాని ఈనాడు మాస్తే అది కేవలం గుంటూరు జిల్లాకే ప్రథమ దశలో sanction చేశారు. కాబట్టి ద్వితీయ దశ అంటే మేము నీళ్లు అని అనుకొన్నాం. ఈనాడు అది ప్రథమ దశలోనే నెల్లూరు జిల్లాకు కూడా sanction ఇచ్చి నెల్లూరు జిల్లాలోకూడ ఒకే ధఫా శాక్షన్ వారీగా పని జరిగేటట్లుగా చూడాలని చెప్పి, దానిని ఆ విధంగా ప్రథమము లోనే చేయమని మన ప్రభుత్వం ఇండియా ప్రభుత్వంతో సంప్రదించి, త్వరలో అటువంటి కష్టాలను నివారించి అనేక దుష్ప్రచారాలకు లోను కాకుండా ఈ బీద తాలూకాలకు కొంత రక్షణ కలిగిస్తారని ఆశిస్తున్నాను.

మొట్టమొదట 21 వేల క్యూసెక్కుల నీరు పారే కాల్వ తీస్తామని చెప్పారు. ఈనాడు గుంటూరు జిల్లావరకే కదా, అందువల్ల 7 వేలు cusec ల నీరుపారే కాల్వ చాలును, అన్నట్లు తెలిసినది. అటువంటప్పుడు నెల్లూరు జిల్లాకు ఆ కాలువ వస్తుందని ఆశలేకుండా నిరాశ కలుగుచున్నది. ప్రథమ దశలోనే 21 వేల cusec లు పారే కాల్వ నిర్మించడం అగత్యం. మూడవది.— దాని క్రింద ఉండే భూమి ఈనాడు నందికొండ ఏరియాలో చేరింది. ఇది బీదలకని మొట్టమొదట చెప్పారు. ఈనాడు దానిక్రింద ఏడుకోట్ల వరకు డబ్బు వస్తుంది. అందువల్ల ఇది పట్టాలకుగాని సాగుకుగాని permission ఇవ్వడానికి వీలు పడదంటున్నారు. భూసంస్కరణలు అని ఒక ప్రక్కన చెప్పుతున్నారు. ఇటువంటి బంజరు భూములుకూడ ఈనాడు బీదలు సాగుచేసుకోడానికై permission ఇవ్వకపోతే, నిజంగా ఈ భూసంస్కరణలు జరుగుతాయా ? వీటివల్ల ప్రయోజనం ఉన్నదా? లేదా? అని బీదలకు సందేహం కలుగకుండా, ఈ నందికొండ area క్రింద అయినప్పటికి, దానికి ఒక విధమైన market value ఇపుడే నిర్ణయించి ఆ భూములు బీదలకు, కుటుంబానికి ఇంత అని చెప్ప లేనటువంటి బీదలకు, అనగా landless poor కు, జాతి విచక్షణలేకుండా, ఇది scheduled జాతులకు, back ward జాతులకు అని లేకుండా, ఆ భూములన్నిటిని బీదలందరికి సాగుచేసుకోడానికైనా permission ఇవ్వాలి. నిర్ణయించిన మార్కెటు value క్రమేణా ఇన్ని వాయిదాల లోపల చెల్లించిన తర్వాత వాండ్లకు

పట్టాయి ఇవ్వాలని చెప్పుచని మనవిచేస్తున్నాను. కాబట్టి నీటి వసరులు కలిగినపుడు అందరితోపాటు వాండ్లుకూడ శిస్తులు చెల్లించడానికి బద్ధులై ఉంటారు కాబట్టి ఏ కాశికలు, ఏ Land reforms జరుపకుండానే భగవంతుడు ఈ విధంగా లభ్య పడేటట్లు చేస్తాడు. ఈబంజర్లవల్ల అధిక ల్యాండ్ రెవెన్యూ వస్తుంది. ఆ రకంగా ప్రభుత్వం చేస్తుందని ఆశిస్తున్నాను.

Estate ల స్థితి చూస్తే, మొట్టమొదట గవర్నమెంటు ఎస్టేటులను తీసుకొనే ప్పుడు జమీందారులయొక్క దుష్పరిపాలనను ఖండించారు ప్రభుత్వం ఇప్పుడు వాటిని స్వాధీనము చేసుకొన్నారు ఈనాడు ఇక్కడ ఉండే పరిస్థితులను చూస్తే పూర్వ జమీందారీల్లోకంటే ఇప్పుడు వారు ఎక్కువ కష్టాలకు గురి అగుచున్నారు. ఎందువల్లనంటే 'పట్టాలున్న భూములనే వ్యవసాయభూములుగా పరిగణిస్తాం, మిగతా భూములను అంతాకూడా Forest ల క్రింద ఒప్పచెప్పుతాం'– అంతకంటే లేదం టున్నారు. రెవెన్యూ శాఖవారు భూమిని మాకు అప్పచెప్పినతరువాత ఇది అంతా Forest అని Forest Department వారు అంటున్నారు. దీంట్లో భూములను సాగుకుయివ్వం Grazing పొరంబోకుకు ఇవ్వము. వాటినిఅంతా బంజర్లుగా ఉంచాం. అది మా ఇష్టం అంటున్నారు. రెవెన్యూ శాఖవారితో మేము ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపితే ఇది మహాకష్టమైన సమస్య. దానిని ఇపుడు తేల్చడానికి లేదు. అక్కడఉండే పరిస్థితులను అనుసరించి జిల్లా కలెక్టరో, ఆ District Forester లేకపోతే Forest Settlement Officer గారో తీర్మానిస్తారన్నారు ప్రభు త్వోద్యోగులలో అవినీతిపెరగడంవల్ల రైతులు మిక్కిలి కష్టపడడం జరుగుతున్నది. కాబట్టి అట్టిదిలేకుండా ఈరోజువరకు కూడా గవర్నమెంటు ఫారెస్టులో, గవర్నమెంటు గ్రామాలలో ఈ Forest Department పనిచేసింది. అక్కడ reserve forest ఎంతఉన్నది. Un-Reserve Forest ఎంతఉన్నది. శివాయిజం భూమి ఎంత ఉన్నది. పట్టాభూములు ఎన్నిఉన్నాయి అనేసంగతి ప్రభుత్వానిక్కి తెలియదా? కేవలం ప్రస్తుత వైఖరివలన ఈ Estate గ్రామాలకు ఒకపెద్ద కష్టసమస్య ఏర్ప డింది. అందుబాటులో ఒక గవర్నమెంటు గ్రామం, ఒక Estate village ఉంటే అక్కడ Forest area ను నిర్ణయించడానికి ప్రభుత్వం ఒక ఆజ్ఞయిచ్చి అమలుపరచ మని ప్రభుత్వోద్యోగులకు ఉత్తరువులు చేయాలికాని, కేవలం ఉద్యోగుల ఉత్తరువు లపై ఆధారపడి ఉండే ప్రభుత్వం ఒక ప్రభుత్వంగా అనిపించజాలదన్న దానిని దృష్టిలో పెట్టుకొని ఆలోచించాలని మనవిచేస్తున్నాను. తర్వాత ఎలెక్ట్రిసిటీ ఈనాడు

చూస్తే కేవలం దీపాలుకే ఉపయోగపడుతున్నది. ఈ దీపాలురాక పూర్వంనుంచి దేవుడుఇచ్చిన దీపాలున్నాయి. అవి సూర్యచంద్రులు, కానీ ఈ చిన్నచిన్న దీపాలు కూడా వెలుగుతూనేఉన్నవి. ఈనాడు మనం దీపాలకోసం ఇన్నికోట్లరూపాయలను ఖర్చుపెట్టడంమాత్రం సమంజసం కాదేమో మనం ఇతరదేశపు సినిమాల్లో చూస్తున్నాం ఈ Electricity ని వ్యవసాయానికీ, పరిశ్రమల అభివృద్ధికీ విరివిగా ఉపయోగ పరచాలి అందుకుగాను ప్రయారిటీ వాటికి ఇవ్వాలి. సజలాధారములు, జీవనదులు లేనిచోట బావులనీటినయినా కరెంటుతో పైకితెచ్చి వాళ్ల తోటభూములకు పారునట్లు చేయాలని నేను ప్రభుత్వమును కోరుచున్నాను. పరిశ్రమలను చూస్తే, ప్రభుత్వం నమోదుపరచిన పరిశ్రమలు వాటంతటఅవి కావలసిన ఐశ్వర్యములను చేకూరుస్తాయి. ప్రతిమానవుడూ, ప్రతికుటుంబము కూడా అటువంటివాటిని చేసుకొనడానికి హక్కుఉన్నది వాటంతటఅవి ఏర్పడుతాయి. అయితే పరిశ్రమలు అనేవి కేవలం ఇటువంటి పరిశ్రమలు కావు. కాని పరిశ్రమలు ఖనిజాలతో కూడినవి. లోహసంబంధమైనవి అటువంటి పరిశ్రమలను ఎక్కువ ప్రోత్సహించాలి. దానివల్ల వేలాదిప్రజలు బ్రతుకుతారు. జీవనోపాధులు వారికి చేకూరుతాయి. నిరుద్యోగసమస్య నిర్మూలనమవుతుంది. ఆ ఖనిజంతో తయారయే వస్తువులతో దేశంలో ఐశ్వర్యం చేకూరుతుంది. అందువల్ల దేశం అభివృద్ధిచెంది ఈ కనకంతో సమస్త దేశాల్లోని అన్నిటినీ కొనేశక్తి మనదేశానికి ఏర్పడుతుంది. ఉదాహరణగా పడిపోయిన జర్మనీ ఇప్పుడు తలఎత్తి ఇన్నిదేశాలపైన సవారిచేస్తుందంటే దానికదే ఏబల్మంవల్ల చేకూరిందని ఒకసారి ఈ ప్రభుత్వం గుర్తుకుతెచ్చుకోవాలని నేను మనవిచేస్తున్నాను. కాబట్టి ఇటువంటి పరిశ్రమలను నెలకొల్పుటకు ఈ ప్రభుత్వం కృషిచెయ్యాలని నేను వార్ని హృదయపూర్వకంగా వేడుచున్నాను.

ఈనాటి విద్యచూస్తే నిజంగా మనముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన విద్య చాలా ఉపయోగకరమైనది. ప్రసంశనీయమైనది. పొగడతగింది. ఉచితవిద్యను ఒకేదఫా 7 వ తరగతివరకు పెట్టాలనుకొన్నారు. అయితే పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఒకటవ ఫారంనుంచి ఏడవఫారంవరకు, ఇదివరకు చదువక ఇండ్లలోనున్న బాలురు కూడా నేడు బడికివచ్చి చేరారు ఈలా చేరినందువల్ల క్లాసులలో ఇప్పుడున్న section లు గాక ఇంకా అదనపు section లు ఏర్పాటు చేయవలసి వచ్చింది, అందువలన అయ్యవార్లనుకూడా అదనముగా ఏర్పాటు చేయవలసివచ్చింది. అందువల్ల ఉపాధ్యాయులక్రింద జీతాలు ఖర్చుపెరిగినాయి. అందువల్ల ఉచితవిద్యను ఒక్క

సారిగ 7 ప తరగతివరకు పెడితే డబ్బుకొరత ఏర్పడుతుందనే ఉద్దేశముతో ఒకొ్క్క Form నుంచి పెంచాలనుకున్నారు. అది సమంజసమైన విధానమే. ఇంకొక విషయాన్నికూడా మనవిచేస్తున్నాను బీదపిల్లవాళ్లకు బోర్డింగులు పెట్టించి 7 సంవత్సరములనుంచి 18 సంవత్సరములవరకు ప్రభుత్వ ఆధీనంలోనే ఉంచుకొని సమస్త విద్యలు వాళ్లకు నేర్పితే, బీదప్రజానీకం ఇందువల్ల వృద్ధిచెందగలవని నేను ఆశిస్తున్నాను.

చెరువులు ఇటువంటివన్నీ జలాధారములు జీవనదులు లేనిచోట ముఖ్యంగా చేయించాలి. నీటి వసతులను అటువంటిచోట్ల కల్పించాలి వర్షాలుకురిసి, వర్షాధారముతో నిండేచెరువులకు మొట్టమొదట ప్రయారిటీ ఇచ్చి ఈ ద్వితీయ ప్రణాళికలో దానిని ముందుగా నిర్మించాలని కోరుతున్నాను వాటికే ప్రయారటీ ఇవ్వాలి ఈనాడు అటువంటి ప్రయారిటీ బొత్తుగా శూన్యం. ఎన్నో Estimates తయారుఅయి, వాటిలో Chief Engineer దగ్గరకు ఎన్నివస్తున్నయో, ప్రభుత్వందగ్గరకు ఎన్నివస్తున్నయో, మొత్తంమీద ఆ sanction అయ్యేది చూస్తే అది వేరేవిధానంగా, ప్రతిచోటా జరుగుతున్నాయి అని చెప్పవలసిఉంది. అలా నిందారోపణలను చెయ్యటానికి వీలులేనట్టి పరిస్థితులను కల్పించి, అన్ని నియోజకవర్గాలను సమానమైన దృష్టిలో ఉంచుకొని చేయాలని మనవిచేస్తున్నాను

రోడ్డు ఉన్నచోటనే మరొకరోడ్డును; train ఉన్నచోటనే మరొక train ను వేయకుండా దారివసరులు లేనిచోట వాటిని నిర్మించాలి. నిర్మించి మంచి స్థితిలో లేనిరోడ్లకు రిపేరులు చేసేనిమిత్తం ఇదివరలో బ్రిటిష్‌వారి హయాములో Renewal chart అంటూ ఒకటి ఉంటూవచ్చింది. అనగా ఒకఫర్లాంగులో కాని, ఒకమైలులోగానీ, 5 సంవత్సరములవరకూ ఒకసారి రిపేరుచేసినవెనుక రెండవసారి చేయవలసిన ఆవశ్యకత లేదు. ఈ నాడు చేసినచోటే మరిఎన్నిదఫాలు చేస్తున్నారో ఈ అయిదు ఏండ్లలో ఎన్నిసార్లు రిపేరు చేస్తున్నారో, దీనికథ ఏమిటో తెలియదు. ఈ ఎంజినియరింగు అంటే ఏమిటో ఈ ఖర్చు అంతాకూడా ఏమిటో మాకు అర్థం కాకుండా పోతున్నది. కాబట్టి ఆ రిన్యూయల్ చార్టు ప్రకారం ఇకమీదట జరుగబోయే రిపేర్లన్నీ కూడా జరగాలని ఆదేశించాలి. లేనిచోట్ల రోడ్లను వేయించాలి. ఇటీవల లక్షలు,కోట్లు ఖర్చుపెట్టి వేయించిన మట్టిరోడ్లు శిధిలమైపోతున్నాయి. మొత్తంమీద జిల్లా బోర్డువాళ్లు వేయించాలంటే వాళ్లవద్ద డబ్బులేదన్నసంగతి విశదమగుచున్నది.

అటువంటప్పుడు ప్రభుత్వమయినా చేయాలి. ఈ రెండు చేయలేనప్పుడు, ప్రస్తుతం ప్రతిగ్రామంలోను పంచాయితీలను నెలకొల్పుతున్నారు. కాబట్టి పంచాయితీలకు గ్రామ పొలిమేరలలో ఉండేటటువంటి రోడ్లను, మెటల్‌రోడ్లుగా చేయించాలని ఆదేశించినట్లయితె వాళ్లు పంచాయితీ డబ్బునుండి వాటిని మెటల్ రోడ్సుగా చేయించుకొంటారు. ఆమాదిరిగ ఉత్తరువులను జారీచేస్తే రోడ్లు అన్నీకూడా పూర్తిగా మెటల్‌రోడ్సు అవుతాయి. వాటిని కనెక్షన్ రూట్సుగా ఏర్పరిచి వాటి రాబడి డబ్బు ఆపంచాయితీలకు వాటాగా పంచాలి.

భూసంస్కరణలను చూస్తే ఏమి సమంజసంగా లేదు. దానివిషయం రేపు వేరే బిల్లు రాబోవుతున్నది. దాన్ని అప్పుడు ఆలోచన చేస్తాం. ఇక ఇప్పుడు ఋణాలను చూస్తే బ్యాంకులలో ఇచ్చే ఋణాలన్నీ దాదాపు ధనవంతులకే ఇవ్వబడుతున్నాయి. భాగ్యవంతులకు బ్యాంకులనుంచి ఋణాలను ఇచ్చేపద్ధతిని మానివెయ్యాలి వాళకు ఎవరైనా అప్పులు ఇస్తారు. కాబట్టి తక్కువ వడ్డీతో దీర్ఘకాలం వాయిదాలతో ఎలాంటి income లేని బీదరైతులకు Share capital లేకుండా ఈ ఋణాలను అందచేయాలని కోరుతున్నాను.

Sri S. KASI REDDI అధ్యక్షా, నిన్న గవర్నరుగారు సుదీర్ఘమైన ఉపన్యాసం ఇచ్చినారు అది ఎంత సుదీర్ఘమైనప్పటికీకూడా అందులో ప్రభుత్వ కార్యకలాపాలు, విధానాలు, ద్వితీయ ప్రణాళికను దృష్టిలో పెట్టుకొని అభివృద్ధికరమైనటువంటి కార్యక్రమం లేకపోవుటవలన నేను వారిని అభినందించ లేకపోతున్నాను ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మన దేశమునకు ముఖ్యమైనట్టిది. దానిని ప్రభుత్వం, ప్రజానీకం కూడా సంతోషంతో ఆహ్వానిస్తున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమల అభివృద్ధి, భూసంస్కరణలు ప్రధానపాత్ర వహిస్తున్నాయనుట నిర్వివాదాంశము. కాని ఇప్పటివరకూ భూ సంస్కరణల విషయంలోమన రాష్ట్ర ప్రభుత్వానికి సరియైన విధానం లేదు అని మనకు స్పష్టంగా తెలుస్తోంది. కేంద్ర ప్రభుత్వ ప్లానింగ్ కమిటీవారు చేసిన సూచనలు అభివృద్ధి కరంగానే ఉన్నాయి. ఆంధ్ర భూస్వాముల భూములకు ceiling పెట్టి మిగతా భూమిని పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు పంచిపెట్టాలనే ఉద్దేశం వున్నది. 3600 రూ॥ లు వేరొక నికరాదాయం వచ్చే భూమిని భూస్వాముల దగ్గర వుంచి, మిగిలిన భూమిని బీదలకు, కూలీలకు పంచవలెనని Plannng Committee వారు సూచించారు. లక్కరాజుగారిచ్చిన రిపోర్టుచూస్తే విచారం

కృతజ్ఞతాం్తి వారి నివేదికను అన్ని పార్టీలవారు, పత్రికలు విమర్శిస్తూవుంటే, పైగా ఈ నివేదికలోని సూచనలు Planning Committee సూచనలకు భిన్నంగా వున్నప్పటికినీ, సమస్తముగాని ఈ రిపోర్టును అభినందించడంలో అర్థంలేదు.

Sri G NARSIMHA MURTHY వారి పేరు లక్ష్మీరాజుగారుకాదు అది వారి యింటిపేరు. వారిపేరు సుబ్బారావుగారండి

Sri S. KASI REDDI వారిపేరుకంటే వారి యింటిపేరే లోకవిదితము. వారి ఇంటిపేరుకే యింత ప్రాధాన్యమున్నప్పుడు వారు చాలా గొప్పవారన్నమాట.

వారి రిపోర్టులో భూసంస్కరణల విషయంలో ప్రభుత్వంవారి విధానమేమిటో తెలియుటలేదు అందువల్ల ఇది ఏమాత్రం అభినందనీయంగాలేదు. భూస్వాములను రక్షించుటకు ఈ నివేదిక ఉద్దేశింపబడిందనే విషయం స్పష్టం. సామాన్యమైన బం జరుభూముల విషయంలోకూడా ఈ ప్రభుత్వ విధానం విమర్శనాత్మకంగానే వున్నది దేశంలో కొన్ని లక్షల ఎకరముల భూమి బీడుగానే వుంది అటువంటి భూమి పేదల చేతిలో కాకుండా భూస్వాముల అధీనంలోనే వుంది. ఆ భూములను పంచుటకు నిర్దు ష్టమైన సూచనలను గవర్నరుగారి ఉపన్యాసంలో సూచించనేలేదు అనేకచోట్ల బం జరు భూములను సాగుచేసుకొంటున్న పేదలను ఆభూములనుండి తొలగించడం జరుగు తోంది కోవూరు, నెల్లూరు తాలూకాలలోని delta క్రింద వున్నటువంటి abandoned tanks నిరుపయోగమని ప్రభుత్వం గుర్తించింది. ఆ భూములను 1520 సం॥ నుంచి సాగుచేస్తున్న పేదప్రజలను ఆ భూములనుండి తొలగవలసినదిగా ప్రభుత్వం Orders పంపుచున్నది. ఈ విధంగా చాలా కాలంనుండి ఉపయోగంలో లేని భూములనుండి పేదప్రజలను తొలగించుట ప్రభుత్వానికి న్యాయంకాదు.

దాదాపు 10వేల ఎకరములను చాలా కాలంనుంచి చేస్తున్న అనేక పేదప్రజలను ఆ భూములనుంచి తొలగించడం చాలా అన్యాయం. ఈ విషయాన్ని ప్రభుత్వంవారు శ్రద్ధగా ఆలోచించాలని మనవి చేస్తున్నాను.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద అనేక పథకాలున్నాయి Local Development schemes, జాతీయ విస్తరణ ప్రణాళికలు, కమ్యూనిటీ ప్రాజెక్టులు మొదలైనవి వున్నాయి. ఇవన్నీ అభివృద్ధికరంగా జరగాలంటే అన్ని ప్రాంతాలలోనూ ఒకే విధంగా అమలు పరచడం సాధ్యంకాదు. వెనుకబడిన ప్రాంతాలలో 50% contribution

యివ్వడంకూడా సాధ్యంకాదు ద్వితీయ ప్రణాళికను జయప్రదం చేయడానికి సామాన్య ప్రజానీకాన్ని సమీకరించి వారిని ఉత్తేజ పరచాలని ఇంతకుముందు గౌ॥ సభ్యులు చెప్పినారు, దానితోనేను అంగీకరిస్తున్నాను. ఎందుచేతనంటే అన్ని ప్రాంతాలవారికి తారతమ్యం లేకుండా 50% contribution ఇవ్వడం అసాధ్యం. వెనుకబడిన ప్రాంతాలలోనివారు, అభివృద్ధి ప్రణాళికలు అమలు జరిగిన ప్రాంతాలలోని వారివలే, నూటికి 50 పాళ్లు యివ్వడం అనేది ఆచరణలో జరగనివని. బీద ప్రజానీకం వారికి పనులు లేకపోవడంవల్ల నూటికి 50 పాళ్లు ఇవ్వలేక పోతున్నారనే సత్యాన్ని మాజిల్లా Planning Committee తీర్మానాలు చేసి పంపిన ఘట్టాలుకూడా ఉన్నాయి. వాటిని ప్రభుత్వం గుర్తించాలని చెప్పి మనవిచేస్తున్నాను

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద నాగార్జునసాగర్ ప్రాజెక్టు అమలు జరుగుచున్నది. ఇది గర్వించదగిన విషయం. ఇది జయప్రదంగా అమలు జరగడానికి 122 కోట్ల రూపాయలు అవసరం 122 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి పెద్ద ఎత్తున ప్రజలను సమీకరించ గల్గితేనే ప్రాజెక్టు నిర్మాణం నెరవేరుతుంది ఈ సంవత్సరం కేంద్ర ప్రభుత్వం 180 లక్షలు ఇచ్చినప్పటికీ, ఇంకా చురుకుగా పనులు జరిగే విధానంలో దీనిని అమలు జరిపినటయితే ప్రజలు దానిని అంగీకరించి అది జయప్రదం కావడానికి, పనులు త్వరగా జరగడానికి సహాయపడలారు ఇది ఏ 20, 30 సం॥ లకో కాని పూర్తి అయ్యేలాలేదు అనే భయం ప్రజలకు వుంది ఈ ప్రాజెక్టు నిర్మాణమునకు శంకుస్థాపన చేసి 9 నెలలు అయినప్పటికినీ పనులు చురుకుగా కొనసాగడం లేదని మనం గుర్తించుకోవలసియున్నది. అక్కడ పనిచేసే కూలీలకు తగిన నివాస సౌకర్యములు కల్గించలేక పోవడంవల్ల, వారిని పెద్ద ఎత్తున సమీకరించలెక పోతున్నాము. అందువల్ల పనులు తొందరగా జరుగుటలేదని గుర్తించుకోవలసి యున్నది.

నందికొండ కుడికాల్వ విషయంలో ఖోస్లా కమిటీవారు చేసిన సూచనలు ఎక్కువమందికి ఉపయోగపడేటట్లుగా చేయడం కూడా చాలా న్యాయమైన విషయం. దాని విషయంలో ఇంకా కొలతలు తీసుకోవడం జరుగుతున్నది. దాని విషయమై ఇంతవరకు ఏమి నిర్ణయం చేశారో మనకు తెలియదు దానిని ప్రభుత్వంవారు శ్రద్ధగా పరిశీలించి అధిక ప్రజానీకానికి అంగీకార యోగ్య మయ్యేటట్లు చేయాలని నేను కోరుతున్నాను. నాగార్జునసాగర్ కుడికాల్వను రెండు దశలుగా చేస్తామని ప్రభుత్వంవారు చెబుతున్నారు రెండు దశలుగా చేస్తామంటే ఇది పూర్తి అవుతుందా? లేదా? అని

ప్రజల్లో అనుమానం కల్గడానికి అవకాశంవుంది. ఎందుచేతనంటే, మొదటి దశలో ఏ 140 మైళ్లో పూర్తిఅయితే మిగిలినది ఇంకా ఆలస్యం అవుతుందని భయంగావుంది. అంతేకాని 2 దశలలో వేసినప్పటికీ అది అభ్యంతర కరమైన విషయంకాదు

విద్యా విషయంలో III Form వరకు ఉచితంగా విద్య నేర్పే యేర్పాటు చేస్తామని ప్రభుత్వంవారు చెప్పియున్నారు. కాని ఈ సంవత్సరం I Form కు మాత్రమే ఉచితంగా చెప్పడం జరుగుతోంది.

దీనినిబట్టి ప్రభుత్వానికి ఒక నిర్దుష్టమైన విధానంలేదా? లేక ఇచ్చినమాటను నిలబెట్టుకోలేదా అని ప్రజలు విమర్శించడానికి అవకాశం కల్గుతోంది. దీనిని గురించి ప్రభుత్వంవారు తగిన యేర్పాటు చేయాలని కోరుతున్నాను.

స్కూళ్లలోనూ, కాలేజీలలోనూ సీట్లు దొరక్కపోవడం, తరువాత వాటిని తెరిచి 2, 3 నెలలైనా యింతవరకు పుస్తకాల సప్లయి సక్రమంగా లేకపోవడం, తగినంత మంది ఉపాధ్యాయులు లేకపోవడంవల్ల విద్యార్థులు నష్టపోతున్నారు. Schools లోని విద్యార్థులకు కావలసిన పుస్తకములు, మున్నగువాటి విషయంలో ప్రభుత్వంవారు శ్రద్ధ వహించాలని కోరుతున్నాను.

Elementary Schools ను ప్రభుత్వం తీసుకుని District Boards కు ఇవ్వాలనేది అందరు కోరుతున్నటువంటి విషయం. కాని ఇదే సందర్భంలో డబ్బులేదనే టటువంటి ఉద్దేశ్యంతో రాష్ట్రం మొత్తంమీద 6,000 మంది ఉపాధ్యాయులను తీసివేస్తారనే విషయం చూస్తేచాల ఆందోళన కరంగా ఉన్నది. పైగా I Form నుంచి III Form వరకు విద్యార్థులకు ఉచిత విద్యకాబట్టి డబ్బు ఎక్కువ అవుతుంది గనుక ఉపాధ్యాయులను తగ్గించాలనడం ఏ మాత్రము అంగీకరించాల్సిన విషయంకాదు. సెంట్రల్ గవర్నమెంటు చెప్పినట్లు Scales ఇవ్వనందువల్ల teachers చాల ఆందోళన పడుతున్నారు, Teacher కు 25 మంది విద్యార్థులు ఉండాలని చెప్పటం చూస్తే ఉపాధ్యాయులను ఇంకా ఎక్కువగా తగ్గించడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లున్నది. ఇదికూడా ఆందోళన పడవలసినటువంటి విషయమే. అందువల్ల దీనినిగూడా సవరించాలని కోరుతున్నాను.

హరిజనుల ఇండ్ల స్థలాల విషయంలో మా తాలూకాలో 6 సంవత్సరాలనుంచి అర్జీలు పెట్టుకొంటున్నా ఇంతవరకు ఒక గ్రామంలో ఒక్కరికికూడా sanction

కాలేదు. ఇదేమాదిరిగా జిల్లా మొత్తంమీద 180 applications ఉంటే ఇన్నీ dispose of చేయడానికి తరాలు, ఎన్ని శతాబ్దాలు పడతాయో ఎవరికి అర్థంకా దంలేదు.

అందువల్ల ఇది హరిజనులను ఉద్ధరిస్తున్నామని చెప్పడం మరీ అన్యాయంగా ఉంటుంది. ఎందుచేతనంటే, సంవత్సరానికి 10 ఊళ్లుకూడా ఇవ్వకుండా 180 applications ఉంటే వాటన్నింటిని కట్టలుకట్టి బుట్టలో వేయడం జరుగుతోంది. ప్రభుత్వం దీనిని వెంటనే గుర్తించి ఇంకా ఎక్కువ స్థలాలు sanction చేయాల్సిన అవసరం ఉన్నది.

విద్యుచ్ఛక్తి వ్యవసాయానికి ఎంతగానో ఉపయోగ పడుతుంది. కాని ఇంత వరకు మెట్ట ప్రాంతాలకు కావలసినంత విద్యుచ్ఛక్తి ఇవ్వలేదు. కాబట్టి ప్రభుత్వం దీని విషయంలోకూడా తగినటువంటి చర్యలు తీసుకొని మెట్ట ప్రాంతాల అభివృద్ధికి తోడ్పడాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri N. VENKAIAH అధ్యక్షా: మన రాష్ట్రం మద్రాసునుంచి ప్రత్యేకిం పబడడము, హైదరాబాద్ ఆంధ్రులతోకూడా మనం కలసి ఉండే భాగ్యం లభించడం చాల సంతోషకరము. అయితే సరిహద్దుల విషయంలో ఇంకా తీసుకోవలసినంత శ్రద్ధ తీసుకోవడము లేదని, చురుకైన ప్రయత్నాలు చేయడము అవసరమని కూడా మనవి చేస్తున్నాను. ఇప్పుడు Parliament Members అందరు కలిసి ఒక ప్రాంతం లో 55 వంతుల జనాభాకు ఏ భాష అయితే మూల భాషగా ఉన్నదో ఆ ప్రాంతాలను భాగాలను గ్రామాల వారీగా గాని, ఫిర్కాలు వారీగా గాని ఆ భాషారాష్ట్రానికి మార్పు చేయడానికి అంగీకరించవలసిందిగా భారత ప్రభుత్వము వారిని కోరినట్లు తెలుస్తున్నది.

ఆ ధోరణిలో సర్దుబాటుచేయకపోయినట్లైతే మన భూభాగాలు చాలా రాకుండ పోతాయి. మనం మెజారిటీగా ఉండి ఇతర భాషీయులు అంతకన్న చాల తక్కువగా ఉండికూడా, మనం నూటికి 50 వంతులుకాని ప్రదేశాలు కొన్ని ఉన్నాయి. అలాగే మనకు మెజారిటీ ఉన్నప్పటికి కూడా కన్నడిగులకు చెందుతున్న కొన్ని ప్రదేశాలు, బళ్లారి తాలూకా, హోసూరు మొదలైన కొన్ని ప్రదేశాలు ఉన్నాయి. అలాగే గుల్బర్గా బీదరు, రాయచూరు ఇంకా ఆయా తాలూకాల్లో కొన్ని భాగాలలో మనమే మెజారిటీ గా ఉన్నాము. కాని 55% మాత్రం లేము. కర్నాటికులు మనకన్నా కూడా 10,

20 వంతులు తక్కువగా ఉన్నారు. మధ్యలో ఉర్దు మాట్లాడేవారు ఇతర భాషీయులు ఉన్నారు. కాబట్టి 100 కి 10 వంతులు Single Majority ఉన్నచోట్ల ముందు మన భాగాలను రాబట్టుకోవడం కూడా అందులో ఒక సూత్రంగా చేర్చాలి. అలాంటి భాగాలు మన రాష్ట్రంలో ఉంటే ఇతర రాష్ట్రాలవారు వాటిని తీసుకోవడానికి కూడా మనకేమీ ఆక్షేపణ ఉండకూడదు. కాబట్టి single language group majority 10 వంతులు, మామూలు majority 5 వంతులు ఉన్న ప్రదేశాలను ఒక రాష్ట్రం నుంచి రెండో రాష్ట్రానికి మార్చడానికి మనం తప్పక పట్టుబట్టవలసి ఉంటుంది అంతే కాకుండా మన రాష్ట్రంలో తమిళులు కొద్ది సంఖ్య మాత్రమే ఉన్నారు కాని అరవ ప్రాంతంలో మనం అంతకు 10 రెట్లు ఎక్కువగా ఉన్నాము అలాగే కర్నాటక ప్రాంతంలోను, ఒరిస్సాలోనూకూడా. కాబట్టి మన రాష్ట్రంలో ఇతర భాషీయులు మైనారిటీగా ఉండి మనం ఇతరచోట్ల చాలా మెజారిటీగా ఉన్నప్పుడు మనం వారిని, వారు మనలను జాగ్రత్తగా చూడవలసిన అవసరం లేకపోవచ్చు వారి సంఖ్య స్వల్పము కాబట్టి, మనం ఎట్లా చూచినా వారికి లెక్కలేకుండా ఉండవచ్చు. అందువల్ల అన్నిచోట్ల minority సమంగా సర్దుబాటు కావడానికి కూడా తగినంత జాగ్రత్త వహించాల్సి ఉంటుందని మనవి చేస్తున్నాను.

పన్నుల విషయంలో, ఎవో కొన్ని పన్నులు మరల పడతాయని సూచనలు జరిగాయి. ప్రణాళికా నిర్వహణకు కూడా ఇప్పటి ఆర్థిక పరిస్థితి చాలదు, తగినంత మొత్తం రాబట్టుకొంటేనే తప్ప, ఈ ప్రణాళికా మొత్తాలు ఖర్చుపెట్టడానికి అవకాశం ఉండదని కూడా గవర్నరుగారి ప్రసంగంలో సూచించబడింది. కాని పన్నులు అనే ఉప్పటికి హడలెత్తించే విధంగా రకరకాల పన్నులు ఒక సంవత్సరంలో అనేకము విధించబడ్డాయి. అయితే పన్నును ఈ విధంగా విధించుకుంటూ పోవలసిందేనా ? అందరి మనస్సులకు కష్టం కలిగినా, నొప్పి కలిగినా, అందరుకూడా విధిలేక ఒప్పుకోవలసిన స్థితి ఉన్నప్పుడు పన్నులను ఈ విధంగా విధించుకుంటూ పోవలసిందేనా? లేక మరొక మార్గము ఉన్నదా? అని ఆలోచించాలి. ఇతర మార్గాలు ఉన్నాయని ఈ సభలోనే ఇదివరలో నేను అనేకసార్లు సూచించడం జరిగింది. ముఖ్యంగా 15 కోట్లదాకా మన రాష్ట్రంనుంచి Central Excise శాఖవారు పన్ను తీసుకొంటున్నారు. పొగాకుమీద 15 కోట్ల రూపాయల రాబడి Central Government తీసుకొంటున్నపుడు అందులో 100 కి 50 వంతులు, దొంబాయిలో income tax పంచ

ధోరణి ననుసరించి అయినా, లేక 50 వంతులు కొంత హెచ్చువాటా మనకు ఇవ్వడానికి తగినంత కృషి ఇప్పుడు చేయవలసిన సమయం వచ్చింది. వారుకూడా పన్నులు రాష్ట్రాలు ఎలావెయ్యాలా అనే ఆలోచనలో ఉన్నారు. అటువంటప్పుడు మన ముఖ్యమంత్రిగారు పొగాకులో 100కి 50 వంతులు ప్రత్యేకించుకోవడంగాని లేక Income tax విధానము అవలంబించి ఆదాయాన్ని అనుసరించి కొంతభాగము. జనాభా ననుసరించి కొంతదసంగాని రాబట్టుటకు ప్రయత్నించడం చాలా అవసరము. ఆవిధంగా జరిగితే లక్షలలో కాదు కోట్లసంఖ్యలో అదనపు ఆదాయము లభించడానికి అవకాశం ఉంటుంది.

తాడిచెట్లు అనేకం ఉన్నాయి. తాడిచెట్లమీద పన్నువేసి నీరా గీసుకోవడానికి అవకాశం ఇచ్చినట్లయితే హెచ్చు మొత్తాన్ని రాబట్టుకోవడానికి అవకాశం ఉంటుంది. నీరా ప్రమాదకరం కాదని అది ఆహార పదార్థాలలో చేరుతుందని, అందులో అణుమాత్రంకూడా నిషా లేవని నిపుణులు సూచిస్తున్నారు కాబట్టి తాడిచెట్లమీద పన్నువేసి నీరా గీసుకోవటానికి అనుమతిస్తే రైతులను, ఇతరప్రజలను ఎక్కువ బాధించకుండా ప్రభుత్వమునకు ఒక ఆదాయమార్గము ఏర్పడుతుంది.

తరువాత bus routes వేలమువేస్తే ఎంతో మొత్తము వస్తుందని ఆశిస్తున్నాను. ఒకవేళ పాత routes వేలము వేయడానికి మీకేదైనా ఆటంకమువస్తే, పాతవిధానాన్ని మార్చుకోడానికి అవకాశాలు లేకపోతే, కొత్తగా ఇచ్చే బస్‌రూట్లు అయినా వేలము వేయడానికి ప్రయత్నిస్తే, కొంతమొత్తము రాబట్టడానికి అవకాశము ఉంటుందని మనవిచేస్తున్నాను. అలాగే,- సాధారణంగా నెయ్యితప్పు మామూలుగా డాల్డా వాడడానికి ఎవరూ సమ్మతించరు. కానీ, ఇది hotels లో చాటున విరివిగా వాడబడుతున్నది. దానిమీదకూడా sales tax ,—రూపాయికి పావలాచొప్పున వేసినప్పటికీ బాధలేదు; వేసి, దాన్నికూడా దాదాపు నెయ్యితో సరిసమానంగా ధర చేయగలిగితే, గ్రామాలలో వేలకొలది ఒకటి, రెండు బర్రెగొడ్లో లేక ఆవులో ఉంచుకొని వాటి పాడిమీద జీవనం గడుపుకొంటూ- పన్నుకడుతూఉన్న చిన్నచిన్న రైతులందరూకూడా బాగుపడడానికి అవకాశాలుంటాయి. ఇంకా ముందు ఆలోచిస్తూపోతే, ఇంక కొన్ని విధానాలు సూచించడానికి అవకాశాలుంటాయి ఆవిధానాలను కూడా ఆలోచించడానికి తగిన ప్రయత్నాలుచేసి, నూతనవిధంగా ప్రభుత్వము ప్రజాళికను రూపొందించదలచుకొన్నప్పుడు, ఎన్ని సలహాలైనా యివ్వవచ్చు. అ కాశాలు కలిగించవలెనని ప్రభుత్వమువారిని కోరుతున్నాను. ముఖ్యంగా నీ

(Srı N Venkaıah) [9th August 1956

అన్నివిధాల ఆలోచించి, ప్రజలు నేరుగా బాధపడే వారికి ఎక్కువ యిబ్బందులు కలుగకుండునట్లుగా రాబట్టడానికి నాగా ఆలోచించి కృషిచేయవలసిందని కోరుచున్నాను. ప్రభుత్వానికి ఇంకా ఎక్కువరాబడి అవసరమనేది అందరికి తెలిసినదే. అది తేటతెల్లమే మీరు పెద్దాలికి రాబడి- లేకుండా మా గొంతు అంటె ప్రభుత్వాన్ని నిర్వహించడం కష్టము. మీ చేయడంలేదు కాని, రాబడి ఏవిధంగా లా జాగ్రత్తగా ఆలోచించవలసియుంటుంది చున్నాయని మనవిచేస్తున్నాను

ఇప్పుడు నాగార్జునసాగర్ - నిర్మాణంలో ఉన్నది. కాలువలకు estimates తయారుచేయబడుతున్నాయి అయితే గోదావరినీరుకూడా, క్రిష్ణా డెల్టాకు వాడి నాగార్జునసాగర్ నీరు దక్షిణానికి, అంటె - పెన్నానది దక్షిణభాగానికి, రాపూరు, గూడూరు, సూళూరుపేట, కాళహస్తి వగైరా తాలూకాలకు తరలించడానికి అవకాశాలు ఉన్నాయి అయితే, ఆ అవకాశాలు ఎప్పుడు వస్తాయి? గోదావరినదీ నీరు క్రిష్ణా డెల్టాకు వాడడానికి అవకాశము కలిగినప్పుడే. ఈపరవల మహోధృతం తగ్గించాలంటె- దప్పక గోదావరికి ఆనకట్ట కట్టబడాలి అది కట్టినవెంటనే వాడుకోడానికి తగిన ప్రదేశం క్రిందిభాగాలలో లేదుకాబట్టి, క్రిష్ణాడెల్టాకు ఇచ్చితీరాలి. ఆవిధంగా దక్షిణభాగానికి నీరు అందే సదుపాయము కలుగజేయవలసియుంటుంది. కాని, ఇప్పటి పరిస్థితులలో ఆ ఆలోచనలకు అవకాశాలు లేవని మనవిచేస్తున్నాను. 24 వేల క్యూసెక్కులు నీరు దక్షిణకాలువకు రావాలని కాలువ పరిమాణాన్ని ఖోస్లాకమిటీ నిర్ణయంచేస్తే-ప్రస్తుతం 21 వేలకు దించారు కాని, దక్షిణభాగానికి కూడా నీరు అందాలంటె కనీసం 30 క్యూసెక్కుల తూము అయినా పెట్టవలసి యుంటుంది. ఆ తూము పెట్టకపోయినట్లైతే దక్షిణభాగానికి కృష్ణనీరు అందించే అవకాశం లేదు. దాదాపు 50లక్షల ఎకరాలు ఆకాలవక్రింద సాగుచేయడానికి అవకాశము ఉన్నది. కాని తూము మాత్రము ఏ 20 లక్షల ఎకరాలకూ మించదు. కాబట్టి, ఆతూమును పెంచడం చాలాఅవసరము. అలాగే, ఎక్కువ ఖర్చులేకుండానే, కాలువను కొంత ఎక్కువ ఎత్తుకు తీసుకు వెళ్లవచ్చునని ఆలోచనలు జరుగుచున్నాయి. ఆవిధంగా జరిగితే, అది గుంటూరు జిల్లాకు ఏ 2, 3 వేల ఎకరాలకో లాభిస్తే, కర్నూలుజిల్లాకు 30 వేల ఎకరాలకు, నెల్లూరు జిల్లాకు లక్ష 20 వేల ఎకరాలకు లాభిస్తుంది. కాబట్టి కాలువను కొంత high level లో తీసుకు వెళ్లడానికి ప్రయత్నించవలసిందిగా కోరుతున్నాను.

మూడవది- గుళ్లకమ్మ అనేది మధ్యన అడ్డువస్తున్నది. దానికి ఒక reservoir కట్టి reservoir లో ఈ కాలవను వదలి reservoir నుంచి కాలువ తీసుకొనే ఏర్పాటు చేస్తే, పై reservoir repairs లో ఉన్నప్పుడు క్రిందిభాగానికి నీరు విరివిగా అందడానికి అవకాశముంటుంది. గుళ్లకమ్మగూడా ముందుముంచు తీవ్రస్వరూపముదాల్చి, ఒక్కొక్కసారి ముంచివేసే పరిస్థితులు ఉంటాయి కాబట్టి అవరదల ఉధృతం కూడ అరికట్టడానికి అవకాశముంటుంది. గుళ్లకమ్మ ముంపువల్ల Railway line దెబ్బతింటేనేమి, road దెబ్బతింటేనేమి, దాదాపు గవర్నమెంటుకు ఒక ఇరవై లక్షల నష్టము ఒక సంవత్సరంలో కలిగిందనేది మరువపద్దని మనవిచేస్తున్నాను. కనుక అలాగు విపరీతమైన వరదలు రాకుండా, దానికి reservoir మధ్యలో కట్టి క్రిష్ణా నీటికి తోడు ఆ నీరుకూడా ఉపయోగించడానికి ప్రయత్నంచేస్తే మంచిది. దానికి ఇదే సమయము. ఒక్క నాగార్జునసాగర్ కాలవకు గుండ్లకమ్మ దాటించుటకు వినియోగించే మొత్తంలో కొద్ది మొత్తం మాత్రం దానికి అదనంగా వినియోగిస్తే ఆ కాలవ దాటే దగ్గరనే reservoir కట్టడానికి అవకాశముంటుంది.

ఇక జిల్లాబోర్డు రోడ్డులయొక్క దుస్థితి గురించి చెప్పనలవి కాదు. ఏ రోడ్డున కూడాను సరిగా బండ్లు పోవడానికి అవకాశంలేదు. Margin లో పోదామా అంటే అదీ కష్టమే. ఆఖరుకు margin లో పోవడమే గత్యంతరం అవుతుంది. లేకపోతే రోడ్లు వదలివేసి చేలలో పోవడం మామూలుగా కన్పడుతుంది. ఈ రోడ్లకు గాను మన ప్రభుత్వము డబ్బు ఇచ్చే పరిస్థితిలో లేదు అని అర్థం అవుతూనే ఉన్నది. అయితే రోడ్లు బాగుపడటానికి ఏదైనా మార్గమున్నదా? ఉన్నది, సాహసించగలిగినట్లైతే. అది మనవి చేస్తాను. ఈ రోజున, బస్సురూట్లు ఇచ్చే విషయంలో, పది సంవత్సరములవరకు మీవద్ద పన్ను తీసుకోకుండా బస్సురూట్లు ఇస్తామన్నట్లయితే ఆ బస్సురూట్లు తీసుకొనేవారు సాహసించి, ఆ రోడ్లు మరమ్మతుచేయించి, వాటిని సరిచేయడానికి తయారుగా ఉన్నారు. ఈ విధంగా మా జిల్లాలో 7, 8 రూట్ల విషయంలో అనేకమంది నాకు సూచనలు ఇచ్చారు. కాబట్టి ఈరోజున పది సంవత్సములు పన్నులేకుండా బస్సులు నడుపుకోండని, బస్సు రూట్లు ఇస్తే ఎవరైనసరే ముందుకువచ్చి, ఆ రోడ్లును మరమ్మతు చేయిస్తారు. అప్పుడు ఆ రోడ్లును public కు గూడా ఉపయోగపడతాయి. బస్సులుకూడ నడుస్తాయి. లేకపోతే ఎటూ ఆదారులలో ఇప్పుడు బస్సులు వేయడానికి అవకాశము లేదు. కాబట్టి గవర్నమెంటుకు వచ్చే ఆదాయము పోయేదేమిలేదు. ఆ కారణంచేత, సాహసించి బస్లు

యిప్పుడు నడపక ఈ విధంగా ఉన్నవారలను చేసినట్లైతే ఈ రోజున కొన్ని జిల్లాలలో కొన్ని రూట్లు private పెటుబడి దారులు పెట్టుబడి పెట్టి తీసుకొని ఆ రోడ్లను మరమ్మతు చేయించి నడిపించుకొంటారు. Public గూడ వాటిని ఉపయోగించుకొంటారు. కాబట్టి సాహసించి ఈ మార్గాన్ని ఆలోచించవలసిందిగా కోరుతున్నాను

ఇక Community Blocks, జాతీయ విస్తరణ పథకాలు ప్రజలకు ఉపయోగింపబనే ఉన్నాయి. వాటికి ఉద్యోగులను నిరంతరం అధికం చేస్తున్నారు. ఈ ఉద్యోగుల సంఖ్య రానురాను చాలా ఎక్కువగుచున్నది. ఈ ఉద్యోగులు ఎవరు ఏపని చేయాలో ఆ విధులు అందరికి ఉన్నాయి. వారి diaries కూడ తప్పని సరిగా జాగ్రత్తగా పంపబడలాయి. కాని ఎవరు ఎంత పని చేస్తున్నారో, ఎవరు ఎంతవరకు అవసరమో కూడా జాగ్రత్తగా ఆలోచించవలసియుంటుంది ఈ రోజున Social Education Organizations అని దాదాపు రెండు వందల జీతాలతో ప్రతి Block కు ఒకరిని నియమిస్తున్నారు, కాని వారు ఏమి పనిచేస్తున్నారు॰ వారు ఎంతవరకు ఉపయోగము అని అనుభవముగలిగినవారిని విచారించినప్పుడు- వారివల్ల ఏమీ ఉపయోగంలేదని ఖచ్చితంగా తెలుస్తున్నది. Village Level Workers- ఒక Officer, ఇంత వరకు సిబ్బంది ఉంచే చాలును. మిగతా వారంతా శుద్ధ దండుగ అని అక్కడి పరిస్థితులనుబట్టి మనకు స్పష్టంగా కనిపిస్తున్నది అక్కడ Health మొదలగు మిగతా విషయాలలో ఆయా Department ఉద్యోగుల సహకారము తీసుకోవచ్చు. ఆలాగే ఈ రోజు ఈ కార్యక్రమాలకు నూటికి 50 వంతులు ఇచ్చి పనిచేయడానికి అనేక గ్రామాలలో ప్రజలు ఉత్సాహవంతంగా ముందుకు వస్తున్నారు. ప్రభుత్వము ఈ పథకాన్ని ఇంకా హెచ్చుగా అమలుపెట్టడానికి ప్రయత్నంచేయదు. సంతోషకరము. ఇంకా ఎక్కువ ప్రయత్నించవలసిందిగా కోరుతున్నాను. పైగా ఈ Blocks లో ఆఫీసర్లకు Jeep cars ఇస్తున్నారు. Jeep cars యొక్క ఖర్చు ఆ ఆఫీసర్ల జీతాలకంటె మించిపోతున్నది వారికి Jeep cars ఎంతవరకు అవసరమో ఆలోచించవలసియున్నది. వీటి అవసరము దాదాపు లేదనే అనిపిస్తున్నది. వీరికి 60 వేల జనాభా గలిగిన ప్రదేశము, దాదాపు 20 గ్రామాలు అప్పగిస్తున్నారు. ఈ 20 గ్రామాలలో తిరగడానికని ప్రతి ఒక్కరికి జీపు అవసరమా! అది ఎంతవరకు వారు సద్వినియోగం చేస్తున్నారు? ఎంతవరకు దుర్వినియోగంచేస్తున్నారో! ఇది అందరికీ బాగా తెలిసే ఉంటుందని అనుకొంటాను.

(At this stage Mr. Speaker, resumed the Chair)

Sri S. RANGANATHA MUDALIAR Mr Speaker Sir, before proceeding to speak on my amendments, let me express my gratification to the Governor for the strikingly democratic tenor of his address wherein he uses throughout the expression "our Government" instead of "my Government" of the old dispensation The Governor's address breathes an air of intimacy and every one of us should have felt, as it was being read, that the Governor took every one of us into his confidence. His address is really an expression of his deep appreciation of the genuine efforts made by this Government towards progress and the betterment of the common man But it is regrettable to note that the question of the settlement of the Andhra-Madras border issue has been left to the remote and uncertain contingency of the Centre formulating what is called "uniform principles" that may be applicable not only to the Madras-Andhra border but to other border areas I am afraid that such a contingency may not arise for a long time, as no Government will be in a mood to take up this thorny question, after all the travail that the State is passing through in the birth of the new linguistic states The Governor and this Government must be knowing that this question of the Andhra—Madras border stands altogether on a different footing from the other border areas The States Reorganisation Commission had stated in its report in unambiguous terms that they did not find themselves called upon to make any particular recommendation, as the Prime Minister of India had made it clear as early as March 1953 that a Boundary Commission would be appointed in due course to demarcate the south and south-western boundaries of the Andhra State, Therefore my request to this Government is that, in these circumustances, they must prevail upon the Central Government to appoint a Boundary Commission forthwith to settle this question once for all, irrespective of other border areas and to put an end to the state of uncertainty that is prevailing in this particular border area I am also sorry to see that no reference has been made in the Governor's address to the position of the Andhras in Bellary- History and time—honoured associations with these people ought not to be allowed to be forgotten overnight and to be swept away by considerations of territorial gains elsewhere I hope this Government may not consider this Bellary question as a closed one.

The Governor's address under the heading of Agricultural Production' has given credit to the Government for implementing various schemes for the improvement and furtherence of production But at the same

time, it has omitted to appreciate the need for controlling the prices of foodgrains which are soaring higher and higher day by day. It is absolutely necessary that the Government should step in to control this rise in prices and put a ceiling over prices of foodgrains to ensure the contentment of the common man

We are glad to be told by the Governor that the Government are contemplating to stimulate the interests of the public in all matters relating to the forests. But the best way of serving the public interests would be for the Government to put a ban on the burning of charcoal. Burning of charcoal licened or unlicensed has been responsible for the devastation of ancient forests and unchecked vandalism It is also to be regretted that a time limit has been indicated in the address to terminate the administration of the District Boards by the Special Officers. The regime of the Special Officers is the darkest period in the history of the Local Boards and it is mockery to have constituted a non-official committee on which no self- respecting ex- President is willing to serve and all those who are willing to serve and are serving are either ignored or looked down upon by these Special Officers who are by training and tradition unmitigated autocrats

The condition of the District Board roads is awful and all the other matters connected with the District Board administration present a sorry picture. The sooner the District Boards are brought into existence, the better for all persons concerned. Thank you, Sir

Sri A VENKATARAMA RAJU అధ్యక్షా, శ్రీ గవర్నరుగారు నిన్నటి దినమున యిచ్చిన ఉపన్యాసములో State level లో నిర్వహింపబడిన విశాలాంధ్ర ఎగ్జి రా కార్యక్రమములు మనము చాలాకాలము కోరుకుని ఉన్నవి. వాని నిర్మాణమునకు పూనుకున్న విషయాలను అన్నింటిని పేర్కొనియున్నారు. ఆ విషయములో ఎవరికినీ ఏవిధమైన అభిప్రాయ భేదములేదు. అయితే దినచర్యలలో జరుగుతూన్నటువంటివి- ముఖ్యంగా మనము సాధించిన విజయాలను పేర్కొనుటలోనే గాక, మనము ప్రయత్నముచేసిన వాటిల్లో విఫలమైన భాగములు ఏమిటి, ఏవి ప్రధానంగా ప్రజానీకాన్ని ఎదుర్కొంటున్నవి, వేటిని యింతవరకు మనము తొలగించలేక పోయినాము, అనేటటువంటి ముఖ్యమైన భాగాలకు మనము వెళ్లలేకపోవడము, యివి అన్నీ చూచుకున్నప్పుడు, సత్యాలనుగాని, లేకపోతే పత్రికల మూలంగా ప్రజలకు అందిన

గవర్నరుగారిప్రసంగమువల్ల ప్రజలనుగాని ఏవిధముగాగాని సంతృప్తి కలుగజేయలేదని నేను అభిప్రాయపడుతున్నాను. ఆహార ధాన్యముల విషయములో ఒక భాగాన్ని మాత్రమే అందులో తీసుకొనివచ్చారు. గత సంవత్సరపు దాన్యపు ధరలకంటే, అవి ఎంతో తక్కువగా పెరిగి వున్నప్పటికినీ. యీ సంవత్సరము ధరలు చూస్తే ఎంతో విపరీతముగా పెర్గిపోయినవి. 1954-55 సంవత్సరములో ఉన్న ధరలకంటే ఎంతో ఎక్కువగా ఉన్నదని ప్రభుత్వము అంగీకరించడము జరిగింది. ఈ రకంగా ధరలు పెరగటానికి కారణము ఏమిటి? ప్రభుత్వము ధరలు పెరగకుండా తగిన జాగ్రత్త తీసుకొనకపోవడమువల్ల, అసలు ప్రభుత్వములోనే లోపములు ఉన్నందువల్ల యిలాంటి పరిస్థితులు ఏర్పడటానికి కారణమయింది. వీటిని గురించి తక్షణ చర్యలు ఏమి తీసుకోవాలి అని మనము పరిశీలించినప్పుడు, వరద ప్రాంతాలలో చౌకడిపోలు తెరవటానికి కొన్ని చర్యలు ఆలోచించామని, అందుకుగాను కేంద్ర ప్రభుత్వం వద్దనున్న stocks ను కొద్దిగా యివ్వమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరియున్నామని మన ముఖ్యమంత్రి గారు చెప్పారు. అయితే కేంద్ర ప్రభుత్వముయొక్క ఆహార డిప్యూటీ మంత్రిగారు వివిధ ప్రాంతాలలో ధాన్యపు stocks చాలా ఎక్కువగా ఉన్నవనిన్నీ అందువల్ల Banks కు loans ను release చేయటానికి warning యిచ్చామని, ఆ కారణము చేత కొద్ది మొత్తముగల stocks మాత్రమే release అయినట్లు, చెప్పినట్లుగా యీ మధ్య పత్రికలలో పడినవార్తలవల్ల తెలుస్తున్నది. ఆ విధంగా స్టాక్సు రిలీజ్ కావటం వల్ల ధరలు పెరగటం అనేది ఎంతవరకు కారణ భూతమైనదో ప్రభుత్వం పరిశీలించినదా అంటే అదేమీ లేదని నేనభిప్రాయపడుచున్నాను. గత సంవత్సరము ధాన్యము బస్తా 1 కి రూ 16-8-0, రూ 17 చొ॥ స్టాకు start అయిన ధరలు ఈ రోజున రూ 25-8-0 వరకు పెరిగినవి. ప్రారంభములో వున్న ధరలకును ఈనాడు హెచ్చుస్థాయికి పోయిన ధరలకును గల తేడా రమారమి రూ 8,9 వరకు వుండడమనేది గత ప్రపంచ సంగ్రామ కాలములో గూడ మనము చూడలేదు. ఒకే సంవత్సరములో పండిన క్రొత్త రోజుల్లోను అమ్మకమైనటువంటి పాతరోజుల్లోను అనగా ఈ ఆరు మాసములలోగా కలిగిన ఇంత వ్యత్యాసము ఏనాడూ చూడలేదని పెద్దఎత్తున చాలమంది అనుభవస్తులు గ్రామీణ ప్రాంతాలలోనివారు చెబుతున్నారు. ధరలు పెరగటానికి ముఖ్యకారణము అనుభవమునుపట్టి చూస్తే గ్రామాలలో ధాన్యమును ఎక్కువగా స్టాకు చేయడము వలననే నని చెబుతున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో సాధారణంగా రెండు మూడు వందల బస్తాల పండించే ప్రతి లాండ్ లార్డు కూడ మరియొక రెండు మూడు వందల బస్తాలుకాని

స్టాకువేసిన ఘటనలు అనేకచోట్ల కనపడుచున్నవి. వ్యాపారస్థులకంటే భూస్వాములే స్టాకువేశారు. ఈ పరిస్థితి ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఎక్కువగా యేర్పడింది. ఈ పరిస్థితిని గ్రహించి ఇంత ధరలను పెరగకుండా అరికట్టడానికి ప్రభుత్వం ఎందువల చర్య తీసుకొనలేదో. అర్థం కావటములేదు 1954, 55 సంవత్సరాల కంటే ఈ సంవత్సరము ధాన్యమునకు ధర ఎక్కువగా పెరిగినదను మాట నిజమేనని గవర్నరుగారి ప్రసంగములోనే సూచించివున్నారు. ప్రభుత్వ మింతవరకు ధరల పెరుగుదల గమనించ లేదని నేను చెప్పవలసి వస్తున్నది. ముఖ్యమంత్రిగారు చెప్పినట్లు చౌక డిపోలు పెట్టి రాష్ట్రంలోవున్న ప్రజానీకాని కంతటికిని అందించాలంటే అసలు ప్రస్తుతం ప్రభుత్వము యొక్క ఖొక్కసం అంతాకూడా ఆవైపుకు తరలించి నప్పటికిని చాలని పరిస్థితులలో మనమున్నాము. ప్రస్తుతము ప్రభుత్వముయొక్క Policy ని బట్టి Prices కంట్రోలు చేయటము తప్పితే ప్రభుత్వం ఈనాడు బస్తా 1 కి యే ఒకరూపాయో రెండురూపాయలో బోనసు రూపములో యిచ్చినప్పటికిని ఈ రోజున State Government యొక్క బొక్కసమంతా కదిలించి నప్పటికినీ, ఇంత విపరీత వేగముగా పెరిగిపోయే ధరలను కంట్రోలు చేయలేక పోతున్నామనేది ప్రభుత్వమాలోచించి లేకపోయింది పైగా ఆ ప్రమాదాన్ని ప్రభుత్వం దృష్టిలోనికి తీసుకోలేకపోయింది. ఈ విషయము గవర్నరుగారి ఉపన్యాసములో చెప్పవలసిఉంది కాని, అలాంటిది ఏమీ కనబడదు

తరువాత గవర్నరుగారు ప్రాజెక్టుల విషయం చెప్పారు సంతోషమే, అయితే గోదావరీ ప్రాజెక్టులకు సంబంధించినంతవరకు Flood Protection Commitee ని ఒకదానిని వేశారు. గతసారి గోదావరి వరదల ప్రమాదము జరిగిన తరువాత ఆ కమిటీవారు కొన్ని సిఫార్సులు చేశారు. అందుమీదట flood Relief allotment అనేది కేంద్ర ప్రభుత్వమే యిస్తున్నది ఆ allotment ద్వారా కొన్ని works ను మేము చేయబోతున్నామని మొన్న జరిగిన బడ్జటు మీటింగు టైములోనూ అంతకు ముందు కూడా మన ఉపముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు చెప్పారు. కాని ఇందులో ఏవైనా యీ సంవత్సరము ప్రారంభించబడినవా అనేది మనము చూస్తే, ఒక్క work గూడా take-up చేసి నిర్వహించబడలేదని తేలుతున్నది. ఈ సంవత్సరము వచ్చిన గోదావరి వరదనీరు మరొక అడుగో రెండు అడుగులో పెరిగినట్లయితే, గతసారి జరిగిన damage కన్న, యీ సంవత్సరము యింకా ఎక్కువ అయ్యేదేనని ఆందోళన ప్రజలలో కలిగింది.. కాని వరద కొంచెము తగ్గుముఖము పట్టినందువల్ల ప్రజలకు కొంత ధైర్యము

వచ్చింది. లేకపోయినట్లైతే, చాలా ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడిఉండేది. కాబట్టి ప్రభుత్వము యిప్పటికైనా వరద నివారణ పనులు వెనువెంటనే చేయించడము చాలా అవసరము ప్రభుత్వం యీ విషయము ముఖ్యంగా గమనించాలి.

ఇకపోతే ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఏ విధముగా విజయవంతము అయినదో గవర్నరుగారు ఉపన్యాసములో చెప్పియున్నారు. అయితే ప్రభుత్వం సకాలములో ప్రణాళిక కార్యక్రమములు ఆలోచించలేదన్న విషయము ప్రభుత్వము గమనములోనికి తీసుకోవాలని అంటున్నాను. ఉదాహరణ చెప్పాలంటే, గత సంవత్సరము నవంబరు డిశెంబరు మాసములలో ప్రారంభించవలసిన Local Development works జనవరి, ఫిబ్రవరి మాసములలో ప్రారంభముచేశారు కాని ఆ పనులు మార్చి 31వ తేదిలోగా పూర్తి చేయాలన్న షరతుపెట్టారు. మార్చి 29వ తేదికి ఆ పనులు కొంతవరకు పూర్తి అయినప్పటికినీ, ఆ పనులకు సంబంధించిన ధనమును ఏప్రియల్ మే మాసములలో ఖర్చు పెట్టటానికి వీలు ఉన్నదని మార్చి 28వ తేదిన తెలియజేయడము అనేది జరిగింది. ఈ విధముగా కొంపరకొంపరగా పనులు జరుపడమువల్ల allot చేసిన ధనములో నాల్గవవంతు ధనము దుబారా అయిపోతుందన్న విషయము ప్రభుత్వం దృష్టిలోనికి తీసుకోవాలని కోరుతున్నాను. ఈ ధనము అసలు ఏరకముగా సకాలములో ఉపయోగించటానికి ఆలోచించకుండా ఖర్చుచేయడము జరిగిందో, పూర్తిగా తెలుస్తూనే ఉన్నది.

ఇక పంచాయతీ బోర్డుల ఎన్నికల విషయము ఉన్నది. ఈ ఎన్నికల విషయములో మొదట్లో రామరాజ్యము, తరువాత శ్రేయోరాజ్యము, అటుతరువాత socialistic pattern of Society, అన్న విధానాన్ని వరుసగా తీసుకొని రావాలని ప్రచారము చేశారు. కాని యీ విధానము జరగడము మనము ప్రత్యక్షముగా చూస్తున్నామా? కాని ఈనాడు పంచాయతీ ఎన్నికలు కొత్త పద్ధతులలో జరుపుతున్నారు. ఏడెనిమిది విధాలుగా జరపబడుతున్నట్లు మనము ఒకటిరెండు సంవత్సరాలుగా వింటున్నాము; చూస్తున్నాము కూడా. అయితే ప్రభుత్వము యీనాడు ప్రవేశ పెట్టినటువంటి గ్రామ పంచాయతీ రాజ్య స్థాపనకు Socialistic pattern of Society కనుగుణముగాపోయే దశలో ప్రవేశపెట్టిన ప్రజా స్వామ్యమును గురించి గమనించ వలసింది గవర్నరుగారు మరచిపోయినారేమో, అందువల్ల ఆయన ఉపన్యాసములో యీ సంగతి ఉదహరించబడలేదు. పంచాయతీ ఎన్నికల ఫలితాలను నిర్ణయించే హక్కు డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు కలిగి ఉన్నారు. పంచాయతీ అధ్యక్షుని ఎన్నికలు లాటరీమీద నడిపించే

పరిస్థితులుగూడ వచ్చినవి. ఈ ఏకమైన పద్ధతిలో పంచాయతీ ఎన్నికలు జరపడమనేది మంచిదేనా అని మంత్రివర్గమును అడిగితే," అందుకు మనము ఏమిచేయగలము. ఓడిపోయినవాళ్లు హైకోర్టుకో writ వేసుకుంటారు వేసుకోనివ్వండి. అంతకన్న చేసేదిమేమీలేదు" అని ముఖ్యమంత్రిగారు అన్నారు. అయినను వారు అవలంబించే ఎన్నికల విధానాలు ఎంతవరకు ప్రజాస్వామ్య పద్ధతులకు ఆచరణ యోగ్యముగా ఉన్నవో పరిశీలించమని ముఖ్యంగా మనవి చేస్తున్నాను.

ఇక అమ్మకము పన్ను విషయములో ఉల్లిపాయలను గురించే చాలా చర్చ జరిగింది. అయినప్పటికినీ నేను యీ విషయము ప్రభుత్వ దృష్టికి తీసుకొని రాక తప్పదని చెబుతున్నాను. ఉల్లిపాయలు నిత్య జీవితమునకు అవసరమైన వస్తువులు. ఇవి అందరు ప్రతిదినము ఉపయోగించుకునేవే.

The Hon Dr .B. GOPALA REDDI అట్లా అయితే. ( Orthodox) Brahmmins ఎవరు?

Sri A. VENKATARAMA RAJU Orthodox Brahmins అనేవారు ఈ రోజులలో ఎవరూ లేరండి. అందరు ఉల్లిపాయలు ఉపయోగిస్తూనే ఉన్నారు. ఉల్లిపాయలమీద ఒకలక్ష పదిహేనువేలు మాత్రమే ఆదాయము వస్తుంది. ఆ కొంచెము ఆదాయముకొరకు యీ విషయములో యింత పెద్ద గందరగోళము ఎందుకు అని మంత్రిగారు అన్నారు. లక్షపదిహేనువేల రూపాయల భాగ్యానికి యింత గందరగోళము ఎందుకు, అసలు ఆకాస్తా తీసివేస్తేనే మంచిదని అమ్మన్న రాజాగారు మంత్రివర్గానికి సలహా యిచ్చారు. దీనిని బట్టి అసలు కాంగ్రెసు పార్టీలోనే ఏకాభిప్రాయము లేనట్లు ఉన్నదేమోనని అర్థమవుతున్నది. ఈ పన్నువల్ల ఉల్లిపాయల వర్తకులలో చాలా అలజడి ఏర్పడింది. పదివేల రూపాయలకు తక్కువ వ్యాపారము చేసేవారు ఎవరూ ఉండరు. ఈ పన్ను అంతకుపైగా వ్యాపారము చేసేవాళ్ల మీదనే పడుతుంది, అందువల్ల దీనికి యింత గందరగోళము ఎందుకు అని మంత్రిగారు చెప్పారు. కాని గ్రామీణ ప్రాంతాలలో వుండేవాళ్లు వారానికి ఒకసారి తక్కెడ నెత్తిమీద పెట్టుకొని సంతలకుపోయి వ్యాపారం చేసేవారు, ఒకేచోటులో ఉండి చేసేవారుకాదు. ఇలాంటి వ్యాపారము చేసే కుటుంబాలు అనేక వేలమంది ఉంటున్నారు. ఈ నాడు ప్రభుత్వం ప్రవేశపెట్టిన విధానాన్ని బట్టి ప్రభుత్వం వద్దనుంచి లైసెన్సు తీసుకుంటేనేగాని, యీ

వ్యాపారము చేయటానికి వీలులేదు అని ఉన్నది. అందువల్ల సంతలకుపోయి వ్యాపారము చేసుకునేవాళ్ల యిబ్బందులకు పోవలసిన పరిస్థితులు వచ్చినవి. దీనివల్ల చాలా అల జడి కలుగుతున్నది ఈ యిబ్బందిని ప్రభుత్వం పునరాలోచించి తొలగించటానికి ప్రయత్నించ వలసిందిగా కోరుతున్నాను.

The Hon Dr B GOPALA REDDI ఇదివరకు ఎప్పుడో 1939 వ సంవత్సరమునుంచి ఉన్నది అప్పటినుంచి లేని యిబ్బంది యిప్పుడుయేమివచ్చింది. ఆ యిబ్బంది ఏమిటో దయచేసి వివరముగా చెప్పండి

Sri A VENKATARAMA RAJU నిజమే. 1939వ సంవత్సరమునుంచి ఉన్నది యీ రోజున చూస్తే, యిప్పటికి మూడు వారాలుగా వచ్చిన అలజడి ఎందుకు వచ్చిందో అది ముఖ్యమంత్రిగారే ఆలోచించి చెప్పాలి. 1939 వ సంవత్సరమునుంచి లేని దానిని యీ మూడువారాలనుంచి రావలసిన అవసరములేదు. దీనికి కారణము ప్రభుత్వం ప్రవేశపెట్టిన విధానమును బట్టేనని అంటున్నాను. ఈ రోజున Sales-Tax అదికార్లు తక్కెడ తలమీద పెట్టుకొనిపోయి అమ్ముకుని జీవించేవాళ్లను అడ్డగించి, వెళ్లనివ్వడములేదు.

ఇకపోతే లంకభూముల విషయములో Constructive suggestions యివ్వ మని సభ్యులను కోరుతున్నారు, మంత్రిగారు లంకభూములలో మూడవ వంతు భూమిని పశువుల మేతకు మినహాయించి, వేలము వేయమని ప్రభుత్వం ఆదేశిం చింది. అయితే పదిహేను, ఇరవై సంవత్సరాలుగా సాగుచేస్తున్న సొసైటీల చేతు లలోనుంచి ప్రభుత్వం తీసుకుని అందులో మూడవ వంతు వేలమువేస్తున్నారు. ఈ విధముగా చేయడం అసలు ప్రభుత్వం జారీచేసిన ఆర్డరువల్ల రైతాంగమునకు grass సౌకర్యము కొరకని తెలిపారు. మూడవ వంతు తీసుకోవలసింది అని రైనా అం దులో యిందుకొరకు అని నిర్దుష్టముగా వ్రాయబడలేదు. మూడవ వంతు తీసుకోమని వున్నది తప్పితే, అది grass కొరకు అని నిర్దుష్టము చేయకపోవడంవల్ల, నిర్దుష్ట ముగా లేదని జిల్లా కలెక్టర్లుకూడ చెబుతున్నారు. ఈ భూమి రైతాంగముకొరకు అనేది స్పష్టపరచకుండా మినహాయిస్తున్నారు. ఈ విషయము మంత్రిగారు గుర్తించ వలసియున్నది. ఈనాడు వచ్చిన వర్షములు, వరదలు, climate మారడమువల్ల వచ్చినవి అని ప్రజలు అనుకుంటున్నారు. సుమారు నలభై రోజులు వర్షములు కురిసినవి.

గోదావరికి. కృష్ణానదికి రెండేసి దఫాలు వరదలు వచ్చినవి. ఆ వరదలు ఎంతో తీవ్ర స్వరూపముదాల్చినవి. ఇంకను ఏ కొద్దోవచ్చినట్లైతే, damage విప రీతముగాను, చెప్పనలవి కాకుండావుండి వుండేది. అలాంటిది అదృష్టవశాత్తు తగ్గి పోవడమువల్ల, ప్రజలలో కలిగిన ఆందోళన, అలజడి, భయము తగ్గింది. ఈ విష యంలో రాష్ట్రప్రభుత్వము కేంద్ర ప్రభుత్వంవారికి ఏ విధమైన సలహాలైనా పంపినదా? అని అడిగితే, అదేమి కనబడదు వరద నివారణకు తగిన చర్యలు ఏమిటిఅని ప్రశ్నించవలసివచ్చింది. దీనికి కారణము హిందూమహా సముద్రములో హైడ్రోజన్ బాంబులు పేల్చడమువల్ల ఏర్పడినదని శ్రీ రాజగోపాలవారిగారు యింకా ఇతరుల వద్దనుంచి statements కూడ వస్తున్నవి ఏది ఏమైనప్పటికినీ, వాతావరణములో మార్పురాబట్టి యీ విధమైన పరిస్థితి ఏర్పడిందని అంటున్నారు. కాబట్టి రాష్ట్రములో వచ్చినయదార్థ స్థితిగతులు కేంద్ర ప్రభుత్వానికి తెలియపరచి, వీటి నివారణకు, యీ లాంటి వాతావరణము మరొకసారి కలుగకుండా చేయమని, కేంద్ర ప్రభుత్వమునుంచి నివారణోపాయములు సలహాలు యివ్వమని కోరవలసియున్నది. సభ్యులనుకూడ నిర్మాణయుక్తమైన సూచనలు చేయమని ఈ ప్రభుత్వము కోరుతున్నది గనుక, నిర్మాణ యుక్తమైన సూచనలే చెస్తున్నాము అవి ఎంతవరకు ఆ చరణలో పెట్టు తుందో గమనించవలసియున్నది. ఇప్పటివరకు చేసిన సూచనలు Carry out చేస్తారని ఆశిస్తున్నాము. ఇంకను భవిష్యత్తులో సూచనలు చేయవలసినవి ఉన్నవి. ఇప్పటికి యిచ్చిన సలహాలే Carry out చేయకపోతే, భవిష్యత్తులో యిచ్చే సలహాలు అనవ సరమని నా భావన. ప్రభుత్వము యీ విషయములో శ్రద్ధ వహిస్తుందని ఆశిస్తూ, సెలవు తీసుకుంటున్నాను—

Mr SPEAKER The House stands adjourned to tomorrow till 11 A M.

The House then adjourned